# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఫిబ్రవరి 1966



సంపుటము 43 : : సంచిక 2 ;

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1966


| | | |
|---|---|---|
| సఖా | శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి | 1 |
| జనాభా సమస్యలు—1 | "అంగిరస్" | 3 |
| శ్రీ కొడవటిగంటి నవలలు : ఒక పరిశీలన | శ్రీ కె. వి. రమణారెడ్డి | 11 |
| తపస్వి | శ్రీ యస్. రాధాకృష్ణమూర్తి | 34 |
| గానరసము | పండిట్ రవిశంకర్ | 37 |
| మమత | శ్రీ "మురళీకృష్ణ" | 41 |
| సమగ్ర ఆంధ్ర సాహిత్యం | శ్రీ నిడుదవోలు వెంకటరావు | 48 |
| వల | శ్రీ ఇస్మాయిల్ | 60 |
| అఖిలభారత రచయితల అయిదవ మహాసభ | శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం | 70 |
| లేఖలు | | 74 |
| కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ నాయకత్వం వ్యవహారం | శ్రీ "పరిశీలక్" | 78 |
| గ్రంథ విమర్శలు | | 85 |

# సఖా

## శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

శ్రీలవి లేని ఈ మనుజ జీవిత మెల్ల విలాస శూన్య మం
చేల తలంతువోయి? కుసుమించిన తీగల కమ్మదావులున్,
పాల పసిండి వెన్నెలలు, పర్వతసానుల నిర్ఝరమ్ములున్,
చాలవె ఇంద్రియమ్ములకు సంతస మీయగ నిత్యమున్ సఖా!

అందని వానికై నిరత మారటమందుచు జీవితమ్ములో
సుందరమౌ క్షణమ్ములను శూన్యముగా నొనరించుకొంట జ్ఞా
నాంధులు చేయు కార్యము! విహాయస పుష్ప గుళుచ్ఛ కాంక్షతో
కుందినచో మనస్సున ప్రకోప మశాంతియొ నిత్యమో సఖా!

మందను వీడి సత్యా నవమందిర మందు వసింపుమోయి! నీ
కందిన వస్తు సంచయము అల్పమె ఐనను ఉన్నదానితో
పొందుము తృప్తి! లేని యెడ మూగెడు వూపిరిగూడ తీయగా
సందులులేని ద్వేషమను సాంద్రపు ధూమములే సదా, సఖా!

ఉన్నతమైన ఏ శిఖరమో గని పైకెగ బ్రాక బోవుచో
కన్నులు గిర్రుమంచు తిరుగన్ మొదలౌను, వికారభావ మా
సన్నమగున్, తుదన్ బలము సన్నగిలున్, తలక్రిందులౌదు వా
పన్నుడవౌచు! నేల విడి పైపయి సాములు వ్యర్థమో సఖా!

ఆ తరు వెంత ఉన్నతమొ ఆకసమంటుచు తారకామణీ
వ్రాతముతో హుషారుగ పరాచిక మాడునటం చసూయతో
కాతర భావ మందకు—ప్రగాఢ తమోమయ నాగలోకపున్
లోతుల దాని వేరు లతిరూషితముల్ గద రొంపిచే సఖా!

# భా ర తి

మెండగు వేదనానల మమిత్రతత నీమది కాల్చు రోజులే
నిండవు జీవితమ్మున! వినిర్మల శాంతి సుధా మహాపగా
ఖండ పయస్తరంగముల కౌగిలి తేలెడు కాలముండులే!
ఉండినచో అమాస కల దుజ్జ్వలపూర్ణిమ నిండుగా సఖా!

శారద రాత్రులో శిశిర శార్వరులో నిరతమ్ము నిల్వ వీ
ధారుణి! కాలచక్రము సదా భ్రమణమ్ముల క్రిందు మీదగున్
నీరజ పత్ర మధ్యమున నిల్చిన వారికణమ్ము రీతి సం
సారములో ప్రవర్తిలెడు సారమెఱింగిన భద్రవౌ సఖా!

మానస మందు లేదని, అమంద సుఖమ్మది, కంచుకాగడాతో
నహముల్ నిశల్ వ్యథల త్రొటెలుచున్ వెదుకాడ లాభమే?
శ్రీ నవ శాంతి చంద్రిక, మలీమస దుఃఖ తమస్సు, రెండు, నీ
లోననె సృష్టి పొందు! సురలోకమొ, నారకమో, ఇదే సఖా!

---



# జనాభా సమస్యలు-I

"ఆంగిరస్"

జనాభాసమస్య ఇప్పటిదికాదు. ఐరోపాలో పారిశ్రామిక విప్లవానికిముందుసంగతి ఎట్లావున్నా ఆ విప్లవం అనంతరంనుంచీ ఈసమస్య వుంటూనే వుంది. పాశ్చాత్యదేశాల మేధావులు, ఆర్థికవేత్తలు బహుమంది యీ సమస్యనుగురించి అప్పుడూ చర్చించారు. ఇప్పుడూ చర్చిస్తున్నారు. అయితే అప్పటికీ ఇప్పటికీ ఒక్కటే తేడా. అప్పుడు ఆ విచారధార ఏకదేశమై ఏ దేశానికి ఆదేశంపద్ధతిని, లేక కొన్నిదేశాల సమస్తంమీద కొనసాగుతూవుండినది. ఇప్పుడు సర్వప్రపంచాన్ని దృష్టిలోపెట్టుకొని యీ జనాభా సమస్యకుసంబంధించిన ఆలోచనాధార కొనసాగింపబడుతున్నది.

చాలామందికి యీ జనాభాసమస్య కూడా ఒకపెద్ద సమస్యయేనా అనిపిస్తుంది. 1920 మొదలునడిచిన దశాబ్దంలో మనదేశంలో ఆర్థికవేత్తలయినవారు కొందరువ్రాసిన గ్రంథాలుచూస్తే యీ సమస్యనుగురించి ఇక్కడ ఎంత తేలికగా ఆలోచనలు సాగింది విదితం అవుతుంది. 1925 లో భారత ఆర్థికవేత్తలు శ్రీ పి. ఏ. వాడియ, శ్రీ జి. ఎన్ జోషిలు ఒకగ్రంథం వ్రాశారు. దానిపేరు Wealth of India అని. ఆ గ్రంథాన్ని వ్రాస్తున్నప్పుడు వీరి మనస్సులలో Adam Smith వ్రాసిన 'Wealth of the Nations' అన్న గ్రంథంపేరు మెదిలివుంటుంది. దానితో ఇక్కడమనకు సంబంధములేదు. ఈ ఇద్దరు రచయితలు తమగ్రంథంలో "జనాభా సమస్య"మీద ఒక అధ్యాయం వ్రాశారు. అందులో వారు ఆ సమస్యను ఇట్లా మదింపు చేశారు : "మాల్థస్‌గారు ప్రపంచంలో జనాభా ఒక పద్ధతిని పెరుగుతుందని. ఊహచేశారు. కాని ఆ పద్ధతిలో, ఆరేటులో ఈ జనాభా పెరగడం లేదు. మాల్థస్‌రోజుల్లో జననసంఖ్య అధికంగా వుండేది. ఇప్పుడు యీ జననసంఖ్య తగ్గుతున్నది... ఇది చాలామందికి ఆందోళనకల్గిస్తున్నది...... శ్రీ హెరాల్డ్ కాక్స్ మొదలైనవారు భారతదేశంలో జనాభా ఆధిక్యం అధికంగా ఉన్నదని వాదిస్తున్నారు. ఇక్కడి పరిపాలకులుకూడా యీ అభిప్రాయాన్ని బలపరుస్తున్నారు. భారతీయులైన కొంతమంది ఆర్థికవేత్తలుకూడా అది నిజమేనంటున్నారు. అయితే ఇక్కడ ఒక విషయంవుంది. ప్రజలచేతుల్లో డబ్బులు ఆడక, వారు తమకుకావలసిన వస్తుజాతాన్ని కొనుక్కోగల స్థితిలోలేనంతమాత్రంచేత, ఈ దేశంలో జనాభా శ్రుతిమించి పెరిగిఉన్నదని వాదించడం సబబుకాదు. జనాభా తగ్గివున్న దేశాలలోకూడా ఆ దేశాలసంపద ఇతరత్రా పోతూవుంటే, ఆదేశాలు దారిద్ర్యంతోనే బాధపడవలసివుంటుంది. అందువల్ల జనం తమకుకావలసిన అవసర వస్తుజాతాన్ని కొనుక్కోగలస్థితిలోలేకపోతున్నారు అంటే, అందుకు విరుగుడు, జనాభాను తగ్గించడంకాదు; ఆహార సంపత్తిని సంరక్షించుకొనడమూ, అభివృద్ధి పరచుకొనడము; పరిశ్రమలను అభివృద్ధి చేసుకొనడము....."

అప్పటికి వీరుచెప్పిన యీ మాటలలో కొంత నిజం ఉండవచ్చు. కాని యీ ఆర్థికవేత్తలు యీ జనాభాసమస్యవిషయంలో దూరదృష్టితో ఆలోచన సాగించలేదనే చెప్పవలసివుంది. ఎందుచేతనంటే, దేశంలో ఒకసమస్య విద్యమానంఅయి కన్పిస్తూవుంటే, ఆ సమస్యను తత్కాలపరిస్థితులనుబట్టే వారు సమీక్షచేశారుగాని, ఆ సమస్య ఉత్తరోత్తరా ఎటువంటిరూపం ధరిస్తుంది? జనాభాసమస్యలను తట్టుకునేటంతటిపద్ధతిలో, స్థాయిలో దేశంలో పరిశ్రమలను, వ్యవసాయమును అభివృద్ధిచెందించడం

సాధ్యం అవుతుందా? ఇవి త్వరితగతిని సాధ్యమైరాని పక్షంలో జనాభాసమస్యను ఏవిధంగా పరిష్కరించుకోవలసివుంటుంది? అదిగాగల ప్రశ్నలనుగూర్చి వీరు చర్చించలేదు. ఇట్లా ఈవిషయనిష్ఠంగా జనాభాసమస్యను పరిశీలించలేని మరికొందరు భారతీయులు, మన దేశంలో జనాభా ఎంతస్థాయిలోఉండవచ్చునో, ఇంకా అంతస్థాయిని అందుకోలేదని, అందువలన మనకు జనాభాసమస్య ఒకసమస్యేకాదని వాదించినసందర్భాలు కూడా ఉన్నాయి. అయితే ఇటువంటి సమస్యలు వ్యక్తుల ఇష్టానిష్టములనుబట్టి ఉద్భవించవు. ఉద్భవించిన తర్వాత ఒకరిఇష్టానిష్టములనుబట్టి లేకుండాపోవు. అందువల్లనే ఒకసమస్యయేర్పడినప్పుడు దానిని తాత్కాలసందర్భవశంగానేగాక, దీర్ఘకాలంమీద ఏవిధంగా పరిష్కారంచేసుకోవాలి అన్న ఆలోచనలు జరగవలసిన అగత్యము, అవసరము ఏర్పడుతున్నది.

## 2

జనాభాసమస్య అనగానే మాల్థస్ అనే ఆర్థిక శాస్త్రవేత్త ఏమిచెప్పివున్నాడో, పరిశీలించకుండా ఒక్క అడుగుకూడా ముందుకువేయడమునకు వలనుకాదు. ఈయన 1766 లో పుట్టి, 1834 లో చనిపోయినాడు. కేంబ్రిడ్జిలో కోలెరిడ్జి యీయన సహాధ్యాయులు. తర్వాత ప్రొటెస్టెంటు మతప్రచారకుడై జీవితంగడిపాడు. ఇటువంటి ఈయన 1789 లో Essay on the Principle of Population అన్న పేరుతో ఒకకరపత్రాన్ని ప్రకటించారు. అందులోని విషయాలు వెంటనేఅప్పటి ప్రాశ్చాత్యదేశాలదృష్టిని ఆకర్షించాయి. విచిత్రం ఏమంటే అప్పుడు ఆయన యీ కరపత్రానికి అంతటిప్రఖ్యాతిలభిస్తుందని అనుకోలేదు. బ్రిటన్‌లో గాడ్విన్ మొదలైన కొంతమందిమేధావులు చెబుతున్న ఒక విధమైన సమత్వవాదాన్ని పూర్వపక్షం చేయడానికే మాల్థస్ యీ కరపత్రం రచించాడు. ఆ కరపత్రం నామధేయంలోకూడా మాల్థస్ ఆ విషయాన్ని పేర్కొన్నారు. అంతా ఇప్పుడు మాల్థస్ ఆ కరపత్రాన్ని, ఆ తర్వాత దాన్ని విపులీకరించి ప్రకటించిన గ్రంథాన్ని Essay on Population అని అంటున్నా, మొదట్లో ఆయన దానికి “An Essay on the principle of population as it effects the future improvement of Society, with remarks on the speculations ot Mr. Godwin, M. Condorect and other writers” అని పేరు పెట్టారు.

ఇందులో ఆయనచెప్పిన సిద్ధాంతాలు ప్రపంచం ముఖంచూడ్డానికిగూడా ఒకకథ చెబుతారు. మాల్థస్‌గారితండ్రి, గాడ్విన్, మొదలైన వారి సిద్ధాంతాలయందు విశ్వాసంకలవాడు. కాని మాల్థస్‌కు అవి నచ్చలేదు. ఆయన తండ్రిదగ్గర ఆ సిద్ధాంతాలను ఇట్లా పూర్వపక్షం చేశాడు : “గాడ్విన్ మొదలైన వాళ్లు సుఖవంతమైన సమాజం నిర్మాణం కావాలంటున్నారు. కాని అది సాధ్యంకాదు. ఎందుచేతనంటే, జనసంఖ్య అన్నది పెరుగుతూవుంటుంది గనుక, జనంలో దారిద్ర్యం హెచ్చుతూవుంటుంది. మరి యీ జనాభా మామూలుగాపెరగదు. భోజనానికి, అనుభవానికి అవసరమైన వస్తువుల ఉత్పత్తికన్నా, అనగా ఆహారపదార్థాలకన్నా ఎక్కువ గతి లేక రేటు ప్రకారము జనసంఖ్య పెరుగుతుంది.” మాల్థస్‌గారి తండ్రికి తనకుమారుని యీ వాదం నచ్చింది. అందులోవున్న బలాన్ని ఆయన దర్శించాడు. ఆ భావాలకు ఒక గ్రంథంలో రూపకల్పనచేయవలసిందని తన కుమారుణ్ణి ప్రోత్సహించాడు. ఆవిధంగా ప్రపంచప్రఖ్యాతమైన మాల్థస్‌గారి జనాభాసిద్ధాంతం అవతరించింది.

మాల్థస్‌గారి జనాభా సిద్ధాంతాన్నిగురించి Wealth of India లో ప్రొఫెసర్ వాడియా శ్రీ జి. ఎన్. జోషిలు ఈవిధంగా వ్రాశారు: “జనాభానుగురించిన చర్చ అనగానే, అది మాల్థస్‌గారి జనాభా సిద్ధాంతంతో ప్రారంభం అవుతోంది. మాల్థస్ గారు యీ సిద్ధాంతాన్ని గాడ్విన్ మొదలైన రచయితలు చెప్పిన సిద్ధాంతాలకు ప్రత్యుత్తరంగా ప్రపంచించారు. గాడ్విన్ ప్రభృతులు హేతుబద్ధమైన సమాజాన్ని వూహచేశారు. ఆ సమాజంలో ప్రజలు తాము ఉత్పత్తిచేసిన వస్తుజాతాన్ని ఉదారబుద్ధితో పంచుకొని సుఖావహమైన జీవితాన్ని గడుపుతూ వుంటారని అన్నారు. ఇది ఒక విధమైన సమసమాజం. దీన్ని వారు వూహచేసి చెప్పారు. ఇది మాల్థస్‌లో ఆలోచనలకు ప్రరోచనకారి అయింది. చెట్లువున్నాయి; మృగాలు ఉన్నాయి. వానిలో పెరుగుదల ఒక పద్ధతిలో వుండివుండటము మాల్థస్ దర్శించాడు. ఆ చెట్లు, మృగాలు వాటికి బ్రతకడంనిమిత్తం భుజిక్రియకుగాను ప్రకృతిసమకూర్చిన ఆహారయోగ్య వస్తు

బాతంకన్నామించిన సంఖ్యచేత అభివృద్ధిచెందుతున్నాయి. అనగా ఆహారాన్నిమించి వాటి సంఖ్య పెరుగుతున్నది. అందువల్ల గాడ్విన్ ప్రభృతులు దర్శించిన ఉత్తమసమాజం నిజంగా ఏర్పడిందే అనుకుందాము; అప్పుడుగూడా అది నిలవదు. దాని ఉనికికి నిలకడ సన్నిహితత్త్వంకాదు. ఎందుచేత? ఆ సమాజం బ్రతికి బట్టకట్టాలి అంటే, జనసంఖ్యకన్నా ఆహార ద్రవ్యాలు అధికంగా ఉత్పత్తికావాలి. ఆ ఉత్పత్తిగూడా జనాభా పెరుగుదలకు ముందుగా కొనసాగుతూ ఉండాలి. మనుష్యజాతిలోగూడా జనాభాపెరుగుదల ఆహారఉత్పత్తినిమించి వుంటున్నది. జనాభాయేమో Geometrical Ratio లో పెరుగుతున్నది. ఆహారం ఏమో Arithmetical Ratio లో పెరుగుతున్నది. (అంటే జనాభా 1, 2, 4, 8, 16, ఇట్లా యీ నిష్పత్తిలో అభివృద్ధి చెందుతూవుండగా, ఆహారోత్పత్తి మాత్రం 1, 2, 3, 4, 5 యీ పద్ధతిలో మాత్రం పెరుగుతున్నది.)

అయితే మాల్థస్ యీ జనాభా పెరుగుదలను అరికట్టవలసిన అవసరాన్నిగూర్చికూడా తమ యీ గ్రంథంలో ఉద్ఘోషించారు. జనాభాపెరుగుదలను అరికట్టకపోయినట్లయితే, జనం ఎక్కువ, ఆహార ద్రవ్యాలు తక్కువ అయిపోతాయన్నారు. ఈ సందర్భంలో ఆయన పైన పేర్కొన్న Geometrical Ratio, Arithmetical Ratio లను ప్రవేశపెట్టినా, మొదటి కరపత్రాన్ని విస్తరించివ్రాసినప్పుడు, యీ Ratio ల వ్యవహారాన్ని, పూర్వపుగ్రంథంలోకన్నా కొంత వెనక్కునెట్టారు. మొదటి గ్రంథంలో జనాభా పెరుగుదల ఎట్లా అరికట్టబడుతుందో ఒకవిధంగా మాల్థస్ వివరించారు. వాటిని ఆయన "సహజమైన అంకుశాలు" అన్నారు. అవి జాడ్యాలు, కరువులు, యుద్ధాలు. ఇంకా ఇతర దురాచారాలనుకూడా ఆయన యీపట్టీలో పేర్కొనడం జరిగింది. జనాభామీద తొలి కరపత్రాన్ని ప్రకటించిన ఐదు సంవత్సరాల అనంతరం దాన్ని విస్తరించి, మొదటి దానికన్నా శాస్త్రనిష్ఠంగావ్రాసిన రెండవగ్రంథం వచ్చింది. మొదటి గ్రంథాన్ని ప్రకటించినవెంటనే వచ్చిన అనుకూల, ప్రతికూల విమర్శనములను, ఖండన మండనములను మాల్థస్ లెక్కచేయలేదు. తాను దర్శించిన జనాభాసిద్ధాంతాన్ని నిల్పడానికి ఇంకా ఎక్కువ సమాచారాన్ని, ఎక్కువ అంకెలను సంపాదించారు. ఇప్పుడు ఆయన ఒక్క బ్రిటన్‌ను మాత్రమే దృష్టిలో పెట్టుకోలేదు. మరికొన్ని యితరదేశాలకుసంబంధించిన ఇట్టి సమాచారాన్నికూడా ప్రోగుచేశారు. ఇంతటి సమాచారాన్ని మననంచేసి, తిరిగి తన జనాభా సిద్ధాంతాన్ని కొత్తరూపంలో గ్రంథంగా ప్రకటించారు.

ఈ గ్రంథంలోకూడా మాల్థస్ తన ఆది సూత్రాన్ని వదిలిపెట్టలేదు. ఆహార ద్రవ్యాల ఉత్పత్తికి మించి అధికమై పెరిగే లక్షణం జనాభాకు ఉన్నదనే సూత్రాన్నే ఈ గ్రంథంలోకూడా ఆయన సిద్ధాంతీకరించారు. జనాభాపెరుగుదల నిరోధానికి ఈ సారి కొత్తరకం "అంకుశాలను" (checks) గూడా మాల్థస్ పేర్కొన్నారు. యుద్ధము, జాడ్యము, క్షామము మొదలైన నిసర్గమైన "అంకుశాలే" గాక, ప్రయత్నంచేత జనాభాపెరుగుదలను నిరోధించవచ్చునని ఇప్పుడు మాల్థస్ గుర్తించారు. ఇందులో ప్రధానమైనది 'నైతిక సంయమనం.' ఈ మాటకు మాల్థస్ అర్థం ఇది. పెళ్లిళ్ల వాయిదా వేసుకొనడం; సంసారం చెయ్యడములో నిష్ఠురసంయమనాన్ని పాటించడం.

మాల్థస్‌చెప్పిన యీ "అంకుశాల"లో విద్య కూడా ఒకటి. జనాభా పెరుగుదలను అరికట్టాలంటే, ఇందుకు సంబంధించిన బాధ్యతలు జనానికి బాగా అవగతం కావాలి. మరి విద్యావ్యాపనం అంటూ లేకుండా ఇది ఎట్లా సాధ్యం అవుతుంది? విద్యవలన సభ్యత పెరుగుతుంది. జనంలో సుఖానుభవానికి సంబంధించిన బుద్ధివిశేషం ప్రమాణికస్థితిని పొందడానికి వీలుఏర్పడుతుంది. జనంలో పొదుపు, నీతి అధికం కావాలన్నా, విద్యావ్యాపనం తప్పదు. అందువల్ల సామాన్యజనంలో విద్యావ్యాప్తిగూడా జనాభా పెరుగుదలకు ఒక విధమైన "అంకుశం" గా పని చేస్తుందని మాల్థస్ సిద్ధాంతీకరించారు.

మాల్థస్ పెద్ద విద్వాంసుడు. విద్వాంసులకు మిత్రుడు. ప్రఖ్యాత ఆర్థికశాస్త్రవేత్త రికార్డో, ఈయన కూర్చిన మిత్రులు. రికార్డోగారికి మాల్థస్ గారి సలహాసంప్రదింపులు వుండేవని అంటారు. అనంతరకాలంలో డార్విన్‌గారి సిద్ధాంతం అవతరించడానికి మాల్థస్‌గారు కొంతవరకు ప్రేరేపకులు. ఎందుచేతనంటే "struggle for existance" అన్న పదబంధం డార్విన్‌గారి సిదాంతాలలో శేఖర

స్థానంలోవుంది. నిజానికి ఆ పదబంధాన్ని తొలిసారిగా కూర్చినవాడు మాల్థస్‌గారు.

మాల్థస్‌గారి ఆర్థికసూత్రాలనుబట్టే 'The law of diminishing returns' అనే ఆర్థిక సిద్ధాంతం ఉద్భవించింది. ఇక్కడ మాల్థస్‌గారిని, వారి జనాభాసిద్ధాంతాన్నిగురించి మాత్రమే అనుకుంటున్నాము గనుక, ఆ యితర సిద్ధాంతం సంగతి వివరణము అప్రస్తుతం. ఇక్కడ చెప్పవలసింది ఇది. మాల్థస్‌గారి జనాభా సిద్ధాంతాన్ని, ఆయన కాలంలోను, అనంతరము, ఇప్పుడూకూడా పూర్వపక్షం చేసినామనుకున్నవాళ్లు, విమర్శిస్తున్నవాళ్లు వున్నారు. కాని మాల్థస్‌గారి సిద్ధాంతం ఈ మహా కాలంమీద హెచ్చుకుందులకు లోనైనా, అసలు సిద్ధాంతం మాత్రం చెక్కుచెదరకుండా, ప్రపంచం ముందు "తస్మాత్, జాగ్రత్, జాగ్రత్" అని హెచ్చరిస్తున్నదో అన్నట్లు అట్లా నిలిచియేవుంది.

## 3

మాల్థస్‌గారి యీ జనాభాసిద్ధాంతాన్ని ఆయన కాలంలోనేగాక, ఆ తర్వాతకూడా విమర్శించిన చాలామందికి ఆయన్ను పూర్తిగా కాదనడం సాధ్యం కాకపోయింది. కారల్‌మార్క్సు ఒక్కరే మాల్థస్ సిద్ధాంతాన్ని ఆ మూలం నిరసించారు. ప్రత్యామ్నాయంగా వేరే సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. అప్పటి సంగతి యేమోగాని, ఇప్పుడు మార్క్సుగారి ఆ జనాభాసిద్ధాంతాన్ని తలపెడుతున్నవారే అంతగా కనిపించరు. ఎంతమంది విమర్శకులు ఈ జనాభాసిద్ధాంతాన్ని ఖండించారో, అంతమందీ మన్నన చేసినవాళ్లు ఉన్నారు. 19 వ శతాబ్దం మొదటి 50 సంవత్సరాలలోను మాల్థస్ సిద్ధాంతం ఆర్థికశాస్త్రప్రపంచాన్ని బ్రహ్మాండంగా ఏలింది. ఆ తర్వాత దాన్ని తిట్టడమే గొప్ప అనుకున్నవాళ్లు బయలుదేరారు. తిరిగి 1914—18 యుద్ధం, అనగా మొదటి ప్రపంచ యుద్ధం జరిగిన అనంతరం తిరిగి మాల్థస్ సిద్ధాంతానికి ప్రాణంవచ్చింది.

మాల్థస్‌ను మన్ననచేసినవాళ్లసంగతి అట్లా వుంచి, విమర్శించినవారి సంగతితీసుకుచూద్దాము.

ఈ సిద్ధాంతాన్ని మాల్థస్ ప్రపంచిన రోజుల్లో బ్రిటన్‌లో"పూర్‌లా"లు అమలులోఉండేవి.పట్టణాలలో పరిశ్రమలు అభివృద్ధి చెందుతూ, వ్యవసాయంలో కూడా విప్లవాత్మకమైన మార్పులు వస్తూఉన్నందువల్ల పల్లె పట్టులనువదిలి జనం పరిశ్రమలు అభివృద్ధి చెందుతున్న ప్రాంతాలకురావడం మొదలుపెట్టారు. పనిపాటలేనిజనం ఎక్కువఅయిపోయినారు. జననసంఖ్య పెరిగిపోతూవచ్చింది. అకించనులకు భక్తిచూపడంకోసం బ్రిటన్ "పూర్‌లా" లను ప్రవేశపెట్టింది. మాల్థస్ వాటిని ఖండించారు. తన సిద్ధాంతం ఆధారంగా ఆయన యీ "పూర్‌లా" లు పనికిరావని నిర్ధారణచేశారు. అందువల్ల కొందరు బ్రిటన్‌లోవున్న తత్కాలపరిస్థితులను దృష్టిలో పెట్టుకొని మాల్థస్ యీ సిద్ధాంతాన్ని తెచ్చిపెట్టాడు అన్నారు.

ఇది నిజంకావచ్చు; కాకపోవచ్చు. ఆ కాలానికి, ఆ పరిస్థితులకు ఒక్క ఇంగ్లండులోనే గాక, ఐరోపాలోని తక్కిన దేశాలలోగూడా మాల్థస్ చెప్పినటువంటి జనాభాపెరుగుదలపరిస్థితి గోచరం అవుతూ వచ్చింది. నిజంచెప్పాలంటే మాల్థస్‌కన్నా ముందే ఇది ఇట్లా వున్నదని గుర్తించినవారు వున్నారు. ఈ విషయాన్నే ఎంతో హెద్దేవాతో కారల్ మార్క్సు తన "Capital" మొదటిభాగంలో ఒకచోట ఇట్లా పేర్కొన్నారు : "పాఠకుడుగనుక ఈ సందర్భంలో నాకు మాల్థస్ వ్రాసిన "Essay on Population" ను గుర్తుకు తెచ్చినట్లయితే, నేను ఆ పాఠకునికి ఈ విషయం చెప్పదలచుకున్నాను. మాల్థస్ వ్రాసిన ఆ గ్రంథం తొలిరూపం వట్టిదేచెగా వుంది. డేఫో, సర్ జేమ్స్ స్టూవార్ట్, టౌన్‌సెండ్, ఫ్రాంక్లిన్ వాలేస్ మొదలైనవాళ్లు చెప్పినదాన్ని మాల్థస్ "కాపీ" కొట్టాడు. అందులో ఒక్క వాక్యం కూడా ఆయన స్వంతం అని చెప్పతగిందిలేదు. ఆ కరపత్రాన్ని ప్రకటించినప్పుడు అంతా ఎంతో ఉత్సుకతను చూపడం జరిగింది అంటారు. నిజమే. అందుకు 'పార్టీ' ఆసక్తి ఒక్కటే కారణం. ఫ్రెంచి విప్లవాన్ని సమర్థించే జనం బ్రిటన్‌లో, అధికమౌతూవచ్చారు. కాండొరెక్ట్ మొదలైనవారి బోధలకు ప్రశస్తి హెచ్చుతున్నది. ఆసందర్భంలో, ఆ బోధలకు విరుగుడుగా యీ జనాభా సిద్ధాంతం లేవనెత్తబడింది. 18 వ శతాబ్దంలో నెమ్మదిగా రూపందాలుస్తూవచ్చిన యీ సిద్ధాంతానికి సుష్ఠురూపం ఇచ్చి బాజాభజంత్రీలతో

ప్రయోగించడం మొదలుపెట్టారు. ఇంగ్లీషు ధనికవర్గం యీ సిద్ధాంతాన్ని ఎంతో మెచ్చుకున్నది. అది ప్రచారం లోకి వస్తున్నందుకు సంతోషించింది. తన సిద్ధాంతం యొక్క విజయాన్ని చూచి మాల్థస్ ఎంతో ఆశ్చర్య పోయినాడు. సంతోషించాడు. అప్పుడు దాన్ని ఒక గ్రంథంగా తయారుచేస్తే బాగుంటుందని అనుకున్నాడు. ఈ కొత్త పుస్తకంలో మాల్థస్ చేర్చిందికూడా ఆయన స్వంతంకాదు. ఇంకొక్కరు చెప్పినదాన్ని తన గ్రంథంలో చేర్చుకున్నాడు....... ఒక్క ''జర్టెస్''ను మినహాయిస్తే, జనాభామీద సిద్ధాంతాలుచేసినవాళ్లంతా ప్రొటెస్టెంటులు. జర్టెస్ వెన్నిస్‌లో మతగురువు. ఈయన చాలా తెలివిగలవాడు. ప్రతిభగల రచయిత. నిజంగా జనాభా సమస్యలనుగురించి ఏమన్నా స్వంతంగాచెబితే ఈయన చెప్పాడనవచ్చు.

ఇట్లు మాల్థస్ సిద్ధాంతాన్నిగురించి కారల్ మార్క్సు ఇంత హెద్దేవాగా వ్రాసినా, ఆ వ్రాసింది పూర్తిగా నిజంకాకపోయినా, కొంత నిజంవున్నదని అంగీకరించాలి. మాల్థస్‌కుముందే ఐరోపాలో ఇటలీలో జనాభాసమస్యనుగురించిన పరిశీలనలు ప్రారంభ మైనాయి. మాఖివిల్లీ, బోటేరో, సెట్యూరా, జుక్కోలో షిరమోంటి, డెసీనా, బ్రుస్టోలినీ మొదలైనవాళ్లు యీ పరిశీలనలు సాగించారు. అదేవిధంగా ఈ సమస్యను పట్టించుకున్న ఆర్థికవేత్తలుకూడా ఇటలీలో మాల్థస్‌కు ముందులేకపోలేదు. ఆల్గరోట్టి, బండీని, బెక్కారియా, బెల్లోని, బ్రిగాంటి, కార్లి, కొర్నారో, పాల్మెరి, డిడి, ఆర్కో, షిలాంగియర్, గెనొవేసి ప్రభృతులు ఇటువంటివాళ్లు. వీరి అందరిలోను మిగిలి జనాభాసమస్యలను గట్టిగా పరిశీలనజరిపినవాడు మార్క్సు పేర్కొన్న జర్టెస్ అనే ఆయన. అలెస్సాండ్రోన్ స్టాంజో అనే ఆధునిక ఇటాలియన్ ఆర్థికవేత్త ఇటీవల తమ ఒక పత్రంలో జర్టెస్‌ను గురించి వ్రాస్తూ, ''మాల్థస్‌కు (జనాభాగురించిన) అభిప్రాయాలలో అతి సన్నిహితుడని చెప్పదగినవాడు ఈయన'' అని వ్రాశారు. అంతేగాక మాల్థస్ ప్రవేశ పెట్టిన గణితశాస్త్రసంబంధమైన Ratio లు, లేక నిష్పత్తులు ఇటాలియన్‌లే ముందు ఆలోచించారు. వీరిలో జర్టెస్‌కూడాఉన్నారు. అయితే ప్రొఫెసర్ కాన్‌స్టాంజో వీరికంటే మాల్థస్ ఎక్కడ వున్నతుడో పేర్కొన్నారు. ఈ జనాభాసిద్ధాంతాన్ని చెప్పడంలో మాల్థస్ స్పష్టంగా, విశదంగా చెప్పగల్గారు. సమాజసమస్యలకు, యీ జనాభాసిద్ధాంతానికి ముడికుదిర్చిందికూడా మాల్థస్‌గారే. అందువల్లనే ఇప్పటివరకు ఆయనసిద్ధాంతాన్ని 'ఔ'ననడమో లేక 'కాదు' అనడమో, లేక ఆయన చెప్పినదాంట్లో నిజం లేకపోలేదనడంమీదనో జనాభాసిద్ధాంతం తాలూకు చర్చలన్నీ నడుస్తున్నాయి.

## 4

మాల్థస్‌గారి జనాభాసిద్ధాంతం మరికొన్ని విధాలయిన విమర్శలకుకూడా గురిచేయబడింది. ఆహారపదార్థాలవిషయంలో ఆయన ఆలోచనా పరిధి సంకుచితమైనదని, కొందరు అన్నారు. ముఖ్యంగా మాంటెస్ క్యూ అనే ఫ్రెంచి ఆర్థికవేత్త మాల్థస్ వట్టి శాఖాహారాన్ని, తృణాదికములైన ధాన్యాలను మాత్రమే లెక్కలోకి తీసుకున్నారుగాని, చేపలు మొదలైన మాంసద్రవ్యాలను దృష్టిలోపెట్టుకొని, ఆహారవ్యవహారాన్ని మదింపుచేయలేదని వాదించడంవరకూ యీ విమర్శలు నడిచాయి. మాల్థస్ తర్వాత విజ్ఞానశాస్త్రం ఎంతో అభివృద్ధి చెందిందని, ప్రకృతిని మానవుడు తన అంకెకు తెచ్చుకొనడం అధికం అయిందని, యీ మహావిజ్ఞానాన్ని వ్యవసాయ క్షేత్రాలలో అభివృద్ధిసాధనకు వినియోగించడం వలన ఆహారోత్పత్తి ఎంతగానో అధికంఅయిందని మాల్థస్ తర్వాతివారు వాదిస్తూవచ్చారు. కొందరు మాల్థస్ తన మదింపులో Law of Diminishing returns ఏలుబడి సాగించిందని, ఆయన అట్లా చేయడం సరికాదని అన్నవారున్నారు. మాల్థస్ గారికాలంనాటికి ఇంగ్లండులో పరిశ్రమలు మొదలైనవి అంతగొప్పగా వృద్ధిచెందలేదు గనుక, దేశసంపత్తియొక్క శక్తిసామర్థ్యాలు ఎట్టివో విదితం కాకముందు పుట్టిన అపక్వసిద్ధాంతం అని కూడా ఆయన జనాభాసిద్ధాంతం తెగడబడింది. ప్రపంచంలో వివిధరాజ్యాలు అభివృద్ధి చెందుతూవున్నకొద్దీ వస్తూత్పత్తి, ఆహారోత్పత్తి అధికమై పూర్వంకన్నా ఎక్కువమందిజనం హాయిగా బ్రతకడానికి వీళ్లుఏర్పడ్డమాట నిజమే. అంతేగాక ఒక దేశంనుంచి ఇంకో దేశానికి ప్రజలు తరలివెళ్లడం, అక్కడ నివాసాలు ఏర్పాటుచేసుకొనడం మొదలైన పద్ధతులద్వారాకూడా యీ జనాభాసమస్య కొన్ని

కొన్నిదేశాలలో తాత్కాలికంగా పరిష్కారంఅయి నట్లు కన్పిస్తూవచ్చింది. ఈ జనం వలసపద్ధతిని మాల్థస్ గుర్తించలేదని, పరిశ్రమల అభివృద్ధివలన ఎక్కువమంది ప్రజలను భరించడం తేలికఅవుతుంది అన్న విషయాన్నికూడా ఆయన గమనించలేదని వాదించేవారున్నారు. కాని మాల్థస్‌నాటికే యీ వలసపద్ధతి ఏర్పడివుంది. ఆయనకు అది తెలియదని అనడం ఎట్లా? ఇక పరిశ్రమలు, వాటి అభివృద్ధి మొదలైన వ్యవహారంవున్నదంటే, ఆవిషయాన్ని ఆయన తన జనాభాసిద్ధాంతగ్రంథంలో పేర్కొని వుండకపోవచ్చు. కాని అది ఒక్కటేకాదు ఆయన వ్రాసిన గ్రంథం. Principles of political Economy అని కూడా ఆయన వ్రాసిన గ్రంథం వుంది. మాల్థస్‌గురించి విమర్శనచేసినవాళ్లు, చేస్తున్నవాళ్లు, ఈ గ్రంథాన్ని అట్టే పట్టించుకొనడం లేదని, అందువల్ల ఆయనచెప్పింది ఏమో పూర్తిగా అవగాహనచేసుకొనకుండా చాలామంది మాట్లాడుతూ వచ్చారని ఇటీవల ఒక ఆర్థికవేత్త అన్నారు. ఈగ్రంథంలో మాల్థస్ పరిశ్రమల అభివృద్ధి సంగతిని, జనాభాసమస్యకు ముడిపెట్టి కొంతవరకు చర్చించారు.

మాల్థస్‌గారి సిద్ధాంతం ఒకప్పుడు యదార్థమేనని, అప్పటి పరిస్థితులనుబట్టి అది అప్పటికి యదార్థం అయినదని, తరువాత పరిస్థితులు మారిన కారణంచేతఅది అయదార్థం, ఆ నూతన పరిస్థితులలో అది యదార్థం కాలేకపోయినదని ఒక వాదంవుంది. బెర్ట్రాండ్ రస్సెల్ యీ కోవకు చెందినవారు. ఆయన తమ Principles of Social Reconstruction లో మాల్థస్ సిద్ధాంతాన్నిగురించి ఇట్లా వ్రాశారు: "మాల్థస్‌గారు తమ జనాభాసిద్ధాంతాన్ని వ్రాసినప్పుడు, ఆ కాలానికి అది యదార్థమే. కాని తర్వాత తర్వాత అది ప్రపంచ జనాభాలో పాశ్చాత్య రాజ్యాలకు, అమెరికాకు సంబంధించినంతవరకు అయదార్థం అయిపోయింది. ఇందుకు కారణాలు చెబుతాను. తల్లిదండ్రులు పిల్లలయందు శ్రద్ధ అధికమైనవారైనప్పుడు, పిల్లలకోసము పెట్టవలసిన ఖర్చు అధికం అవుతున్నది. కనుక ఎక్కువమంది పిల్లలు కల్గితే, వారిని సరిగా పోషించడము పడదు గనుక, ఆత్మగల తల్లిదండ్రులు పిల్లలు ఎంత తక్కువ అయితే అంత సంతోషంగా ఉండగల్గుతున్నారని, అందువల్ల సంతానము జాస్తి కాకుండా చూచు కుంటున్నారని అర్థం. స్త్రీలను తీసుకొని చూస్తే, వారు కూడా ఇప్పుడు తమకు పిల్లలు పుట్టకుండా వుండటమే బాగుంటుందనుకుంటున్నారు. మహాఅయితే ఒకరో ఇద్దరో పిల్లలు కల్గితే చాలుననుకుంటున్నారు. అందుచేత వారి ఉద్యోగములకు పిల్లలవలన ప్రతిబంధకము ఏర్పడుతున్నదన్న భావము స్త్రీలలోకల్గింది.

జనాభాలో స్త్రీల సంఖ్య అధికము కావడము వలన, చాలామంది స్త్రీలు పెళ్లిళ్లే చేసుకొనడములేదు. లేదా చాలామందికి పెళ్లిళ్లు కావడములేదు. యుద్ధం అంటూ వచ్చిన అనంతరము స్త్రీలకు ఉద్యోగావకాశాలు అధికము అవుతున్నాయి. అయితే ఇది తాత్కాలికము కావచ్చును. అయినా కొందరు స్త్రీలు ఉద్యోగములలో నిల్చిపోక తప్పదు."

ఇక్కడ ఈ సిద్ధాంతాన్ని గురించి గమనించవలసిన విషయం ఏమిటో ఒకటివుంది. దానిని రస్సెల్ గారు పేర్కొనివున్నారు. ఈ సిద్ధాంతం అభివృద్ధి చెందివున్న పాశ్చాత్య దేశాలకు వర్తించదు—అని. అది నిజం కావచ్చు. కాకపోవచ్చు. అమెరికా విషయమే తీసుకు చూస్తే,అక్కడ ఆ దేశంలో దాదాపు 5 కోట్ల వరకు అకించనులు వున్నట్లు తెలుస్తుంది. అక్కడ—అమెరికాలోవున్న ఆ దారిద్ర్యంమనవంటిబడుగుదేశాలలో విధంగా వుండకపోవచ్చు. ఇక్కడ మనవంటి దేశాలలో దారిద్ర్యం సర్వాంతర్యామి. అక్కడకాదు. ఆ కాకపోవడమువలన ఆ దారిద్ర్యముయొక్క తీవ్రత విస్పష్టమై కన్పించడము సహజము. మరియు అది ఆ దేశములోని సౌభాగ్యముతో పోల్చి చూచినప్పుడే దారిద్ర్యముగ భాసిస్తుంది. బడుగు దేశములతో పోల్చి చూచినచో ఆ అకించనులే ధనవంతులు. ఇంతకూ ఇక్కడ చెప్పవచ్చున దేమనగా, మాల్థస్‌గారి సిద్ధాంతము అమెరికా మొదలైనటువంటి దేశములలో చెల్లక పోయినను, ఏ పరిస్థితులలో ఆయన ఆ సిద్ధాంతమును ప్రపంచించుట జరిగినదో, ఆ పరిస్థితులు ధనిక దేశములలోకూడా రహితం కాలేదు. మరియును ఆ సిద్ధాంతం ఆయన ఎప్పుడో చెప్పిన పద్ధతిలోననే కన్పించాలని ఎక్కడాలేదు.అన్నమునకు వలయు ద్రవ్యాదికములన్నియు అధికముగా వుండి, ఆ పుష్కల్యములో దారిద్ర్య మనుభవించువారు వుండటము కూడా

మాల్థస్‌గారు దర్శించిన జనాభా సిద్ధాంత తత్త్వముతో భాగమే. కాదనలేము.

ఇది అంతయు వేరు విషయము. ధనిక దేశములలో,అభివృద్ధి చెందిన దేశములలో యీసిద్ధాంతం పట్టినా, పట్టకపోయినా, బడుగు దేశాలలోమాత్రం ఆ సిద్ధాంతం అనువర్తిల్లుతున్నది. జనాభా పెరుగుదలకు తగినంతగా ఆహార ధాన్యోత్పత్తిగాని, ఇతర ఆహారముల ఉత్పత్తిగాని కొనసాగడములేదు. మన దేశాన్ని ఉదాహరణంగా తీసుకున్నా ఇది ఇట్లా అని గోచరిస్తుంది. జనాభా పెరుగుదలను అరికట్టకపోయినా, జనాభా పెరుగుదలకు తగినట్లు ఆహారపు పంటలను, ఇతర ఆహారములను అభివృద్ధి చెందించుకొనకపోయినా, మాల్థస్ దర్శించిన ప్రధాన సిద్ధాంతం తు. చ. ఆయన చెప్పినట్లు కాకపోయినా మరోవిధంగానైనా పనిచేస్తుంది. ఈ విషయాన్ని భగ్యంతరంగా ప్రపంచ ఆహార సంస్థ డైరెక్టరుజనరల్ డా. బి.ఆర్. సేన్ ఇటీవలనే విశదం చేశారు.

ప్రపంచ ఆహార సంస్థవారు 1965 అక్టోబరులో తమ వార్షిక నివేదికను ప్రకటించారు. "The State of Food and Agriculture,1965" అని. ఆ నివేదికకు డా॥ సేన్ "ముందు మాట" వ్రాశారు. ఆ మాటలో ఒకచోట మాల్థస్‌గారి సిద్ధాంతం ప్రసక్తి వచ్చింది. డా. సేన్ వ్రాసిన వాక్యాలు ఇవి : "The most critical phase which now opens with the third post-war decade is the one when Malthusian correctives will inexorably come into play unless organised will and dedicated endeavour, which we have been trying to build through our various efforts, can find effective expression". ఈ మాటలకు అర్థం ఏమిటంటే, డా. సేన్ గారి వాక్యంలో రెండో భాగం ప్రకారం పనులు జరక్కపోతే మాల్థస్‌గారు చెప్పిన"అంకుశాలు" లేక corretive లు వాటి పని అవి చేసుకుపోతాయి. అనగా జాడ్యాలు మొదలైనవివచ్చి జనాభాపై తమ వికటమైన విలసనాన్ని ప్రదర్శనం చేస్తాయి.

ఇక్కడ డా. సేన్‌గారు ఆ "ముందుమాట"లో వ్రాసిన ఇంకో వాక్యాన్ని కూడా పరిశీలించవలసి వుంది. ఆ వాక్యం ఇది : F A O studies indicate that the total food supplies of the developing countries will have to be increased fourfold in the next 35 years to give their vastly incresed populations an adequate though in no sense lavish diet."

మాల్థస్‌గారు ఏమన్నారంటే జనాభా పెరుగుదలకు దీటుగా ఆహారాది ద్రవ్యాలు పెరక్కపోయినట్లయినా, జనాభా పెరుగుదలను అరికట్టకపోయినట్లయినా, ఒక 25 సంవత్సరాలలో ఆహారద్రవ్యాలు లభ్యము అవడముకన్నా, జనాభా రెట్టింపు అయిపోతుంది అని. ఇప్పుడు డా. సేన్ గారు వచ్చే ముప్పదిఅయిదు ఏళ్లను మొత్తము ఆహారపు సరఫరా నాల్గురెట్లుకాని పక్షంలో అభివృద్ధి చెందుతూవున్న దేశాల పరిస్థితి అస్తి నాస్తి విచికిత్సా హేతువు (ఆహారం విషయంలోనే అనుకోండి) కాగలదంటున్నారు.

మరి మాల్థస్ సిద్ధాంతానికి చెప్పుకోతగిన అపవాదం ఎక్కడ?

---



# శ్రీ కొడవటిగంటి నవలలు : ఒక పరిశీలన

శ్రీ కె. వి. రమణారెడ్డి

## 1

### సొంత మొహరు

ముప్పై ఏళ్ల కిందటి మాట. అప్పటికి శ్రీరంగం శ్రీనివాస రావుగారూ (శ్రీశ్రీ), కొడవటిగంటి కుటుంబరావుగారూ (కె. కె.) జీవితంలోనూ రచనా జీవితంలోనూ పిల్లకారు కిందనే జమ. తెలుగు కథకుల గురించి ఇంగ్లీషున 'త్రివేణి' పత్రికలో శ్రీశ్రీ ఒక వ్యాసం ప్రకటించారు. అప్పటికి ప్రఖ్యాతి పొందిన వారిని కొందరిని పేర్కొని, అప్పుడప్పుడే పైకి వస్తూవుండిన కె. కె ని కొద్దిగా మెత్తగా మందలించడం జరిగింది. గుడిపాటి వెంకటచలంగారి ధ్వనికి కె. కె ప్రతిధ్వనిగా శ్రీ. శ్రీ కి కనిపించారు.[1] ఈ వాక్యం చివర ఆశ్చర్యార్థక సంజ్ఞ (!) ఉండవలసిందేగాని నాకు మాత్రం అది అనవసర మనిపిస్తున్నది.

కె. కె. నవలలు పరీక్షగా చదవక ముందు నాకు గూడా, శ్రీ. శ్రీ పైవిధంగా రాసిన ముప్పై ఏళ్ల తర్వాత, అలాంటి 'అభిప్రాయమే' ఉండేది. నిజానికి దీనిని 'అభిప్రాయం' అనడమే సరికాదు. అపోహ అనవలసి ఉంటుంది. ఒక విషయాన్ని సాకల్యంగా చూసి, లోతుముట్టా తరచి, సరైన ఉపపత్తుల బలంతో ఏర్పరుచుకున్న భావాన్నే అభిప్రాయం అనాలిగాని, ఆకుకు అందని పోకకు పొందని భావాన్ని అనకూడదు.

ఒకరికి ఇంకొకరు ప్రతిధ్వని అనడం, అట్లాగని నిరూపించడం కంటె సులువైన పని. దానికి ఓపికగాని ఆలోచనగాని అక్కరలేదు. మూలంలోనే కె. కె. స్వతంత్రులు. ఏ ఒక్కరినీ ముందుంచుకుని ఆ మేలుబంతిలో తమ రచనలు సాగించలేదు. ఎవరి రచనాప్రభావాలైనా ఆయన మీద ప్రసరించే ఉండి నట్లైతే, అవి కంటికి కనిపించేవి కావు. ఈనాడు శ్రీ. శ్రీ కూడా ఆనాళ్లలో తామన్న మాటలను, ఇంగ్లీషు వాడనేట్లుగా, 'తిని వేయడానికి' సిద్ధమే. పైగా, కె. కె లో ఇప్పుడు శ్రీ. శ్రీ కి రష్యన్ కథాకారుడు చెఖవ్ కనిపిస్తున్నాడు. అంటే కె. కె. చెఖవ్‌కు నకళ్లను సృష్టించారని కొత్త అభియోగం కాదిది. చెఖవ్ అంతటి వాడని ధ్వని. కావచ్చు. ఈ అంశం గురించి కె. కె. నాకు రాసిన ఒకలేఖలో ఇలాగన్నారు:

"నేను నవలలు రాయటానికి ఎవరి influence గాని ఉన్నట్టు తోచదు. చలంగారిది అసలే లేదు. మిగిలిన నవలా కారులు నాకు చలంగారి కన్న కూడా దూరంగా ఉన్నవాళ్లు. నేను అభిమానించే పాశ్చాత్య నవలాకారులు చాలామంది ఉన్నారుగాని వారి ప్రభావం నాకు ఏవిధంగానూ ఉపకరించలేదు.

"....చెఖోవ్ ప్రభావం కూడా నామీద ఏమీలేదు. ఉండే అవకాశం లేకపోయింది. చిన్నకథలు రాయటంలో set అయిపోయి నాక చెఖోవ్ కథలు చదివాను. చెఖోవ్ నవల ఒకటే చదివాను. అది నా కిప్పుడేమీ జ్ఞాపకంలేదు...."

మంచి రచయితలక్షణాలలో ఇది ఒకానొకటి కావడమేగాక, చాలా ముఖ్యమైనది. ఏమిటంటే, గురువులకు ఆజన్మాంతమూ ఒక లఘుప్రాయుడుగా ఉండక, తనకు తానొక గురువు కావడమే రచయితకు ప్రాణవాయువు. గురువులు ఉండకపోరు. అయితే వారు శిష్యుని రక్తంలో రక్తమై రూపాంతరం చెందుతారు. అతని సొంతమైపోతారు. అది వారికీ అతనికీ చేకూరవలసిన ఆదర్శపరిణామ మనాలి. గోపీచంద్ ఒక నవలలో అన్నట్లు, నోటి వెంట లోనికి వెళ్లిన వస్తువు మరొక దానివెంట అదేవిధంగా బయల్పడితే లాభమేమిటి? అది అరుగుడుపడి సారం లోపల నిలిచి పోయి పనికిరానిదే నిష్క్రమించాలి. పాత్రల ఎన్నికలోనూ, కథ కట్టుబడిలోనూ కె. కె. రచనలకు మరొకరి రచనలతో పోలు ఉన్నట్లు కనిపించవచ్చునేమోగాని, వాటి కివి నకిలీలు మాత్రం

1 The short story in Telugu-Triveni: Aug-Sep. 1939. "At present the influence of sri Gudipati Venkata chalam is too greatly on him. once he shakes it off he can be expected to scale the higher reaches of artistic endeavour."

కావు. భాష, భావం, కె. కె. మొహరుతోటి విలక్షణంగా కనిపిస్తాయి.

రాశి—విలువ

పుంఖానుపుంఖంగా అడిగిన పత్రికలకు అడిగిన వెంటనే కథలు రాసి ముప్ఫై ఏళ్లుగా ఇస్తున్న కె. కె. ఒంటికీ, ఇంటికీ గల సారం గురించి ఇప్పటికీ కథలు చలామణిలో ఉన్నాయి. కథల కార్ఖానా కాగలిగిన కె. కె. నవలలను కూడా బహుళంగానే వెలువరించారు. అయితే ఆయనకు భూతకాలం గురించి ఉన్న ఖాతరు కంటె వర్తమాన కాలం మీద ఉన్నట్టిదే ఎక్కువ అనిపిస్తుంది. మిగతా విషయాలటుంచినా, ఈ ఒక్క విశేషానికైనా కె. కె. గారికి తెలుగు నవలాలోకంలో పెద్దపీట వెయ్యవచ్చు

ఆయన పుస్తకాలకు ఉన్న గిరాకీని బట్టీ, ఒక్కొక్క పుస్తకం పడిన కూర్పుల సంఖ్యను బట్టీ చూస్తే, ప్రజాభిమానాన్ని బాగా చూరగొన్నా తెలుగు నవలాకారులలో కె. కె. ఎవ్వరికీ తీసిపోరనాలి. ఎటొచ్చీ విమర్శకుల మన్ననకునేవారి చూపుకు ఆనారా, అనేదే ప్రశ్న. విమర్శకు లోక్రతోవా, సాహిత్య మొకత్రోవా అనుకోవలసి ఉంటుందా, కొంపదీసి? నవలలేమోగాని, కె. కె. కథలు బోలెడు ఇతర భారతీయ భాషలలోకి పరివర్తితమైనట్లు, స్వశక్తి కారణంగా ఆయనకు సువిశాలమైన ఖ్యాతి చేకూరినట్లు మనకు తెలుసునే, మరి తెలుగు విమర్శకులు, కళ్లు మూసుకున్నా రెందుచేత?

దీనికి కె. కె. గారి సమాధానం ఏమిటో నాకు తెలియదు గాని ఆయన తొలి నవలల్లో ఒకటైన 'అరుణోదయం' ఒక వివరణ నిస్తున్నది. అందులో ఒకపాత్ర ఇలాగంటుంది.

"సంవత్సరానికి ఒకటే, రెండు సంవత్సరాల కొకటీ చొప్పున కథలు రాసేవాళ్లకు ఖ్యాతి వచ్చినంత త్వరగా నెలకు నాలుగు కథలు రాసేవాడికి రాదు. సాక్ష్యం పెరుగుతున్న కొద్దీ న్యాయాధికారికి విసుగెత్తినట్టు ఈ కథా రచనలో యంత్రపరిశ్రమను చూసి సంఘం విసుక్కుంటుంది." కథలలో "యంత్రపరిశ్రమ" అయితే నవలల విషయంలో కుటీరపరిశ్రమ కె. కె.ది. 'రేపటి కథాసాహిత్యం' అనే తమ వ్యాసంలో (అభ్యుదయ, మే–1956) తమ రచనాబాహుళ్యం గురించి కె. కె. ఇలా రాశారు:

"రెండవ ప్రపంచయుద్ధానికి మూడు, నాలుగు సంవత్సరాల ముందు కాలంలో నేను నాలుగైదు కథలు కూడా ప్రచురించిన నెలలు లేకపోలేదు."

విరివిగా రాయకుండా, నాలుగు కాలాలపాటు నిలిచే కథలు పరిమితంగానైనా రాయమని అడిగిన మిత్రులకు ఆయన ఇచ్చిన జవాబు, "కథలు రాయటం చాలా తేలికైన పని అని కథకులు కాబోయేవారికి తెలియగలందులకే విరివిగా కథలు రాస్తున్నాను" అని. ఇది ఛలోక్తి మాత్రమేకాదు. కథలూ నవలలూ రాయటం కె. కె కి మంచినీళ్ల మర్యాద అయిపోయింది. మొపాసా కూడా ఇంత వేగంతోటే పరంపరగా రాసేవాడట. త్వరగానూ ఎక్కువగానూ రాసినా, అప్రయత్నపూర్వకమనిపించేంతటి సహజంగానూ స్పష్టతతోనూ ఇద్దరూ రాశారు. ఇన్ని చక్కని రచనలను ఇంత అవలీలగా వెలువరించగలగడమే వారి ఘనతకు గీటురాయి. అయితే అనేక కథలకు, నవలలకు శాశ్వతత్వం చేకూరలేదు. సార్థక్యం కూడా అంతగా లభించలేదు. అయితే రచనా విధానంలో దృక్పథంలో మొపాసాతో కె. కె. భేదిస్తాడు. చలంతో కూడా. వాళ్లిద్దరికీ వాస్తవ విషయంలో కూడా కల్పన దర్శనమిస్తే, కె. కె.కి కల్పనలో గూడా వాస్తవ గుణం కనిపిస్తుంది. వాళ్లు ముఖ్యంగా హృదయవాదులు. కె. కె. బుద్ధివాది. గొప్ప రచయితలో వాస్తవవాదమూ, కాల్పనికవాదమూ సహజీవనం చేస్తాయి. వాస్తవాన్ని చిత్రించడమంటే దానికి ప్రతిరూపాన్ని కల్పించడం కాకుండా, దానిని సౌందర్యంగా మార్చడమే.[2] ఆ ఇంద్రజాలం కె. కె.కి చేతకాదనడం కంటె సరిపడదనడమే సబబైన మాట. ఏ నవల గొప్పదనానికైనా ఆధారమేమిటంటే, అందులో వర్ణితమైన వస్తువు యొక్క మేలిమికాదు. యదార్థ జీవితాన్నే చిత్రించవచ్చు. ఆ చిత్రణలో అందం కొరవడవచ్చు. తాను ఎన్నిక చేసిన జీవిత భాగాన్ని నవలాకారుడు ఎంత లోతుకుదిగి తరచి ఎంత సత్యసంయుతంగా వర్ణించాడు, ఏ అంశాలను వదిలి ఏ ఇతర అంశాలను స్వీకరించాడు, ఏ కళావైఖరితో రచించాడు, ఇవి మాత్రమే ముఖ్య విషయాలు. ఫార్స్టర్ అన్నట్లు "The novel's success lies in its own sensitiveness, not in the success of its subject matter." ఈ దృక్పథం నుంచి పరిశీలించినట్లైతే, వట్టి కల్పనా చమత్కృతి మాత్రమే ఏ నవలకూ ఘనత నివ్వదని తేలుతుంది. చిత్రింప బూనుకున్న జీవితఖండాన్ని ఎంత విశ్వసనీయంగా సాకల్యంగా సూక్ష్మత తోటి చిత్రించాడనేదే గీటురాయి.

జీవితంతో గాఢపరిచయం లేనిదే, శిల్పమూ భాషా ఎంత సొంపులుదేరినా, ఎవరూ మంచి రచయిత కాజాలరని, కె. కె.కి మొదటినుండీ సిద్ధాంతప్రాయమైన రచనాతత్వంలో ఆధారభూతమైన సూత్రం. తనకు సన్నిహితంగా ఉండే జీవితరంగం నుండే రచయిత తనకు కావలసిన పదార్థాన్ని స్వీకరించాలిగాని ఎటుపడితే అటు బండిని తోలగూడదు. ఇది చిత్తశుద్ధికి సంబంధించిన విషయం మాత్రమేకాదు. రచనలోని బటువు విశ్వసనీయతపై ఆధారపడుతుంది కాబట్టి, దానిని సాధించేందుకై తనకు అత్యంత గాఢంగా అనుభూతమైన జీవితఖండాన్నే రచయిత చిత్రించ బూనాలి. ఆ అనుభూతి ఆత్మీయతగా మారుతుంది. అయితే అది రచయిత స్వీయానుభవమే కానక్కరలేదు. అనుభవం అనుభవంగానూ చిత్రితం కాగూడదు. అది రచయిత మనస్సుకు పట్టి అస్థిమూలాల వరకు ఇంకి భావనలో లీనమైపోవాలి. అప్పుడే

2. "Is It not the essence and function of the artist ...that.. .he is found not to have reproduced reality, but to have transformed it? When he has transformed it into beauty, he has succeded: When he has transformed it into banality. he has failed." —Gerald Gould

ఆత్మీయత అనే దాని ఆవిర్భూతి. అది చేకూరినప్పుడు, రచనకు ముడిపదార్థం లభించినట్లే. శిల్పమూ, భాషా అనేవి ఆ ముడి పదార్థాన్ని అందమైన వస్తువుగా తీర్చిదిద్దే సాధనోపకరణాలు మాత్రమే. ('రేపటి కథాసాహిత్యం': అభ్యుదయ, మే, 1956)

## సంకుచిత పరిధి

కె. కె. రచనాతత్వం సూక్ష్మరూపంలో అది. తదనుగుణంగానే ఆయన తమ కథలలోనూ నవలల్లోనూ తమకు సుపరిచితమైన సంఘ వాతావరణాన్నే చిత్రించారు. ప్రథమ ప్రపంచ యుద్ధానంతర కాలం ఆయనకు సుదూర భూతకాలం. ప్రపంచ వ్యాప్తమైన ఆర్థిక మాంద్యం ఫలితంగా తెలుగుదేశపు మధ్యమ వర్గ జీవితంలో ఏర్పడిన ఆర్థిక సంక్షోభం, గృహచ్ఛిద్రాలు, దారిద్ర్య దౌర్భాగ్యాల శీఘ్రవ్యాప్తి, అతివాద రాజకీయాల తొలి తాకిళ్లు, వగైరా సమీప భూతకాలంలో మొదలైనా, బాగా తన ఎరుకలోనివి. ఇక రెండవ ప్రపంచయుద్ధం, తదనంతర కల్లోల పరిస్థితులు వర్తమాన కాలానికి చెందిన ముందు అరలోనివి. కాబట్టి 1927 మొదలు 1935 వరకు రచయితగా అండదశ, 1935 మొదలు నేటివరకు కీటకదశ. మరి, స్థలం విషయం చూస్తే, మొదట గుంటూరు మండలం, తత్పరిసరాలు, తర్వాత మద్రాసునగరం, అందులోనూ మధ్యమవర్గపు తెలుగు కుటుంబాల వలయం, అంచులంచుల్లో సినిమా జీవితం, ప్రెస్సు పత్రికా ప్రపంచం—కె.కె. 'రేంజి' ఇది.

ఇది పరిమితమైన పరిధి మాత్రమే. అందుచేతనే అబద్ధాలకు ఇక్కడ ఎక్కువ అవకాశంలేదు. చిత్తశుద్ధి, విశ్వసనీయమైన వాస్తవికత దీని ధనపక్ష మనుకుంటే, చర్వితచర్వణమనిపించే, ఒకేవస్తువు పలుమార్లు కంటబడినప్పుడు కలిగే విసుగు, దీని ఋణపక్ష మనాలి. నిజానికి ఇది ఋణపక్షమని కూడా కొందరు భావించడంలేదు. ఉదాహరణకు, తుర్గినీవ్ గురించి రాస్తూ, "The art of writing"లో ఆంద్రేమార్వా ఇలా వ్యాఖ్యానిస్తాడు (పు. 311): "It is this, that we might call congenital, monotony that gives life to a writer's work. A novelist can cut the umbilical cord which binds his characters to the imagination which gave them birth. What he can not do is to keep them from having a recognizable resemblance to their creator, and to one another."

ఒకేవిధమైన పాత్రలు ఒకటికి పదిమార్లు కనిపించడమొకటేకాదు, ఒకేవిధమైన వాతావరణం పునఃపునః కళ్లెదుట నిలుస్తుంది. నిలవక తప్పదనే కె. కె. మతం. ఒకే కథను పేర్లు మార్చి రాశారా అనిపించేటంత అభిన్నత్వం కనిపిస్తుంది. అంటే, కథలు రాయటం చేతగాకకాదు. ఎన్ని విధాలుగానో కథలు రాయగలిగిన హేమాహేమీలకు గూడా ఒకేఒక్క వస్తువుపై గుప్తంగా మక్కువ ఉంటుందని ఆంద్రేమార్వా అంటాడు. రకరకాల ముసుగుల క్రింద ఒకే పుస్తకాన్ని రాస్తూపోవటానికి కారణం ఆ వస్తువుకూ రచయిత యొక్క అంతరాంతరాలలో అణగిమణగి అజ్ఞాతంగానో వ్యక్తావ్యక్తంగానో మసలే వాంఛితాలకూ అదృశ్యమైన లంకె ఒకటి ఉండటమేనట. అసమర్థుడూ, ఒకే ఒక్క కథావస్తువును పట్టుకుని వేళ్లాడేవాడూ అయిన ఒకపాత్ర గురించి చమత్కారంగా కె. కె. వాడిన మాటలకు గంభీరార్థం కూడా ఉంది. "ప్రతి గొప్పకథకుడూ ఒకే ఒకకథ రాస్తాడు. కావలిస్తే దాన్నే మళ్లీమళ్లీ రాస్తాడు."[3]

ఏకతార సంగీతంలాంటి ఈ అభిన్నత్వపు వేసట నటుంచి, ప్రతిభ పేరిట చలామణి అవుతున్న నిత్యనూతనత్వం (Novelty) మితిమీరినప్పుడు కలిగే దుష్పరిణామాలను గూడా విజ్ఞులైన విమర్శకులు గుర్తించారు. అది మాదక ద్రవ్యాలలో (Toxic Stimulants) ఒకటట. దాని రుచి మరిగితే, తిండి మీద మరి బుద్ధిపోదట. దానికి బానిసైన వాడు మోతాదు పెంచుకుంటూ పెంచుకుంటూ, జీవితానికే మోసం వచ్చేటంత వరకూ దాన్ని సేవించక మానడట.[4] అలాంటి నోవెల్టీకి కె. కె. వెయ్యి యోజనాల దూరాన ఉంటారు. పిల్లిమొగ్గలు, ప్రయోగాలు, గరిడీలు ఇవే ప్రతిభకు లక్షణాలుకావు. పిచ్చివేషాలు వేయకుండానే, ప్రతిభావంతుడై యుండవచ్చు.

## విలక్షణత్వం

గ్రంథ సమీక్షకులే విమర్శకులు, విమర్శకులే సమీక్షకులైన దుర్దశలో ఉన్న మనకు దురభిప్రాయాలు కొన్ని గట్టిపడి ఉన్నాయి. ఒకరిని ఒకందుకూ ఇంకొకరి నింకొకందుకూ మన ప్రసిద్ధ నవలాకారులను మెచ్చుకోవలసిందిగా మన విమర్శకులు ఈవరకే నిర్ణయాలు చేసి ఉన్నారు. గోపీచంద్ నవలల్లో పాండిత్యం, బుచ్చిబాబు నవలల్లో వైచిత్రి, చలం నవలల్లో నిర్భరత్వం ఇలాంటి ద్రవ్యాలు.

గోపీచంద్ కొన్ని నవలల్లోని పాండిత్యం కొట్టవస్తుంది. మెదటిని తంటాలు పెడుతుంది. సిద్ధాంతాలకూ, తత్వాలకూ అవి చర్చావేదికలు. చరిత్రకూ వ్యక్తి జీవితచరిత్రలకూ అవి పాఠ్యగ్రంథాలు. పాండిత్యం ప్రదర్శన స్థాయికి చేరుకుంది. కళ ప్రకర్ష త్రోసిరాజన్నది. కె. కె. కి కూడా వాటన్నిటి మీదా మనస్సున్నట్లు చాలామందికి తెలియదు. ఆయన తెలియనివ్వరు. ఆయన స్వకృతోటి పాండిత్యం బటువును కోల్పోకుండానే సుళువును సమకూర్చుకుంది. పెసలు తిని పెసలు విసర్జించే

---

3. అరుణోదయం,

4. "Novelty is one of those toxic stimulants which, in the long run, become more necessary even than food. Once they have enslaved us, we have to go on increasing the dose to a point at which it becomes destructive of life."
—Turgenev.

ఆత్రగొట్టు తిండిబోతుతనం గాని, తిన్నదానిని అరిగించుకోలేని దౌర్బల్యంగాని ఆయనకు లేవు. ఇనప గుగ్గిళ్లను హరాయించుకో గలరు. స్వయంగా శాస్త్రవిద్యార్థి. విజ్ఞానశాస్త్రంలో యం. యస్‌సి. వరకు చదివి (డిగ్రీ అందుకోలేదు) అనేక శాస్త్ర గ్రంథాలను రాసికూడా నవలల్లో కథలలో అర్భకు అనిపించేంత అమాయకత్వాన్ని కనబరచగలరు. ఆయన బలమంతా లౌక్యమే (Commonsense). అక్కడక్కడ తత్వసిద్ధాంత విషయాల ప్రసక్తి వస్తుందిగాని, ఎక్కడా అది మేధావు లకు మాత్రమే బోధపడే సంకుచిత బుద్ధి వ్యాపారం కాలేదు. ఈ విషయంలో కె. కె. సోమర్సెట్ మామ్‌తో సరిపోలుతారు. సర్వసాధారణ విషయాలను కళగా మార్చడంలో ఇద్దరి కిద్దరే.

ఇంకొక విషయంలో కూడా ఈ ఇద్దరికీ పోలిక కనిపి స్తుంది. అక్కడే బుచ్చిబాబుకూ కె. కె.కీ తేడా. బుచ్చిబాబు రచనలలో విదేశీపూల వాసనలు బలంగా దట్టంగా ఉండి ముక్కును పట్టి ఈడ్చుకుపోతాయి. ఆయన భాషకు కూడా ఈ exotic beauty ఉంది. ఎందుకన్నారోగాని, గొర్రెపాటి వెంకట సుబ్బయ్య తమ 'అక్షరాభిషేకం'లో కె. కె. గురించి రాస్తూ, ఇంగ్లీషులో ఆలోచించి తెలుగున రాస్తారన్నట్లు చెప్పినమాట, చలంకంటె బుచ్చిబాబుకు బాగా నప్పేమాట.[5] ఇతరులకు చులకన అయ్యేంత తేలికగా, మందమతికి గూడా అవగతమయ్యేంత తేటగా, వ్యాఖ్యానాన్నీ టిప్పణినీ అపేక్షించ నక్కరలేని విధంగా, సంస్కార వంతులైన తెలుగు విద్యాధికుల వాడుకభాషను సాఫీగా, తరంగ ప్రాయంగా కె. కె. వాడుకున్నారు. ఆరుద్ర ఒకచోట వర్ణించి నట్లు, రేసుగుఱ్ఱంలా చురుకు చురుకున తగిలేశైలి. నిరలంకార మనిపించేంతటి సాదాతనం. ఎంత గొప్ప విషయాన్నైనా తగ్గించి చెప్పే పద్ధతి. కె. కె. అన్నగారు కొడవటిగంటి వెంకటసుబ్బయ్య చాలా చక్కటి భావకావ్యకర్త కావడమటుంచి, కె. కె. స్వయంగా భావకవులనూ ప్రబంధకవులనూ బాగా చదువుకున్నవారు. వారి నవలల్లో పలుతావుల ఈ కావ్యచర్చ వస్తుంది. మరి, కావ్యశైలి అంటని వచనాన్ని శుద్ధ మనోహరంగా రాయడమే ఆయన వ్రత మనుకోవాలి. ప్రకృతిని ఎక్కడోగాని తొంగి కూడా చూడనివ్వరు. మెతకదనం ఎక్కడాలేదు కాని మెత్తన ఉంది—అదే పటుత్వం. గజిబిజి ఎందునాలేదు. సూటిగా రాంబాణంలా గురికి సరిగా పోయే భావప్రకటనం ఉంది. ఉద్రేకాలూ, గీతిధోరణులూ కని పించవు. వాటి తావున ఉండేది చమత్కారం. అదైనా అదుపుకు లోబడే ఉంటుంది. ఈ మాటలు సోమర్సెట్ మామ్ గురించి ఒక విమర్శకుడన్నవి. ఈ రచనాపద్ధతిని civilised writing at its best అని ఆయన వర్ణించాడు.[6] కె. కె. ది ఆ పద్ధతి. 'ఎండమావులు' అనే కె. కె. నవల గురించి రాస్తూ అందులోని శైలి 'జర్నలీజ్' అనబడే దాని లాగున్నదని అన్నాను. మంచి దినపత్రికా శైలికీ నవలాశైలికీ మౌలికమైన భేదమేదో ఉంటుందని నేననుకోను. 'జర్నలీజ్' అని వర్ణించినందువల్ల న్యూనతరాదు. ఉత్తమ వచనమని టి. యస్. ఇలియట్ వంటి విమర్శకులు నిర్వర్ణించిన దానిలో, సమకాలికమై శిష్టజనప్రయు క్తమైన నాగరిక వాగ్వ్యవహారం జీవగఱ్ఱగా ఉంటుంది.[7]

భాషను వదిలి, పాత్రల నడవడికను పరిశీలించినా, కె. కె ది విలక్షణమైన దృక్పథమనాలి. అవి కూడా పరమ సాధారణమైన స్వభావాలు గల వ్యక్తులవే. కె. కె. విహారభూమి స్వర్గమూ పాతాళమూకాదు. రెక్కలు అసలే మొలువలేదని కాదుగాని ఎత్తుకు ఎగిరి అబద్ధాల అందమైన ఆకాశాలలో ఉక్కిరిబిక్కిరి కావడం సరిపడలేదేమో, వాటిని చేజేతులా ఊడ్చివేసుకున్నారు. ఎత్తు లోపించగా ఏర్పడిన వెలితిని విరివి పూరించింది. ఆ విరివికి, లోతు జతచేరి ఉంటే, నిస్సంశయంగా చాలాగొప్ప నవలాకారులలో ఒకరయ్యేవారు. స్వభావాన్నీ తరిచే కొద్దికీ సొగసులూ వికారాలూ బయల్పడి, పాఠకుల మీద పాత్రలు గాఢముద్రను వేస్తాయి. స్థూలంగా సూచనప్రాయంగా ఒకటిరెండు వాక్యాలతో స్వభా వాన్ని యావత్ మనః ప్రపంచాన్ని సూచించగలశక్తి చాలా గొప్ప సిద్ధి. అది కొంతవరకు కె. కె. కి పట్టుబడింది. ఇంకొక విశేష మేమిటంటే, ఆయన సృష్టించిన పాత్రలు దయ్యాలవలె వికృత మైనవీ, దేవతలవలె నిర్మలమైనవీకావు. అలా అయినప్పుడు అవి మానవపాత్రలే కాజాలవు. వక్రించడమూ వికటించడమూ ముందు హెచ్చరిక ఇవ్వకుండా (కారణం దాగిఉన్నా) హఠాత్తుగా మారి విస్మయాన్ని కొలపడమూ మానవ స్వభావానికీ, కె. కె. పాత్రలకూ, సహజమే అయినా, సాదాతనమే వాటి ప్రధానగుణం, సూటి నడకే వాటి తెన్ను. ఇది ఒక లోపమే ననాలి. సాదాతనం ఆసక్తి గొల్పదు. వింతలకు మనస్సులు ఊరుతాయి. చిరస్మరణీయ మైన పాత్రలు తమ నవలల్లో లేవని నేను చేసిన ఫిర్యాదు విని పైన జెప్పిన లేఖలోనే ఇంకొక చోట ఆయన ఇలా రాశారు.

---

5. అక్షరాభిషేకం : పు. 242 — 243 వెంకట సుబ్బయ్య గారిచ్చిన ఉదాహరణలు సరియైన నిర్ణయానికే దారి తీశాయి గాని, ఇటీవలి రచనల్లో కె. కె. భాష తెలుగుదేరింది. ఆంగ్లభాషా ప్రభావం బాగా సన్నగిల్లిపోయింది.

6. "The qualities of Somerset Maugham as a writer are not at all elusive. An innate dramatic sense enables him to write sound, solidly constructed novels that never fail to interest the reader. His prose is clean and hard and is always marked by a precision... Passion and lyricism are not evident but in their place the reader will find a superbly controlled irony and a brilliant art. It is, in short, civilised writing at its best, from one of the most civilized minds in cur world."

7. T. S. Eliot: On Poetry and Poets: ఇలియట్ కవిత్వభాష గురించి చేసిన వ్యాఖ్యానం వచనానికి మరింత ఎక్కువగా అన్వయమౌతుంది, వచనానికి ఉండవలసిన పదజాలం, వ్యాకరణసూత్రాలు వేరు అంటారాయన. కావ్యాలలోని భాష విషయంలో ఇలాగన్నారు, "Words too familiar or too remote, defeat the purpose of a poet."

"నాకు పాత్రలకన్న పాత్రల మధ్య ఉండే సంబంధాలను గురించి శ్రద్ధ జాస్తి.....". పాత్రలు ఒకటికన్న ఎక్కువ ముడిపడినప్పుడు అవి సామాజిక సంబంధాలవుతాయి. సామాజిక వాస్తవానికి పాత్రలు తమతమరీతుల్లో రూపకల్పనచేస్తారు.సమాజంలో మనుషులున్నట్లుగానే అప్పటంగా నవలల్లో పాత్రలుండవు. ఉండలేవు. వాస్తవమైన పాత్రీకరణమంటే అదికాదు. మామూలు మనుషులకూ పాత్రలకూ పోలికలున్నప్పటికిన్నీ, అవివిశ్వసనీయంగా ఉన్నప్పుడే వాస్తవ పాత్ర అనిపిస్తాయి. వాటి గురించి రచయితకు అమూలాగ్రమూ తెలిసిఉండాలి.తెలిసిన దానినంతటినీ అతడు బయటపెట్టక పోవచ్చునుగాని బయట పెట్టగలిగి ఉండాలి. (Aspects of the Noval: E.M. Forster.)

## ప్రపంచ దృక్పథం

దడబుడలు లేని శైలి, గడబిడలు చేయని పాత్రలు, నాటు తేట మాటలు, డాబు దర్పాలు చూపని ప్రతిభ, ఘోదాత్తనంగాక సాదాతనమే పెట్టుబడియైన వ్యుత్పత్తి—కె. కె. నవలా లక్షణాలలో కొన్ని. ఇంకొక ముఖ్యమైనది ఆయన ప్రాపంచిక దృక్పథం. అది పుస్తకాలనుండి మాత్రమేగాక జీవితంనుండికూడా ఆయనకు సమకూరింది. ద్వితీయ ప్రపంచయుద్ధ కాలానికి ఆయన ఒక్కరేకాదు, ఆంధ్రదేశపు మధ్యమవర్గపు యువకులలో అనేకులు మార్క్సు సిద్ధాంతాల వైపు మళ్లారు. "కమ్యూనిస్టు విముఖత అంటే..." అనే వ్యాసంలో (విశాలాంధ్ర, 6—6,—1964) తమ భావపరివర్తనానికి పూర్వాపరాలను చూపారు. ఇందులో చెప్పిన దానికంటె చెప్పనిదే ఎక్కువ ముఖ్యమైనది. తెనాలి తాలూకాలో ఒక బ్రాహ్మణ కుటుంబాన జన్మించి, పల్లెటూళ్ల నుండి బస్తీ చేరుకుని, చదువుల కోసం బెనారసు వరకు వెళ్లి, ఏ కారణంవల్లనో చదువు పూర్తిచేసి పట్టాపుచ్చుకొని మామూలు ఉద్యోగపు చట్రానికి చిక్కక, దాదాపు పది సంవత్సరాలపాటు చేసిన పని చేయక దేశాలు తిరుగుతూ, చివరకు మద్రాసులో పత్రికా ప్రపంచంలో కాలు నిలద్రొక్కుకున్నంత వరకు నడిచిన కథ ఊహించవలసిందే. అయితే ఈ యాత్రలో ఒక ముఖ్యమైన మజిలీ తెనాలి. అక్కడ "యువ" పత్రికను స్థాపించారు. అప్పుడే చక్రపాణి, గోపీచంద్ ప్రభృతి యువమేధావులు, విపరీత భావుకులు పరిచయమై ఉంటారు. చక్రపాణి ద్వారానే డయలెక్టిక్స్ గొడవ కె. కె. చెవినిపడింది. బెంగాలీ పత్రికలు దీన్ని చేరవేశాయి. యుద్ధం మొదలుకాకముందుకూడా ఫాసిజం స్వభావాన్ని సరిగా అంచనా వేశారేమో, జపాను కూడా కత్తికట్టాక, కాంగ్రెసు సంస్థలో జపాను అనుకూల వైఖరి ఒకటి తెరవెనుక కనిపించే సరికి, మనస్సు విరిగింది. యుద్ధానుకూల ప్రచారం చేసేంత వరకు పోయింది. ఇంకొక వైపు కమ్యూనిస్టులతో సాన్నిహిత్యం ప్రారంభమైంది. 'కేపిటల్' చదవగా "జీవితంలోని కుళ్ళు చాలా వరకు నా కరమయింది."

ఈ ప్రాపంచిక దృక్పథమే రచయితగా కె. కె. వైఖరిని నిర్ణయించిందనేందుకు వీలులేదు. కొంతకు కొంత ప్రభావితం చేసిందంతే. సంఘంలో వర్గాలున్నాయని, వాటికి ఆధారం ఆస్తి సంబంధాలలోనూ,ఉత్పత్తి శక్తులతో వాటికిగలబాంధవ్యాలలోనూ ఉన్న వ్యత్యాసాలేనని, వర్గాలకు స్థూలంగా వేర్వేరు వైఖరులుంటాయని, సమాజంలోని మానవ సంబంధాలకూ భావాలకూ చేష్టలకు ఆదిమూలంలో ఆర్థికం ఏదో ఒక పరిమాణంలో నేరుగానో ఇంకొక దాని ద్వారానో, ఉండి తీరుతుందని మార్క్సిస్టు దృక్పథం చెబుతుంది. దీనిని కె. కె. అంగీకరిస్తారో లేదోగాని ఆయన రచనాతత్వమూ పాత్రీకరణ విధానమూ దానికి అనుకూలంగానే ఉన్నాయి. తాము ఎక్కువగా చిత్రించే మధ్యమవర్గపు జీవితము, ఎన్నిక చేసే మధ్యమవర్గపు పాత్రలు తదాశ్రితాలే. నిజానికి మధ్యతరగతి మనస్తత్వమంటూ విడిగా ఒకటి ఉందా? ఉంటే, ఎక్కడ ఉన్నట్టు? ఆయన ఇలాగంటారు: "ఈ మధ్యతరగతి మనస్తత్వం అస్తమానమూ ఎక్కడ కనబడుతుంది? ఏదో ఒక చిన్నసమస్య ఏర్పడ్డప్పుడు దాని స్వభావం వ్యక్తమవుతుంది. మధ్యతరగతిలో చాలా స్వభావ వైవిధ్యం ఉన్నది." (లేఖాంశం)

ఈ పరిధి సంకుచితమైనదే. సందేహంలేదు. పెళ్లిళ్లూ, ప్రేమలూ, అదాయాలూ, వెర్రినమ్మకాలూ, భేషజాలూ, భంగపాటులూ—ఇవే ఎక్కువగా ప్రసక్తాలౌతాయి. కె. కె. రచనల జయానికీ అపజయానికీ, బలానికీ పేలవత్వానికీ మూలం ఇదే. సాదా రచయిత చేతబడితే చర్వితచర్వణత్వమనే పునరుక్తి దోషానికి అగ్గంకాక తప్పని ఈ పరిస్థితి విసుగు వేసటలకు తావునీయని నిత్యనూతనత్వాన్ని చాలావరకు చేకూర్చుకోగలిగిందంటేనే, కె. కె. ప్రతిభ గోచరిస్తుంది. సముద్రతరంగాలూ, నది కెరటాలూ గాక, చెరువులోని ఊర్మికలు కె. కె. నవలలు. చిరుగాలికి ఎప్పటికప్పుడు రూపాన్నీ స్థానాన్నీ మార్చుకుంటూనే ఆ కొద్దిపాటి మార్పులకు పరిమితమైన జీవితమే ఆయన అనుభవ పరిధి (range).

## మధ్యతరగతి మనస్తత్వం

ఒక్కొక్కసారి ఈ మధ్యతరగతి మనస్తత్వమనే చట్రానికి సరిపడా కె. కె. తన పాత్రలను మలుస్తున్నారా, అని సందేహాలు కలుగుతుంది. విశేషం నుంచి సామాన్యానికి పయనించే పద్ధతి అయితే చిక్కులేదు. సామాన్యం నుంచి విశేషాన్ని సాధింప జూచినప్పుడే నమ్మిక సన్నగిల్లిపోతుంది. "చదువు" అనే నవలలో సీతమ్మ అనే పాత్రకు ఏర్పడిన దారిద్ర్యభయానికి కారణం వివరిస్తూ, రచయిత ఇలాగంటారు: "కాలి మీద కాలేసుకుని కడుపులో చల్ల కదలకుండా భూముల మీద వచ్చేదానితో ఒక స్థాయిలో జీవితాన్ని వెళ్ళబుచ్చటానికి అలవాటుపడ్డ తరగతి యొక్క మనస్తత్వం నుంచి ఆవిడకీ భయం దాపురించింది" ఇది నిజమే కావచ్చుగాక, రచయితే పనిగట్టుకుని ఇలా వివరించినప్పుడు, నమ్మబుద్ధికాదు. అదే పనిని పాత్రలు చేసి ఉంటే బాగుండేది. సామాజిక పూర్వరంగాన్ని చిత్రించాలనే కోరిక మితిమీరినప్పుడు కలిగే అనర్థాలిలాగే ఉంటాయి.

కె. కె. సృష్టించిన పాత్రలలో ఎక్కువకాలం మనస్సు నంటిపెట్టుకుని ఉండేవి ఆట్టే లేవనేందుకు నా కింకొక కారణం కనిపిస్తున్నది. ఈ మధ్యమవర్గ పాత్రల స్వభావాలలో సాఫీ తన మున్నంతగా ఆకస్మిక పరివర్తన లుండవు. కాబట్టి మనకు విస్మయం బలంగా కలగదు. అసహజమైనదీ అక్రమమైనదీ అంతగా వాళ్ల ఆలోచనలోకేరాదు, ఆచరణ కెట్లాగూ రాదు—ఎక్కడో అరుదుగా తప్ప. ఆ అరుదైన దానికీ స్పష్టమైన కారణముంటుంది. కారణం హేతుబద్ధం. హేతుచింతతో పనిలేక, అస్పష్టంగా వ్యక్తావ్యక్తంగా ఉండే మనస్సీమనుంచి పెల్లుబికి వచ్చే గాటపు టుద్రేకాలు, సహజాతాలు (impulses) ఈ పాత్రలను వూగించి వేయవు. వారి ఆశయాలు జానెడు. లేదా మూరెడు. వారి బారలు ఇంటి గోడలను మీరవు. విజయాలు గురికి బెత్తెడు. ఫలితం, నిరుద్రిక్త వాతావరణం. చలంగారికీ, కె. కె. కీ ఇక్కడే తేడా. నియమోల్లంఘనం, నెత్తురు ఎత్తిపోతలు కావడం, మనసులు గాంగ్రడించడం, మంచాలు మూలగడం ఇక్కడ లేవు. మర్యాదా, మప్పితమూ కావలసినంత ఉంది. తిరిగి తిరిగి పెళ్లి పీటలమీదికి చేరుకోవడమే ఎక్కువ. సాహసంపాలు కొద్ది. పాశ్చాత్య సాహిత్యంలో ఇలాంటి మధ్య తరగతి నవలా సాహిత్యం గురించి రాస్తూ, 'The old man and the New' అనేవ్యాసంలో గోర్కీ ఇలా వ్యాఖ్యానించాడు :

"The Forsytes in England, the Budden brooks in Germany, and the Babbits in the United States are clearly incapable of producing 'heroes' and are obliged to fashion them out of petty adventurers."

గాల్స్‌వర్దీ నాయకులు, థామస్ మేన్ నాయకులు, సింక్లేర్ లెవిస్ నాయకులు వరుసలో ఈ ఫోర్సైట్లు, బడెన్ బ్రూక్‌లు, బాబిట్లున్నా . వాళ్ల సాహస కార్యాలు మహా వీరులకు ఉచితమైనవికావు—అల్పిష్టి ఆతతాయిలకు మాత్రమే యోగ్యమైనవి అని గోర్కీ భావం. ఒక కొత్త రకపు మనిషిని ఈ మధ్యమ వర్గ పరిధిలో దర్శించజాలమని ధ్వని. ఈ ఆతతాయితనం ఎంత అల్పిష్టిదైనా కావచ్చుగాని, అది కూడా కె. కె. నవల్లో కనుదగలదు.

## గొప్పనవల అంటే...?

సర్ వాల్టర్ స్కాట్ మన దృష్టిలో చాలా గొప్ప నవలా కారుడి కింద లెక్క. అయితే ససేమిరా, ఇ. యమ్. ఫార్ట్సర్ ఒప్ప నంటాడు. స్కాట్‌గారిది temperate heart కావడం ఒక కారణమట. పెద్ద మనిషితనంతోటి 'అతి సర్వత్ర వర్జయేత్' అంటూ నాతిఉష్ణమూ నాతిశీతలమూ అయిన సమశీతోష్ణ స్థితి గలిగిన హృదయం కాబట్టి, పరమ నైష్ఠికమూ, వ్యాపార సరళీ కలిగిన దృక్పథం ఉండబట్టి, స్కాట్ గొప్ప నవలాకారుడు కాలేకపోయాడట. కె. కె. ది అలాంటి స్థితి అనడం సరికాదు. ఎందుకంటే, ఆయన సాధుత్వం వెనక ఎంతో సంయమం, నిగ్రహం ఉన్నాయి. ప్రాగల్భ్యాన్ని ఉద్రేక సామగ్రిని ఎక్కువగా వాడుక చేయనొల్లని రచనా తత్వంవల్ల ఏర్పడిన సాదాతనమేగాని, ఇది చేతగానితనానికీ చచ్చుదనానికీ వేసిన మేలి ముసుగుకాదని 'నీకేం కావాలి?' అనే నవలిక, 'పచ్చకాగితం' వంటి కథ, 'కురూపి' వంటి పెద్ద కథ, మరెన్నో నిరూపిస్తాయి.

అయితే తమ రచనల పద్ధతిని గురించి ఆయన కెలాంటి భ్రమలూలేవు. ఉన్న దానిని ఆయన ఒప్పేసుకుంటారు : "నా రచనలు cold గానే ఉంటాయి. దీన్ని గురించి ఆక్షేపణలు చేసిన వారున్నారు. గాఢానుభూతులూ, తీవ్ర సంఘటనలూ పెట్టటం నాకు cheap trick అనిపిస్తుంది. దీన్ని సమర్థించటంలేదు. అది నా aberration అనుకోవాలి." (లేఖాంశం.)

కె. కె. నవలల్లో ప్రతిదాన్నీ చదవ గలను అంటే అందులోని కథ తనని నాచేత చదివింపచేస్తుంది. ఆ చదివింపజెయ్యడం ఒక్కసారిగాక, పలుమార్లు, మరో ఐదు, పది, ఇరవై ఏళ్ల తర్వాత చేయించగలిగి, చదివేకొద్దీ ఆసక్తి గొల్పినట్లయితే అది 'గొప్ప' నవల అవుతుంది. అలాంటి నవలలు తెలుగులోనే కొద్ది. ఉంటే ఒకటి రెండు. "ఒక out standing landmark లాటిది మన నవలా సాహిత్యంలో ఎక్కడవచ్చింది? ఆ form ను అద్వితీయంగా ఉపయోగించుకున్న వారెవరూ కానరారు." ఈ మాటలు ఎవరివోకావు—కె. కె. వే. ఈ చిత్తశుద్ధి చాలామంది నవలాకారులకు లేదు. అది వేరే విషయం. ఎటొచ్చీ 'గొప్ప' నవల అంటే ఎలాంటిదై ఉండాలో తెలుసుకోవడం ముఖ్యం. 'The novel and the People' లో రాల్ఫ్ ఫాక్స్ దాని నిలా వర్ణిస్తాడు :

"Eventhough their authors try to picture a real world, the amount of reality achieved is not sufficient to produce that violent shock, which brings us, all our emotions taut, our mind alert, in to the country of those who see, and having seen through their eyes, we never forget the experience."

ఒక్క తెలుగులోనేకాదు, విద్యుదాఘాతంవంటి అలాంటి Violent shock ద్వారా ఎన్నటికీ మరువలేని అనుభూతిని ప్రసాదించగల నవలలు, ఏ భాషలోనైనా ఒకటి రెంటికి మించవు. మొత్తం ప్రపంచంమీద అరడజను కూడా ఉండవు. కాబట్టి హిమాలయాలనే చూపులో పెట్టుకుని, వింధ్యలనూ నల్లమలలనూ విస్మరించడం బుద్ధితక్కువ పని. ఒక్కచంద్రుడికి కోటి తారలున్నా ఆ తారలలోనే తారతమ్యాలున్నట్లు, ఉన్న వేల, వందల నవలల్లో కొన్ని మిగతా వాటికంటె ఉరువైనవీ, విలువైనవీ. ఈ తేడా ఎందువల్ల వచ్చిందో, కె. కె. యే స్వయంగా ఒక చోట విపులీకరిస్తారు : శాశ్వతంగా నిలబడే

పుస్తకాలు నూటికీ కోటికీ ఒకటి ఉండవని ఒకసారి అని, మళ్లీ ఇవాళ నిలబడిన పుస్తకాలన్నీ ఒకప్పుడు పనికి వచ్చి నట్టివే అని స్వీకరించడమేగాక, అలాంటి వాటికిగల కళాంశాల పట్టిక ఇస్తారు. "సమగ్రమైన ప్రపంచ జ్ఞానం, పరిశుద్ధమైన అంతఃకరణా, సంఘానికి అభ్యుదయం చేకూర్చాలనే దృఢ సంకల్పమూ, మనస్తత్వం గురించిన విశాల పరిజ్ఞానమూ, మానవ మనస్సును కదిలించే అపార ప్రజ్ఞా, వీటి వెంట సంప్రదాయసిద్ధంగా వస్తున్న శిల్పంలో ప్రావీణ్యత సంపాదించటమూను" (అరుణోదయం).

## చిన్న నవల—పెద్దకథ

అలాంటి నవలను ఒక్కదానినైనా రాద్దామని కె. కె. సంకల్పించారా? దానికి పరిమాణం చాలా ప్రధానమైనది. ఫార్స్టరు నడిగితే, 50,000 పదాలకు తక్కువగాని సృజనాత్మక కల్పనా కథే నవల అని నిర్వచిస్తాడు—"a fiction in prose of a certain extent." ఆరిస్టోటల్ ఆదర్శరాజ్యానికి జనాభాలాగా, నవలకు ఈ 50,000 మాటల పరిమితి అనివార్యమా? అలాగైతే ఒక్క 'చదువు' వంటి నవల తప్ప తక్కిన కె. కె రచనలన్నీ నవలలు కావని కొట్టివేయవలసి వస్తుంది. అది అచ్చులో 310 పేజీ లాక్రమించింది. మిగతావి ఏవీ 200 పేజీలు మించలేదు. కొన్ని వంద పేజీలు కూడా విస్తరించలేదు. వీటి నన్నిటినీ 'నవల' లని పిలవడ మెట్లా? అందుచేత కొన్నిటిని చిన్న నవలలనీ, (ఆర్వుద్ర వీటిని నవలిక లంటారు), మరి కొన్నిటినీ పెద్ద కథలనీ వర్ణించటం జరిగింది. ఆపని కె. కె. చేసిందే. దానికి ఆయన లక్షణం కూడా చెప్పి ఉన్నారు.

'చిన్న నవల' అనే వ్యాసంలో (ఆంధ్రప్రదేశ్, ఏప్రిల్ 1963) ఆయన ఇలా రాశారు :

"చిన్న కథను పెంచినా, నవలను కుంచించినా చిన్న నవల అవుతుందన్న భావం ఎవరికైనా ఉంటే అది సరియైన భావం కాదు". సామాజిక జీవితాన్ని సవిస్తరంగా ప్రతిబింబించే అవకాశం ఉన్నప్పుడు, నవల రాయాలి. కథలో ఉండేట్లుగా ఒకే ఒక్క ప్రధాన సంఘటన ఉండీ, కథలో వీలు కానట్లుగా మనిషి మనస్తత్వంమీద సాంఘిక వాతావరణానికి గల ప్రభావమూ, కాలగతితోబాటు ఈ వాతావరణంలో జరిగే మార్పులూ ప్రతిబింబించే అవకాశం ఉన్నప్పుడు, చిన్న నవల రాయాలి. చిన్న కథలోలాగే చిన్న నవలలో కూడా కాల ప్రమాణం పరిమితంగా ఉంటుంది. అలా ఉండినప్పుడే చిన్న నవల కృతకృత్యమవుతుంది

నవల అనేది వివిధ సంఘటనల బాహుళ్యంతో సన్నివేశాల సంకీర్ణతతో సమగ్ర జీవిత దృశ్య చిత్రణతో ఒక సినిమా వంటిదైతే, సాంఘిక చరిత్రతో అంతగా ప్రమేయం లేకుండా ఉన్న చిన్న నవల "జీవితం తాలూకు డాక్యుమెంటరీ చిత్రం" వంటిదంటారు. "చిన్న నవలలో కథలోఉండే శిల్పమూ, నవలలో ఉండే విస్తృతీ కలిసివస్తాయి." అంతేకాదు. సాంఘిక వాతావరణం పరివేష్టించి ఉన్నందుచేత చిన్న నవలలోని పాత్రలకు, కథలోని పాత్రలకు పట్టేట్లుగా, కాలదోషం పట్టదు. అవి "పాత బడిపోవు."

ఒక్కొక్క ప్రయోజనాన్ని ఆశించి ఒక్కొక్క సాహిత్య రూపం బయలుదేరదీస్తే బయలు దేరుతుంది. 'గల్పిక' వంటి సరికొత్త రూపాలకు కె. కె, తెలుగులో ఆద్యులు. చిన్న నవల కూడా ఆయనను ఆశ్రయించే వివర్థిల్లింది. ఈ నవ్యరూపాన్ని ప్రవర్తిల్ల జేసేందుకు ముఖ్యమైన కారణం, ప్రస్తుత లోక స్థితి. జీవితం శీఘ్రతరమైంది. తీరికా, వోపికా తగ్గాయి. కేప్సూల్ సైజు విజ్ఞానంతో బాటు నవలిక సైజు వినోదానికి మనుషులు తయారయ్యారు. ఈ విషయాన్ని "తెలుగు నవలలు" అనే వ్యాసంలో (విశాలాంధ్ర, 31—3—1963) కె. కె. ఇలా సూక్ష్మంగా చెప్పారు.

"జీవితాన్ని సమగ్రంగా చిత్రించటానికి నాకు గల అవకాశాలూ, శక్తి సామర్థ్యాలూ, అవతల పాఠక లోకంయొక్క పఠనా దార్ఢ్యమూ, కాల పరిస్థితీ బేరీజు వేసుకుని, నేను నవలలో కూడా 'సంగ్రహ రచన' చేస్తున్నాను."

## మేధా ప్రధాన రచన

అందుచేత ఇలాంటి సంగ్రహ నవలలను పరిశీలించేటప్పుడు, పెద్ద సైజు నవలలతో పోల్చడం పని లేని పని. హార్డీ అన్నట్లు, వీటిలో తగినంత మోతాదులోనైనా moods and deeds వర్ణించటం జరిగిందో లేదో చూస్తే చాలు—బహు వచనాన్ని గుర్తించాలి! గుర్తించి చూసినా ఈ పరీక్షకు కె. కె. నవలలు కొన్నైనా నిలుస్తాయి. నిలవటమేగాక బేషని పిస్తాయి. ఎటొచ్చీ మేధ మాత్రమే ఆయనలో చాలా బలీయమని చెప్పాలి. హృదయమూ, మేధ అని రెండు అరలు పూర్తిగా వేర్పడి లేకున్నా, ఆలోచన, ఆవేశాలు వేర్వేరు. కె. కె. ది ఎక్కువగా ఆలోచన ప్రధానమైన రచన. కార్య కరణాలకు సంబంధించిన శాస్త్రవిహితదృష్టి ఆయనకు అభ్యాసవశానవచ్చి నిలిచిపోయింది. అది లోటేమీకాదుగాని దానికి జతగా హృదయ ద్రవీకరణచణమైన ఆవేశబలం ఉండాలి. ఎక్కడోగాని, కె. కె. నవలల్లో మనస్సుపొంగిపోయే ఉద్రేకంఉండదు. ఉదాహరణకు, 'నీకేం కావాలి?' అనే నవలికలో పేరు లేని నాయకుడు ('నేనూ') భోగం పిల్లతో చివరకు సమస్థాయిని సాధించినప్పుడు, ప్రేమకూ, కామానికీ అభేదం ఏర్పడి గాఢ వర్ణాంకిత మానవ హృదయ దృశ్యం తయారవుతుంది. అట్లని ఏ రచయితనూ 'సెంటిమెంటల్' కమ్మని కోరడం తగదు. 'సెంటిమెంటల్' కాకుండానే రచయిత 'సెంటిమెంట్సు' అనబడే న్యాయసమ్మతమైన భావప్రకోపాలనూ, మనో వికారాలనూ ఆదరించవలసి ఉంటుంది. 'ఎండమావులు' అనే నవలలో సుందరీ రంగారావుల అనుబంధం కూడా ఇలాంటిదే అయినా, ఈ రెండు సందర్భాలలోనూ వివాహేతరమైన సంబంధమే ఉద్రేకాశ్వాలను దౌడు తీయిస్తుంది. తల మునకలయ్యే యువజనుల ప్రేమ, గుండెను కుత కుత లాడించే సంతాపం, ఆకాశాల కెగిరిపోదామనే

ఆశామయ సాహసం, సమాధి కవతల కూడా కలిసి ఉండగలమనే దాంపత్యబంధం—ఇంకొక రచయితలో వెదుకవలసి ఉంటుందేమో!

## 2

### అనుభవం—అనుభూతి

ఒకటి రెండేళ్లలో అరవయ్యోపడిలో ప్రవేశించబోతున్న కె. కె. గడిపివున్న జీవితం సంపన్నమైనదోకాదోగాని, గడించిన అనుభవాలనుబట్టి సంపన్నమయమైనదని చెప్పవచ్చును. సంఘ సంస్కారోద్యమాల కొస తాకిడి అప్పటి కింకా స్తబ్ధపడని రోజులలో ఆయన మనస్సు పరిణతమైంది. ఆయనకు "ఊగ" వచ్చింది. స్టేజి నాటకాల జోరులో బయాస్కోపు మొదలౌతున్నప్పుడు, కింకవీంద్ర ఘటా పంచాననులూ, మహామహోపాధ్యాయులు పాలించే అక్షరరాజ్యంలో భావకవిత్వం మొగ్గలు తొడుగుతున్నప్పుడు, నీతి కావ్యాలకు తోడుగా కథానికలు బయల్పడుతున్నప్పుడు, సాహిత్యానికి పరిమితమైన గొప్ప (అరా యుష్షువైనా సరే) పత్రికలు వెలువడ జొచ్చినప్పుడు యువకుల మనస్సులలో సంఘ విద్రోహ భావాలు పాటమరిస్తున్నప్పుడు, జాతీయోద్యమ స్తబ్ధతనూ, నిష్ఫలతనూ పురస్కరించుకుని వామ పక్షాభిప్రాయాలు గ్రీన్ రూములో రంగులు పూసుకుంటున్నప్పుడు తెలుగువారి బ్రతుకు కొత్త మలుపు తిరుగుతున్నప్పుడు—రచయితగా పునర్జన్మ నెత్తారు. జన్మించింది 1907 లో ననుకుంటే 1930 నాటికి ఇరవై మూడేళ్ల వయస్సు. అప్పటికే చదువు ముగిసి బ్రతుకు మొదలైంది.

బ్రతుకు ప్రారంభించేందుకు ఎంత దారుణమైన పరిస్థితులు! మధ్య తరగతి మనుషుల ఆస్తులు సన్నగిల్లి అంతరించిపోతున్నాయి. "అలజడి వూపిరి", అశాంతి దినసరి తిండి. స్థిరత్వం, భద్రత లేవు. సమయానికి గాంధీజీ సత్యాగ్రహోద్యమాల పాటు పోట్లు. యువకుల హృదయాలను స్వాస్థ్యన్ని చేకూర్చజాలని సందిగ్ధ దశ ఏర్పడింది. హిట్లర్ కారు నీడలు ప్రపంచమంతటా వ్యాపించసాగాయి. హిట్లర్‌కు అనుకూలత మన దేశంలో కొందరిని ఆవేశించినా, బుద్ధిమంతులకందరికీ నెగ్రహా నాయకు డయ్యాడు. మరి కొంతకాలానికి ఇంకో ప్రపంచయుద్ధం. ఈ లోపల సోషలిస్టు ఉద్యమ విజృంభణం. జపాను విమాన దాడుల ఉపద్రవం. బ్రిటిష్ వ్యతిరేకత. యుద్ధ పరిస్థితిలో లాభాల బస్తాలు. ఎంత దారుణమైన పరిస్థితులైనా, రచయిత కావాలని సంకల్పం చెప్పుకున్న మనిషికి, కావలసినంత ముడి సరుకు.

తెనాలినుండి బొంబాయి, మదరాసుల వరకు, బస్తీల నుండి మహా నగరాల వరకు, వ్యక్తిమాత్రుల మొదలు మహాజన సమూహాల పర్యంతం, దౌర్బల్యం మొదలగు చరిత్రను కళ్ల ముందు నిర్మించగల మహాశక్తి వరకు, కె. కె. జీవితం విస్తరించింది. అది అందించిన అశేషానుభవాన్ని ఆయన స్వీకరించారు. గ్రామసీమలో మొదలైన తమ బుద్ధి ఈ తదనంతర దృశ్యాలన్నిటికీ పూర్వరంగమైంది. శాస్త్ర విషయాల పరిజ్ఞానం ఈ అనుభవాలను తర్కించి పృథఃకరించి వివేచించి సారాన్ని రాబట్టుకుంది. భౌతిక శాస్త్రాలకు సాంఘిక శాస్త్ర మనదగిన మార్క్సిజం తోడైంది. ఫలితంగా కె. కె. అవతరించారు.

ఈ జీవితానుభవాలను పురస్కరించుకున్న రచనలే గాని కె. కె. కథలు, నవలలు తమ వ్యక్తి అనుభవాలకు వేసిన తొడుగులు కావు. మారిపోతున్న ఈ వాతావరణం ప్రతిబింబించినంతగా ఆ రచనలలో కె. కె. వ్యక్తి జీవిత విశేషాలు ప్రతిబింబించవు. యధార్థ వ్యక్తులు చారిత్రక వ్యక్తులైతేనే తప్ప మారు వేషాల్లోనైనా కనిపించరు. ఈ పద్ధతి ఆయనకు సమ్మతంకాదు కూడాను.

"నేను చిన్న కథలలో కూడా నాకు పరిచయం ఉన్న వాతావరణాన్ని వాడుకుంటాను గాని, నా అనుభవాలను వాడను...."

"నేను ఆంధ్రలో ఉన్నంతకాలమూ ఆంధ్రలో నాకు తెలిసిన వాతావరణం ఆసరా చేసుకున్నాను. చాలాకాలం పట్నంలో ఉండిపోయినమీదట ఇక్కడి వాతావరణం ఆధారం చేసుకోవలసి వచ్చింది. మధ్య తరగతినే తీసుకున్నాను......" (లేఖాంశం)

ఇది అక్షరాలా నిజమైతే కావచ్చుగాని కె. కె. గానీ, మరొక రచయిత ఎవరైనాగానీ స్వీయానుభవాలను తమ తమ రచనల్లోకి పొంగి పొర్లకుండా మూత వేసి ఉంచలేరు. అప్రయత్నంగానైనా అవి ప్రసక్తాలౌతాయి. అది వేరే విషయం. ఇప్పుడు చూడవలసింది కె. కె. నవలల వస్తువు. ఆంధ్రదేశంలో గుంటూరు, కృష్ణా మండలాల సాంఘిక వాతావరణమే ఎక్కువ నవలల్లో దర్శన మిస్తుంది. అదీ 1925—40 మధ్య కాలం నాటిది. అన్నీ మధ్య తరగతి కుటుంబాలే—ఒక్క 'ఎండమావులు' లోని రంగారావు (ప్రెస్ వర్కరుగా ప్రారంభించి నవలా రచన ద్వారా సినిమాలకు చేరుకున్న కార్మికుడు) తప్ప. దాదాపు అన్నీ బ్రాహ్మణ కుటుంబాలే. 'నీకేం కావాలి'లో కస్తూరి, 'ఎండమావులు'లో సుందరం, 'కులం లేని మనిషి' లో శాంత (ముగ్గురూ వేశ్యా కుటుంబాల యువతులేగాని, కస్తూరీ, శాంతా అదృష్టవంతులు; వాళ్ల తండ్రి మాత్రం బ్రాహ్మణుడు). తొలి నవలలో కథా నాయకులు ఎక్కువ మంది నిరుద్యోగులు, కథకులు, మద్రాసుకు ఎగ్రబాకి పత్రికలలోనో సినిమాలలోనో కాలుమోపిన వారు. బడుగు బడుద్దాయిలు గాకుండా, అందరూ కె. కె. లా ఆలోచించగలిగిన వారు—అభ్యుదయ పంథాలో. అయితే ఏ ఒక్కరూ రాజకీయాల సుడి గుండంలో ఎగిరి దూక గలిగిన సాహసులుకారు—ముఖ్యంగా "సంధ్యా జీవులు, సందేహభావులు" (శ్రీ శ్రీ). తల్లులు ఎక్కువగా మూర్ఖులు, తండ్రులు సాధువులు. చివరి నవలల్లో కన్న బిడ్డల పెళ్లిళ్లకోసం తలిదండ్రుల బాధలు, యువతీ యువకుల కొత్త భావాలు, ఆలోచనలో ఎంతో వెనకబడిపోయి అసమర్థతతో 'లౌక్యం'తో అతుకులబొంత బ్రతుకుల నీడుస్తున్న వారు, కనిపిస్తారు. వ్యంగ్యమూ, హాస్యమూ ప్రబలాలౌతాయి.

సినిమాలమోజు ఇంకా ఉంది. యువకులు కొందరు కుశాలావులాగా హుషారుగా షోకిల్లాగా కనిపించినా సంప్రదాయబద్ధమైన ఆలోచనే వారిది. యువతులు మరింత సాహసాన్ని చూపగులుగుతారు. మొదటి నవలల్లో ఉన్న రాజకీయాల పవనాలు వీచడంలేదు. కె. కె. నవలల్లో కొందరు వృద్ధులు, వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నంగార్ల అభిప్రాయాలకు వారసులమంటూ ఆచరణలో మాత్రం జిత్తులమారి నక్కలుగా కనిపిస్తారు. అక్కడక్కడ, చాలా అరుదుగా అలగాజనపు బ్రతుకు కూడా తొంగి చూస్తుంది. అది కనిపించిన ప్రతి సారీ, పై తరగతుల బోలు బ్రతుకులకంటె ఈ మురికివాడల బ్రతుకు మరింత శుభ్రంగా, సుఖమయంగా, బాహాటంగా ఉన్నదని అంతరం చూపడానికే నన్నట్లుంటుంది.

## వర్గీకరణ

కె. కె. నవలల (నేను చదవ గలిగినవి) పట్టికను ఇక్కడ ఇవ్వడం బాగుంటుంది. మొదటి ఐదు నవలలకు ఆయనే వరుస క్రమం చెప్పారు. తర్వాతి పదునాలుగు రచనలను ముద్రణ కాల క్రమం బట్టి కాకుండా, వాటి వస్తువు కాలక్రమం బట్టి ఒక వరుసలో పెడుతున్నాను :

తొలి రచనలు :—

1. నీకేం కావాలి? (పెద్ద కథ) — పుటలు 75
2. కులంలేని మనిషి (నవల) — ,, 88
3. మారుపేర్లు ( ,, ) — — ?
4. అరుణోదయం ( ,, ) — ,, 100
5. గడ్డు రోజులు ( ,, ) — ,, 127

నడిమి రచనలు :—

1. చదువు (నవల)—పుటలు 310—తొలి ముద్రణ 1952.
2. జీవితం (నవల) — ,, 156 — ,, 1961.
3. లేచిపోయిన మనిషి (చిన్న నవల) ,, 19— ,, 1949.
4. పంచకల్యాణి (నవల) ,, 216—రెండవ ముద్రణ 1961.
5. ప్రేమించిన మనిషి ( ,, ) ,, 192 — ?
6. ఎండమావులు ( ,, ) ,, 93 — ?
7. వారసత్వం ( ,, ) ,,

ఇటీవలి రచనలు :—

1. సరితాదేవి డైరీ (నవల) పుటలు ?—ప్రథమ ముద్రణ?
2. బెదిరిన మనుషులు (నవల) పు. 138 — ,, 1959
3. కొత్త అల్లుడు ( ,, ) పు.. 121 — ,, 1962
4. కొత్త కోడలు ( ,, ) ? ?
5. తార ( ,, ) పు. 85 — ,, 1962
6. బ్రతుకు భయం ( ,, ) పు. 134 — ,, 1964
7. కురూపి (చిన్న నవల) ? ('జ్యోతి'లో) 1963

ఇవి అన్నీ ఒక దాని కొకటి నకలు కాకపోయినా, ఏక కుటుంబీకుల నడుమ కొన్ని మొక్కట్లు (పోలికలు) ఉండేటట్లు, వీటి నడుమ సామ్యాలు ఒకటి రెండూ కాదు. 'నవలా కుటుంబం' అని శీర్షిక పెట్టడంలో కుటుంబరావుగారి నవలలనే అర్థం వచ్చేట్లయితే, ఆయన పేరుతో శ్లేష సాధించడం నా ఉద్దేశమై యుండలేదని మాత్రమే నే నిచ్చుకోగల సమాధానం. అంతేకాదు. కుటుంబ సంబంధమైన ఇతి వృత్తమే ఈ రచనలలో వివిధ దృక్కోణాలనుండి వర్ణితమైంది : తలిదండ్రులలో ఎవరో ఒకరు ప్రముఖంగా కొన్ని, తలిదండ్రులకు పుత్రీ పుత్రకులకు గల ఆకర్షణ వికర్షణలు ఆధారంగా కొన్ని, దాంపత్య ప్రధానంగా వైవాహికేతర సంబంధాలు ఉపాంగంగా మరికొన్ని, బాల్యంలో మైత్రి వ్యామోహాలు ప్రాయంలో నిష్ఫల ప్రణయాలు ప్రదర్శిస్తూ ఇంకొన్ని, వ్యభిచారం ఒక కొంత వేశ్యావృత్తి ఇక కొంత— ఈ విధంగా స్త్రీ పురుషులకు సంబంధించి తరాలవారీగా హృదయపరంగా ఒకే విధమైన ఇతి వృత్తం '"ఒక సూర్యుండు సమస్త జీవులకు తా వొక్కొక్కడై తోచు పోలిక" దర్శన మిస్తుంది. ఇది స్థూల పరిశీలనలోనే. దీనికి మినహాయింపులు లేవనికాదు. వైవిధ్యం లోపించిందనికాదు. భిన్నత లోపించింది. నైకత తక్కువైంది. అందుకనే ఈ శీర్షిక.

# 3

## సంఘచరిత్రాత్మక నవలలు

సాంఘిక చరిత్ర ప్రముఖంగా ఉన్న తొలి నవలలను మొదట స్పృశిస్తాను. అవి 'చదువు', 'అరుణోదయం', 'గడ్డు రోజులు'.

"'చదువు' లో అంతమైన వాతావరణాన్ని 'గడ్డు రోజులు'లో పొడిగించాను" అని రచయితే ఒక లేఖలో వివరించారు. కాని ఈ రెంటి నడుమ 'అరుణోదయం' ఉన్నట్లు ఆంతరంగిక సాక్ష్యాన్నిబట్టి నిర్ధారణ చెయ్యవచ్చును. 'చదువు' ముగిసే చోట 'అరుణోదయం' మొద లౌతుంది. తర్వాత 'గడ్డురోజులు'. కథ జరిగిన కాలక్రమాన్నిబట్టి ఈ వరుసే పాటించదగింది. అయితే ఒక చిక్కు. ప్రతి నవలకూ ఇంతో అంతో పూర్వ రంగం (back ground) ఉంది. అది సుదూరాగతంలోకి చొచ్చుకుని పోతుంది కూడాను. ఉదాహరణకు, 'జీవితం'లోని వర్తమాన కథాకాలం రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు వెనుకలుగా ఉన్నప్పటికీ, దాని పూర్వరంగం పదిహేను, ఇరవై సంవత్సరాల వెనక్కు పరచుకునివుంది. అదేవిధంగా 'చదువు'లో దాదాపు ఇరవయేళ్ల సాంఘిక చరిత్ర చిత్రం (1915—1935) మనకు లభిస్తుంది. 'అరుణోదయం' కథాకాలం 1920 నుండి 1945 వరకు అనుకోవచ్చును. ఇక 'గడ్డు రోజులు' ముఖ్యంగా డిప్రెషను రంపకోత దినాలకు—1934 ప్రాంతాలకు సంబంధించినది. అంటే, ఒకే దశను పలుమార్లు స్మరించడంతోబాటు, ఒక నవలలోని కథాకాలం ఇంకొక దానిలోని కథాకాలంలోకి పార్లిపోవడం కూడా ఉన్నది. (over lapping). సాంఘిక చరిత్ర ఆధారంగా నవలలు రచించడం, రచించి సఫలత నొందడం చాలా కష్టమైన పనీ, అరుదైన సంగతీ. ఎందుకంటే కథ తన స్వభావాన్ని చరిత్రకు అర్పించివేస్తే

చరిత్ర అబద్ధమైనట్లు కనిపించవచ్చు—neither fish nor fowl—అదీ ఇదీ గాక రేవణత్వం ప్రాప్తించవచ్చు. సాంఘిక చరిత్రగాకుండా కథగా ఉండవలెనంటే, కాలక్రమంలో, పాత్రలలో వయస్సూ అనుభవమూ తెచ్చే మార్పులు చిత్రితం కావాలి. గోపీచంద్‌గారి 'చీకటి గదులు' లో లాగా చరిత్రగురించి సుదీర్ఘోపన్యాసాలుగానీ, యథార్థ వ్యక్తుల ప్రతి రూపాలుగానీ ఈ లోటును పూడ్చలేవు. కె. కె. ఈ జారుడు నేలమీద మొదటనే కాలు మోపకుండా జాగర్త పడ్డారు. అయితే ఇలాంటి నవలలో ఉండవలసింది కాల మొక్కటేకాదు. దానితోబాటు స్థలంకూడా బారుగా ఉన్నప్పుడు (time and space) దానికి రాణింపు వస్తుంది. కాలప్రధానంగానేగాక మూల్య (Value) ప్రధానంగా ఉండిన నవల మంచి నవల అనిపించుకుంటుందని ఇ. యం. ఫార్స్టర్ Aspects of the Novel లో అంటారు.

"....There seems something else in life besides time, something which may conveniently be calld 'value', something which is measured not by minutes or hours, but by intensity, so that when we look at our past it does not stretch back evenly but piles up into a few notable pinnacles, and when we look at the future it seems sometimes a wall, sometimes a cloud, sometimes a sun, but never a chronological chart." (P. 36)

## వ్యక్తులూ—సంఘమూ

కాలక్రమణికమీద కె. కె. వేసినది ఉల్లిపొర కాగితమే గాని చిక్కటి దుప్పటి కాదనిపిస్తుంది. తరాలు మారుతాయి; వ్యక్తులు ఎడకారునుండి ముదురుకారుకు ఎదుగుతారు. అయినా వ్యంగ్యంగా ఉండిపోవలసింది వాచ్యమై, నవలకు చరిత్ర గుణం ఎక్కువౌతుంది. అక్కడక్కడ సంవత్సరాలు ఫలానా అనో, ప్రసిద్ధమైన ఒక ఘటనను పేర్కొంటూ 'ఆ సమయాన' అనో, ఈ కాల పురుషుడు తల వెళ్ల బెట్టుతాడు. ఈ అవలక్షణం బహుళం కాలేదు కాబట్టి సరిపోయింది. లేకుంటే చరిత్ర మిగిలి కథ అదృశ్యమై ఉండేది. అదృష్టవశాత్తు, కె. కె. ఈ ప్రమాదాన్ని గుర్తించినట్లు, వ్యక్తి జీవిత కథా పరిణామాల మీద తగుమాత్రం శ్రద్ధ చూపబట్టి ఈ రచనలు నవల లనిపించుకో గలుగుతున్నాయి. 'చదువు' లో సుందరం, 'అరుణోదయం'లో రామమూర్తి 'గడ్డు రోజులు'లో సత్యం, చరిత్ర త్రోవులకు లోబడిన వ్యక్తులు. వారి అనుభవాల సంపుటులు, ఆత్మల ఆవిష్కృతులూ ఈ నవలలు. 'చదువు' తప్ప తక్కిన వాటిలో విపుల విషయానికి సరిపడ్డ జాగా లేదు. పైగా వాటిని పాత్రల మూలంగానో ఘటనల ద్వారానో కాకుండా, నేరుగానో లేక 'ఒకరు' లేదా 'కొందరు' అనే వ్యక్తిత్వ మేమీ లేని పదార్థాల ద్వారానో వెలువరించేసరికి, సత్యం మిగులు పడినంతగా కళ మిగులు పడడంలేదు. చరిత్ర నవలను లోబరచుకుంటున్నది. నిజం కల్పనతో పెనబడుతున్నది. ఇది ఘోరాపరాధమో కాదో గాని, మట్టుకు రెండూ దెబ్బ తింటున్నవి. ఎందుచేత? వీటి పొలిమేరలు స్పష్టంగా కన్నుల బడనివిధంగా ఒండొంటిలో లీనమైనట్లు అవురిపోవాలి. ఇదీ, అదీ అనివేర్పరచి చూపేందుకు వీలు చిక్కగూడదు. ఈ నవలలలో ఇది నిజం, ఇది కల్పన అని విడి విడిగా నిలిచి ఒక దాని ప్రాబల్యంవల్ల మరొకటి దౌర్బల్యం పొందినట్లనిపిస్తుంది.

చారిత్రక ఇతివృత్తంగల ఈ నవలలను విశ్వసనీయం చేసేందుకేమో కె. కె. యథార్థ చారిత్రిక వ్యక్తులను నామకః అయినా ప్రవేశ పెట్టారు. 'చదువు'లో స్థానం, బాల గంధర్వ వంటి నటులూ గాయకులూ, గాంధీజీ మొదలు గొల్లపూడి సీతారామశాస్త్రివంటి నాయకులు ప్రత్యక్షమవుతారు—నామకః మాత్రమే కావచ్చు. 'అరుణోదయం'లో ఈ ధోరణి అతిశయించింది. నవలా కథానాయకుడైన రామ్మూర్తి రచించిన కథలను చదివి, వాటిలో సత్తా లేదని తెలిసిన్నీ, లౌక్యంతో అతన్ని ఉత్సాహపరిచే ఒక సమకాలిక సాహితీపరుడు (నవ్య సాహిత్య పరిషత్ సభాపతి) అందులో దర్శనమిస్తాడు. ఈ పద్ధతివల్ల రచయిత ఆశించిన ప్రయోజనంకాక, తద్విరుద్ధమైనది కలుగుతుందేమో? ఇది కల్పనకాదు, యథార్థ కథా కథనం అనిపించినప్పుడు, పాఠకుడికి ఉండవలసినంతగా సానుభూతి ఉండకపోవచ్చు. చారిత్రిక వ్యక్తులనూ ఘటనలనూ కథా క్రమంలో స్మరించేటప్పుడు బహు మెళకువగా ఉండకుంటే ఈ దుష్పరిణామం కలుగుతుంది—అవి సర్వాంశలా చారిత్రిక నవలలైతే తప్ప. వ్యక్తి జీవితాలకు అవి పూర్వరంగంలా వెనుకనుండిపోవాలేగాని నేరుగా రచయిత వాటిని పేర్కొనడం బాగుండదనుకుంటాను. భ్రమ వైదొలగి పోయినప్పుడు, కళకు సాఫల్యం ఉండదు. "పైకి వచ్చిన వాడు" అనే కథలో సీతారామారావనే వూసరివిల్లి గుణం గల యువకుడు ఏవిధంగా పైకి వచ్చాడో వర్ణిస్తూ, ఆక్రమంలో కొండ గుర్తులుగా "సీతా రామారావు బియ్యే పూర్తిచేసేసరికి కాటకం వచ్చి ధరలు పడిపోయినై", "ఇంతలో ఎన్నికలు వచ్చాయి", "యుద్ధం వచ్చింది" అంటూ రచయిత స్వయంగా చెబుతుంటే, నిజాన్ని కాదనలేముగాని కథ అనే పానకంలో ఈ ఘటనలు పుడకలని భావించకుండా ఉండలేము. కె. కె. రచనా తత్వానికి ఈ సాంఘిక చరిత్రా దృక్పథం విహితమే కావచ్చు. కథలో దానికి పరిమితులున్నాయి. ఏ అంశంవద్దనూ కాస్సేపు నిలిచి దాని లోతుకు దిగే వీలులేని రచనలలో, విరివి పెరిగినంతగా మరొకటి పెరగదు. ఆ చిత్రణలో వ్యక్తి నష్టపడి సంఘం లాభపడుతుంది—అంటే నవల సంఘ చరిత్రా పత్రంగా భాసించినంత వ్యక్తి చిత్రంగా భాసించలేకపోతుంది. ఉదాహరణకు 'చదువు' లాంటి పెద్ద (కె. కె. దృష్టిలో) నవలలో, నాయకుడైన సుందరం ఓ. న మః లతో మొదలైన కథనం సుందరం కుమారుడి అక్షరాభ్యాసంతో ముగిసి వర్తులం పరిపూర్ణమవుతుంది. ఈ పదిహేను

ఇరవై సంవత్సరాల కాలంలో పరంపరగా దూకిపడిన ఘటనలు సుందరం వ్యక్తిని, అతనికి సమీపస్థులైన వ్యక్తులను ఎలా తాకి ప్రభావాలు నెరపిందీ తెలుస్తుంది. అయితే, ఈ ప్రసారం బయటినుండి లోతట్టుకేగాని, లోపలనుండి బయటి వైపుగా ఎక్కువ జరగదు. సంఘ ప్రభావం కథా వ్యక్తులమీద పడినందుగా, వారిది దానిపై పడదు. సంఘం చేతిలో ఎటుపడితే అటు రూపు మారే బంకమన్నుగా వ్యక్తి మారినట్లనిపిస్తుంది. అది సహజంగా జరిగేదికాదు కాబట్టి మితి మించి సంఘ శక్తి, మితి తగ్గి వ్యక్తి శక్తి, వెరసి రెండూ అసహజాకృతులు ధరిస్తాయి.

## ఒకచేతి వ్రేళ్ళు

ఈ తొలి నవలల్లోని కథా నాయకులు ఒక్క మూసలో పోసిన కడ్డీలుగా కాకున్నా ఎక్కువ పోలికలతో ఒక చేతి ఐదు వ్రేళ్ళవలె కనిపిస్తారు. దానినిబట్టి కె. కె. గారికి ప్రియమైన నాయకు డెలాంటివాడో తెలుసుకోవచ్చును. ఈ నాయక లక్షణాలు (1) మధ్యమ వర్గంలో జననం. (2) డిప్రెషనురోజుల్లో ఆస్తి హరించుకుపోవడమో లేక పుట్టు దరిద్రమో (3) ఉన్నతా దర్శాలకూ కఠినవాస్తవాలకూ పొంతన కుదరక జీవితంలో ఎన్నో ఒడుదుడుకులతో రక రకాల వృత్తులకు పూనుకోవడం (4) మిగతవారికంటె ఎక్కువ సాంఘికచైతన్యమూ ఎక్కువ తెలివి తేటలు కలిగి ఉండటము (5) అయితే మిగత వారికంటె ఎక్కువ బాగుపడలేక పోవడము—అనవచ్చు. ఆదర్శవాదియైన అభాగ్య యువకుని అసమర్థపు జీవయాత్ర ఈ నవలలకు ప్రాణం పోసి కథా వస్తువు నిచ్చింది.

'అరుణోదయంలో' రామ్మూర్తి చాలావరకు అలాంటివాడు. ఉన్న కొద్దిపాటి ఆస్తినీ బంధువులువూడ్చివేస్తుంటే చూస్తూ వూరకుండి బస్తీలోనూ తర్వాత మద్రాసుమహానగరంలోనూ నానా తిప్పలు పడ్డాడు. బి. ఏ. చదువుతో ఉద్యోగంలోదూరక, స్వేచ్ఛను కోరి, ఆదర్శాలను పట్టుకొని జీవితాన్ని ఎదుర్కొని ఢక్కా మొక్కీలు తిన్నాడు. ఇది డిగ్రీలు లేని చదువు. జీవితమె పాఠశాల, ప్రయోగ మందిరముకూడా. ఒక్కొక్క మెట్టుగా ఈ చదువు విస్తరిస్తుంది. పాతవి కొత్త పాఠాల ముందు మరపున బడుతూ కొత్తవి మెదటికి పట్టేలోపల సరికొత్తవి దాడి చేస్తూ, ఆలోచనల్లో అభిమానాల్లో స్థిరత్వం దూరమై పోతుంది. మార్పులకు మోర అడ్డంపెట్టి ప్రతిఘటించినా, మొరాయించినా, చివరకు వాటికి దాసోహమన వలసి వస్తుంది. క్రితంలో వేటిని తాను నిరసించాడో వాటినే ఆశ్రయించి పైకెగ ప్రాకజూస్తాడు. ఒకభావ జాలం సంఘంలో కాలు నిలద్రొక్కుకుని మర్యాద (respectability) గామారిన తర్వాత—ఉదాహరణకు భావ కవిత్వ ధోరణి—దానిని సమర్థించబూనుకుంటాడు. ఈవిధంగా సంఘానికి ఎప్పుడూ రెండడుగుల వెనక ఉంటాడేగాని, దానితో కాలు కలుపడు—కలపజాలడు. అతని సంస్కారం సాహసానికి పూనిక చెయ్యజాలదు. ఇతను సాంఘిక నాటకాలను, భావ కవిత్వాన్ని ఆమోదించే లోపల, సంఘం ప్రజా నాట్యమండలివారి రాజకీయ నాటకాలనూ, అభ్యుదయ కవిత్వాన్నీ తెచ్చి పెట్టింది. మళ్లీ రామ్మూర్తి తల చీకటి కదల బారింది. మళ్లీ సందిగ్ధం. అయోమయం. కళలు ప్రజల హస్తగతమౌతున్నాయని అతడుగ్రహించే సరికి, అవి అయే కూర్చున్నాం:ు.ఒక మధ్యమవర్గ విద్యావంతుడు తనకు తానై జీవితంనుండి విద్య నార్జించే క్రమం బాధామయంగా, సంకోచయుతంగా, అర్ధ మనస్కతతోటి, ఈ రామ్మూర్తి పాత్ర ద్వారా, బయల్పడుతుంది. ఇలాంటి నవల గొప్ప నవలగా అయే అవకాశం ఉందని 'చదువు' నిరూపించింది. ఎందుకంటే ఇందులో భావ సంఘర్షణను సూక్ష్మాతిసూక్ష్మంగా చిత్రించే వీలు లభిస్తుంది. బాల్జా (Balzac) గురించి రాస్తూ ప్రఖ్యాత ఫ్రెంచి విమర్శకుడు ఆంద్రే మోర్వా ఇలా గంటాడు :

"The greatest novels are those that tell of a young man's apprenticeship to life... , the essence of which is to be found in the conflict between the hopes of youth and the relentless facts of life."

'చదువు' కె. కె. నవలల్లోకంతటికి పైజనుబట్టి మాత్రమేగాక, గొప్పదని నే ననుకుంటాను. మాక్సిం గోర్కీ నవల 'Bystander' అనేది నాకు గుర్తుకు వస్తుంది. సుందరం అనే నాయకపాత్ర ఆత్మ చరిత్ర ఈవనల—అతని ఆత్మయొక్క క్రమక్రమావిష్కారం. ఇందులో సుందరం, జానకి, నాగేశ్వరరావు, శకుంతల, లక్ష్మి, నరసు పాత్రల ద్వారా బాల్యం మొదలు యవ్వన ప్రథమ దశవరకుగల అన్ని వయోభేదాలను, వాటికి తగిన చిత్త వృత్తులను రచయిత వర్ణించారు. సీతమ్మ, సుబ్బమ్మ, శ్రీమన్నారాయణ, శేషగిరి, పార్వతీశం వగైరా పాత్రల ద్వారా నడి వయస్సులోని లేత, ముదురు పాకాల రుచి కూడా చూపించారు. జానకి జననం, శ్రీమన్నారాయణ మరణం ఉన్నాయిగాని అవి ఒకటి రెండు బంతుల్లో ఒదిగిపోయాయి. జననం మొదలు నవల రాయాలంటే వ్యక్తాన్ని చాలవుట్టుకు విడిచి కలలలోకంలోకి వూహాలరాజ్యంలోకి పయనించాలి. మృత్యుక్రమం కూడా వ్యక్తాన్ని మీరిపోతుంది. శైశవ వర్ణనం కూడా కష్టమే. ఆ పనిని Chidhood, boyhood and youth లో టాల్‌స్టాయి, My childhood days లో గోర్కీ, Wuthering Heights లో ఎమిలి బ్రాంటీ, అనేక నవలల్లో ఛార్లెస్ డికెన్స్‌వంటి గొప్ప నవలాకారులు వర్ణించారు. కె. కె. ఈ మహదవకాశాన్ని 'చదువు'లో జారవిడిచినా, శిశు ప్రకృతిని చాల అందంగానూ, విశ్వసనీయంగానూ వర్ణించగలరని "రక్తస్పర్శ" వంటి కథలలో ఆయన రుజువు చేసున్నారు.

గోర్కీ Bystander లో లాగా, 'చదువు'లో సుందరం, పరిసరాలలోని ఘటనలకు బానిసలాంటివాడు. ఆ ఘటనా చక్రానికి మధ్య ఉండనైతే ఉంటాడుగాని దానిని ఏవిధంగానూ తిప్పలేడు. ఇది సాధు ప్రవృత్తి అనేందుకంటె

దౌర్బల్యమనుకోవడమే సబబు. అతని ప్రకృతి ఎన్నడూ సార్థకమైన 'కర్త' కాలేదు. కాబట్టే దానికి 'క్రియ' సాధ్యపడలేదు— అనామకత్వాన్ని వదలి వ్యక్తిత్వాన్ని రాబట్టుకొనేందుకున్నూ జీవితాన్ని సార్థకమొనర్చుకొనేందుకున్నూ పనికివచ్చే చరితార్థమైన క్రియ. అతని క్రియ యావత్తూ 'చదువు' అనే మూడక్షరాలకే ఒదిగి కూర్చుంది. అదీ అసమాపక క్రియగానే ముగిసింది. డిప్రెషను రోజుల్లో వాటిల్లిన ఆస్తి నష్టం బెనారసు చదువును కొస ముట్ట నివ్వలేదు. అనుభవాలను స్వీకరించడమేగాని, అనుభవాలను కలిగించడం సుందరానికి చేతకాలేదు. జీవితప్రవాహానికి దూరంగా కేటాపడి నిలుచున్నాడు. పిల్లల ఆటపాటలనుండీ, పెద్దలరాజకీయాలనుండీ, సమవయస్కుల వినోదప్రియత్వంనుండీ (గోలీలాట మొదలు పేకాట వరకు) వయోధికుల వ్యవహారాల నుండీ (రాజకీయాలు, జాతీయ విద్యాలయాలు, జైలు శిక్షలు) సుందరం విడివడి, 'సాక్షి' ప్రాయుడయ్యాడేగాని, భాగస్వామియై పాల్గొనలేదు. నిజానికి అతనికి జీవితమంటే తగనిభయంలాగుంది. ఆత్మ విశ్వాసం పూజ్యం. అందుచేతనే మెట్రిక్యులేషన్ కాగానే బ్రతుకువాగులో దూకి నాగేశ్వరరావువలె నౌకరీ చూసుకోక, పై చదువుల నెపాన, జీవితం వేసిన ప్రశ్నకు సమాధానాన్ని వాయిదా వేశాడు.

''వాడు ఏ పక్క తిరిగినా జీవిత సముద్రంలోపడి ఈద లేకుండా కొంటుకుంటున్నవాళ్ళే కనిపించారుగాని, జీవిత శిఖరాన్నెక్కి నిర్మాణాలు చేసేవారు కనిపించలేదు.''

'అరుణోదయం'లోని రామ్మూర్తి ఇలాంటి ద్రాబ కాదు. యుద్ధకాలంలో మూడో చెయ్యి ఉండే ఉంటే, దానితో కూడా సంపాదించేవాడే. అతను బ్రతకనేర్చినవాడు. సుందరం బ్రతక వెరచినవాడు. పూర్తిగా సుందరానికి నకలుగాకున్నా దాదాపు అలాంటివాడే 'గడ్డు రోజులు'లో సత్యం. అతని ఆస్తి కూడా డిప్రెషనుకు తుడిచి పెట్టుకు పోయింది. సుందరంలో లోపించిన వ్యక్తిత్వం, సత్యంలో అతిశయించింది. ఫలితం ఒకటే. తనకంటే తక్కువ చదువు చదివిన ఆంజనేయులు (ట్యుటోరియల్ కాలేజి), శ్రీరాములు (న్యూస్ ఏజంటు, పత్రికా యజమాని), వామనరావు (కిరాయి నాటక కంపెనీ నిర్వాహకుడు), వీర్రాజు (స్టేజి నటుడు, సినిమా దర్శక, నిర్మాత), జీవిత స్రవంతిలోని పక్క పాయలలో చిట్టి తెప్పలు నెట్టుకుని మునుసాగిపోతున్నారు.—తాను మాత్రం జీవితాన్ని ముఖా ముఖీ ఎదుర్కొని బాహా బాహీ కలబడకుండా, అది తోసిన చోట్ల కెల్లా కొట్టుకుని పోతున్నాడు. లక్ష్యం ఇది అని తేల్చుకోకుండా లక్ష వ్యాపకాలలో వ్రేళ్ళు దూరుస్తాడు. పై పరిచయస్థులనే ఆశ్రయిస్తాడు. అయితే తన కేదో మహత్తర లక్ష్యం ఉన్నట్లు, దానికోసంతాను ప్రాపంచిక విజయాలను తృణీకరిస్తున్నట్లు, ఆత్మవంచన చేసుకుంటాడు. జీవిత నాటకానికి తాను ప్రేక్షకునిలాంటి వాడై ఉంటే, దానిని గుర్తించక, తానే, అందులో కథా నాయకుడిలాంటి వాడిననుకుంటాడు. ప్రపంచాన్ని మార్చజాలని కారణంగా, మూర్ఖపు పట్టుతో ప్రపంచంనుండి వెలిపడినట్లు ఒంటరిగా నడవటానికి కూడా తయారయ్యాడు. డబ్బంటే లెక్కలేదుగాని డబ్బు వినా పూట గడవదు. ఈ వైరుధ్యాన్ని దాట వేసేందుకే ఆ బహు రూపిత్వమూ, తత్ఫలితమైన అరూపిత్వమున్నూ.

సత్యం చేతగానివాడు. డబ్బు వేసిన సవాలును అందుకోలేకపోయాడు. ''మారు పేర్లు'' అనే నవలలోని సుబ్రహ్మణ్యం అనే మరొక బీద కుర్రవాడు అలా కాదు. ''మనుష్య ప్రయత్నంలోనూ మార్క్సు సిద్ధాంతాల్లోనూ కొంత నమ్మకం ఉంది.'' విచిత్రమైన కథలో (ఇటీవల 'ఇద్దరు మిత్రులు' అనే సినిమా కథకు ఈ నవల భిక్ష పెట్టిందేమో తెలియదు.) ఒక సంపన్న విద్యాధిక యువకునితో (భూషణం) పందెం వేసుకుని అతని పేరు తాను పెట్టుకుని, తనకు బొత్తిగా తెలియని వ్యాపారాన్ని నిర్వహించబూనుకుంటాడు. పుట్టుకనుబట్టిగానీ పెరుగుదలను బట్టిగాని, వ్యక్తుల సామర్థ్యాలు నిర్ణీతాలౌతాయా, కావా? ఇది పరిష్కరించవలసిన సమస్య. కావని చివరకు తేలినా, డబ్బుకూ, జన్మకూ మానవ జీవితక్రమాన్ని గట్టిగా మలిచే శక్తి లేకపోలేదనికూడా ఈ నవల నిరూపిస్తుంది. డబ్బే మనుష్యులమధ్య అంతస్తులనూ, అంతరాలనూ ఏర్పాటు చేస్తున్నది. ధనవంతుడి సుఖాలన్నీ ఇతరుల కష్టంమీద ఆధారపడి ఉన్నాయి కాబట్టి ఆ మేరకు ధనం వాణ్ణి నైతికంగా భ్రష్టు పట్టిస్తున్నది. ధనం లేకుంటే తిండికీ, బట్టకూ కూడా గతి లేదు. కాబట్టి ధనహీనుణ్ణి అది భౌతికంగా దుర్గతి పాలు జేస్తున్నది. ధనం ఉండబట్టే ఎవడూ ఎక్కువ తెలివి తేటలుగలవాడూ సమర్థుడూ కాడు. ప్రయత్న మూలంగా ధనహీనులు కూడా పరిస్థితులను అదుపులో పెట్టుకోవచ్చును. ఈ నవలలో 'సుబ్రహ్మణ్యం' చాటుక చాటే సంఘుతత్వం ఇలాంటిది.

## శృంఖలలు-విశృంఖలులు

ఈ నవలల్లో కె. కె. నిర్మించిన స్త్రీ విగ్రహాలను గురించి కూడా ఒకటి రెండు మాటలు. 'అరుణోదయం'లో రామ్మూర్తి భార్య 'కల్యాణి', 'గడ్డు రోజులు'లో సత్యం భార్య జానకి మామూలు మధ్య తరగతి గృహిణులు. భర్తలకూ, బిడ్డలకూ పరిచర్యలు చేయడం, మర్యాద సరిహద్దులు దాటని దాంపత్య సుఖాన్ని అనుభవించడం, కూపస్థ మండూకాలుగా ఉండి భర్తల మనోరథాల తీరు తెన్నుల గుర్తిద్దామనే తహతహగానీ వారి పథకాలకు ఉపకరిద్దామనే సానుభూతిగాని కన్పరచకపోవడం, పైగా అనుమానాలు పెంచుకుని సాధింపులు సాగించడం, ఇతర స్త్రీల నీడైనా తమ భర్తలపై ప్రసరించగూడదనుకోవడం, భర్తలు సంపాదనాపరులు కాలేదని చింతిల్లడం—ఇవి వారి సాధారణ లక్షణాలు. అయితే ఈ మర్యాద పరిధిదాటి కిందినుండి వచ్చిన సుభద్ర (అరుణోదయం,) భర్త విడిచిపెట్టగా ఒంటరిగా శాంతంగా బతుకుతున్న హైమవతి (గడ్డురోజులు), విధవరాలైన తర్వాత ఒంటి పులుసు చావక ప్రియుణ్ణి వెదుక్కొన్న శకుంతల (చదువు)—మానుషత్వం మరింత ఎక్కువ మోతాదులో ఉన్న స్త్రీలు. ఒక సంస్కారికీ, ఒక అలగా ఆడదానికీ పొత్తు కలిపి

స్త్రీగా ఈ మనిషి తన భార్యకంటె ఎక్కువ తృప్తి నివ్వగలుగుతుందని అతనిచేత గ్రహింపజేయడం, కె. కె. కి బాగా అలవాటు. సుభద్ర ప్రేమకు మట్టు మర్యాదలు, మాయ ముసుగులు లేవు. అది బహిరంగమైన నిర్నిబద్ధమైన దేహ మనో వ్యాపారం. "కల్యాణి లోక ధర్మంగా తన శరీరాన్ని వప్పగించేసింది. ఈ సుభద్రకో? ఈమెకు లోక ధర్మంలేదు. ఇది లోక ధర్మానికి అతీతమైన ప్రణయం. ఇది స్వచ్ఛందమైన ప్రేమ". రామ్మూర్తికిది వ్యభిచారం కావచ్చునేమోగాని, సుభద్రమాత్రం అతిచరించలేదు. సుభద్ర భర్త ఎవడూ లేడు, ప్రేమించినవాడు ప్రేమించినంత కాలం భర్త. మళ్లీ ఇది వేశ్యా వృత్తికాదు. నీతి పేరిటి చచ్చుకూ, అవినీతి పేరిటి పుచ్చుకూ మధ్యేమార్గం లేకపోలేదు. అది స్త్రీని వట్టి వ్యక్తి అస్తినీ చేయదు, సమాజానికి ఆటబంతినీ చెయ్యదు. అయితే వివాహం, దాంపత్యం తీసివేయదగ్గవి కావు. ఆనందానికీ, తృప్తికీ అడ్డు రానంత కాలం ఈ సంస్థలను మన్నించవలసిందే. అడ్డువస్తే తిరుగుబాటో, విడాకులో, పునర్వివాహమో, వ్యభిచారమో—హృదయం ఎన్నో మార్గాలు వెదుక్కొంటుంది.8

## రాజకీయాల తాకిళ్ళు

మరొక్క అంశం అవశ్యం గుర్తించ దగింది ఈ నవలల్లోని రాజకీయాల చిత్రణం—ముఖ్యంలో 'చదువు'లో. తెలుగు దేశపు గ్రామీణ వాతావరణాన్ని రాజకీయ ఘటనలు చెరువులో పెడి రాయి వేసినట్లుగా కల్లోల పరచడం సవివరంగా ఇందులో కె. కె. చిత్రించారు. వైస్రాయిగారి కారు ప్రయాణం మహాసంభ్రమాన్ని కలిగించే రోజులు....బ్రిటిష్‌వాడు యుద్ధంలో (1914—1918) గెలవ కూడదనీ, కాని గెలుస్తాడని అనుకుంటున్న రోజులు...తిలక్ ప్రాభవ కాలంలో గాంధీని తుస్కారిస్తున్న రోజులు...ఇవన్నీ కథానాయకుడైన సుందరానికి ఒంట బట్టలేదంటే, అవి వ్యక్తుల రూపంలో అతని గుండెను తాకక పోవడమే కారణ మనాలి. గాంధీజీ సహాయనిరాకరణోద్యమంమాత్రం అలాగాక, మేనమామ శేషగిరిగారి జైలు శిక్ష, పేదరికాల ద్వారా సుందరాన్ని కదిపింది. జైలునుంచి తిరిగివచ్చాక శేషగిరిలో వస్తుతః మార్పు వచ్చింది. తాను బాగు పడలేదు కాబట్టి ఇతరులు బాగు పడగలరనే నమ్మకం కూడా కదలబారింది. జాతీయవిద్యాలయం మూలబడడం, హరిజనులకు సవర్ణులతో సమాసనం లభించక పోవడం అతన్ని క్రుంగదీశాయి. అయితే గాంధీజీ అతని తల కెక్కి దిగనన్నాడు. అతను 'శుద్ధ' గాంధేయు డయ్యాడు. అది మతమైంది. కాబట్టి కొత్త కారు జాతీయవాదులను అర్థం చేసుకోలేకపోయాడు. ఒకప్పుడు విధవా పునర్వివాహాలనూ రజస్వలానంతరం వివాహాలనూ సమర్థించేవాడే, ఇప్పుడు తన కుమార్తెకు బాల్య వివాహం చేశాడు. అయితే, అల్లుడు రంగారావు జాతీయోద్యమంలో వచ్చిన మలుపుకు—జవహర్లాల్ నెహ్రూ ప్రభావానికి—మూర్తికట్టాడు. రాజకీయవిద్య సమాజపు అట్టడుగు వరకు విస్తరించి రైతు కూలీల సంఘాలను నిర్మిస్తేగాని, స్వరాజ్యం రాదని రంగారావు నమ్మిక. శేషగిరి వైరాగ్యం—రంగారావు ఆశామయదృష్టి: ఇవి రెండు తరాలకు సంకేతాలు. మూడవతరం ఆంధ్రదేశంలో గాక, సుందరం పై చదువులకై వెళ్లిన బనారసు యూనివర్శిటీ హాస్టలు గదుల్లో రాత్రి పూట రహస్యంగా వెదజల్లబడిన కరపత్రాలలో దర్శనమిస్తుంది. నైతిక బలానికి బాహుబలం తోడైతేగాని స్వరాజ్యం రాదనే 'టెర్రరిస్ట్' భావజాలం ఇది. మరి ఇంకొక నవలలో ఎక్కడా ఇంత విపులంగా ఒక మహోద్యమం లోని వివిధ దశలను వర్ణించే వీలు కె. కె. కి చిక్కలేదు. 'వారసత్వం' అనే నవలలో మాత్రం శాస్త్రి అనే అప్రధాన పాత్ర ద్వారానూ, "సుదర్శనం" అనే కథా నాయకుడి ద్వారానూ, రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఒక వైపు సోషలిస్టు అభిప్రాయాల వ్యాప్తినీ, ఇంకొకవైపు ధనార్జనాపరుల విజృంభణనూ కె. కె. చూపారు—ఇంత విస్తృతంగా కాదు.

డిప్రెషన్ మొదలు ద్వితీయ ప్రపంచ యుద్ధం వరకు, భావ కవిత్వం మొదలు అభ్యుదయ కవిత్వం వరకు స్థానం నరసింహారావు మొదలు సినిమా నటుల వరకు, గ్రామాలలో ప్రధానమైన వర్ణవ్యవస్థ మొదలు మహా నగరాల వర్గవ్యవస్థ వరకు జాతీయోద్యమం మొదలు కమ్యూనిస్టు ఉద్యమంవరకు—తెలుగు దేశపు పల్లెల్లో, బస్తీల్లో, పరిసర మహా నగరములో విద్యావంతులైన మధ్యమవర్గ యువకుల భావ స్ఫూర్తికీ దానిదశా పరిణామాలకూ, ఈ తొలి నవలలు సాహిత్య రూపాన్ని ఇవ్వబూనుకుని, చాలవరకు కృతకృత్యాలయ్యాయి.

# 4

## సంస్కర్తల వారసులు

కందుకూరి వీరేశలింగంపంతులు, రఘుపతి వేంకటంరత్నం నాయుడు చనిపోయింది, నిజానికి వారి వారసులమని చెప్పుకునే అలసభావుల చేతుల్లోనే. ఆ మహనీయు లిద్దరూ ఉద్యమప్రాయులయ్యారనుకుంటే, సదరు ఉద్యమాలు, వారి జీవిత కాలాన్ని దాటి సంఘాన్ని కదిలించలేదు. మిగిలి ఉంటే, అవి కొత్త మతాలుగానో సంస్థలుగానో బిర్రబిగుసుకుని గిరిగీసుకున్నట్లుగాఉండిపోయాయి. చిత్తశుద్ధి గల వ్యక్తులు కొందరు లేకపోలేదు. ఆ కొందరు వ్రేళ్ల మీద లెక్కింపదగినవారు. ఆషాఢభూతుల మందలో వారు కనుదగలకుండాపోయారు. పైగా, సంఘ సంస్కారోద్యమాల గిరసలు త్రొక్కుకుంటూ, కొన్నిపట్ల పోటీపడుతూ, మండల మహాసభలు, ఆంధ్రమహాసభ, కాంగ్రెసు ఉద్యమాలు వచ్చి, సంస్కరణకు అడ్డుదగిలేంతవరకు పోయాయన్నది చారిత్రిక యథార్థం.

కె. కె. నవయౌవన కాలంనాటికే సంస్కరణోద్యమాలు దాదాపు ఊకదంపుడుగా గాలిపేనుడుగా తయారై ఉండాలి.

---

8. అరుణోదయం: "పాశ్చాత్య నాగరకతా వ్యామోహం తప్ప చలంగారి కథల్లో ఏమీ కనిపించదు. స్త్రీ పురుషులు స్వేచ్ఛగా విహరించాలనీ, సంఘంలోవున్న కట్టుబాట్లు యువకుల ఆనందాని కడ్డొస్తున్నాయనీ ఆయనకి విచారం......స్వేచ్ఛ కావాలని ఎవరవరూ వెళ్ళి బట్టబయలులలో నివసించం—ఒకపాత్ర.

లేకుంటే ఆయన మనస్సును ఈ ఆషాఢభూతులు కదిపి నవలల్లో చోటు జేసుకుని ఉండేవారు కారేమోననుకుంటాను. 1939 లోనే ఆయన రచించినట్లున్న 'కులంలేని మనిషి'లో మొదట ఈ ప్రసక్తి వస్తుంది. భోగం మేళాల నిషేధం, పడుపు వృత్తి నిరసనం, శేరీ ఈనాముల రద్దు వగైరా సంరంభాలు సద్దుమణిగాక, తలిదండ్రులు అన్నదమ్ములు బంధుమిత్రుల రూపంలో సమాజాన్ని ధిక్కరించి సీతారామశాస్త్రి తాను వలచిన సానిపిల్లను పెళ్ళాడాడు. భార్య గతించగా, శాంతను పెంచి పెద్దజేశాడు. తనకు అవసానకాలం వచ్చిందని గ్రహించి, శాంతను తన తమ్ముడైన పురుషోత్తం చేతబెట్టి పోదామని పిలిపిస్తే వాడు అగ్గిరాముడై అన్నను నానాతిట్లు దిట్టి, కోపం తెప్పించి, చావును త్వరితం చేస్తాడు. పురుషోత్తం ఇంట శాంత ఖైదీ అవుతుంది. అది తప్పించుకుందామని పినతల్లి అనసూయ ఇల్లు చేరుతుంది. అది ఖైదు. ఇది రాదారిబంగళా. అక్కడ ఆచారం. ఇక్కడ దురాచారం. ఈ గోయినుండీ బావినుండీ విశ్వం అనే యువకుడు శాంతకు చేయి అందించి తప్పిస్తాడు. "నాకంటె అదృష్టవంతురాలీక్షణాన ఈ ప్రపంచంలో ఎవతయినా ఉందేమో చూపించండి!" అని శాంత అన్నమాటలు ప్రత్యక్షర సత్యాలు. కులమే విలువలకు కొలతబద్ద అయిన సమాజంలో కులంలేని పిల్లకు ఇంత సులభంగా వరుడు దొరకడం మాటల కాదు. శాంత కూడా ఊగిసలాట లాడకపోలేదు. నాగభూషణమనే విధురుడైన పెద్ద (వయస్సులోనే) మనిషికి ఉంపుడుగత్తెగానైనా ఉండిపోదామనుకున్నది. పురుషోత్తం ఇంటి కుందేటిపిల్లగానో, అనసూయ ఇంటి కుక్కపిల్లగానో ఉండగోరలేదు.

ఈ ధోరణి కె. కె. కథల్లో కూడా కనిపిస్తుంది. ఉదాహరణకు, 'పార్వతీ పరిణయం'లో రామకోటి అనే నోటిమాటల సంస్కర్త, ఇతరులకు వితంతు వివాహాలలో తోడ్పడి, తానుమట్టుకు వ్యక్తిస్వాతంత్ర్యం పేరిట రజస్వలగాని బాలాకుమారిని పెళ్ళాడాడు. అతని కుమార్తె పార్వతి కప్పటికే పెళ్ళీడు మించిపోయింది. కాబట్టి స్వయంగా శంకరం అనే కులం తక్కువ (హరిజనుడు) ఉద్యోగిని పెళ్ళాడింది. ప్రేమకోసం కాదు ఈ కులత్యాగం—తన కులాధిక్యతను అతనికి అడుగడుగునా గుర్తుచేసి విధేయుణ్ణి చేసుకోవచ్చుననే స్వాతిశయంకోసమే. 'కులంలేని పిల్ల'లో శ్రీ రామశాస్త్రి భోగంపిల్లను సంస్కరణాభిలాషతో పెళ్ళాడలేదు. ఇటువంటి అసాధ్య విషయాలకు ప్రతి ఒకడూ పూనుకోజాలడు. పూనుకోగలడని కె. కె. కి భ్రమలేదు. అక్కడ ఆ సానిపిల్ల, ఇక్కడ శంకరం—వీళ్ళూ తమకులాన్ని త్యాగం చేశారు. ఎవరి కులం వాళ్ళకు గొప్పది. సానులకు సానివృత్తిని మించినదేదీ లేనట్లనిపిస్తుంది—సహజమే. ఉదాహరణకు, పై నవలలో అనసూయ అనే వేశ్యకు, 'నీకేం కావాలి?' అనే నవలలో కస్తూరికి, ఇందు గురించి ఎంతో దృఢాభిప్రాయం ఉంది. అనసూయ ఇలాగంటుంది: "దీన్లో గొప్పవాళ్ళనిపించుకున్న వాళ్ళు నిజంగా గొప్పవాళ్ళే." ఎంత పోటీకో తట్టుకుని కాలు నిలద్రొక్కుకున్నా కనే ఈ వృత్తిలో ఉన్నతీ, సంపత్తీ చేకూరుతాయి. జన్మతః ఎంతో తెలివి ఉంటేనేగాని ఇక్కడ రాణించడం కష్టం—డార్విను సిద్ధాంతమైన జీవనస్పర్ధలో గట్టివాడేగట్టెక్కుతాడు (Survival of the fillest). ఈ కథలో పార్వతి శంకరం మనస్సును క్షోభపెట్టింది. తన దాంపత్య జీవితం నరకప్రాయమైతే, ఇక సంస్కార వివాహాలకు సాహసించే వారుండరేమోననుకుని, పార్వతితో సర్దుకుపోవటానికి ప్రయత్నిస్తాడు. వీరేశలింగం ఉద్యమాల ఆదర్శ తీవ్రతను సరిచేస్తూ గురజాడ అప్పారావు మానవస్వభావ చిత్రణ చేసినట్లుగా, అబద్ధపు ఆదర్శాలతో కథలను కట్టకుండా, సహజ మానవప్రకృతులనూ వికృతులనూ కె. కె. గౌరవిస్తారు. ఇంకొక రచయిత చేతిలో అయితే, 'కులంలేని పిల్ల'లో శాంత పాత్ర బారెడు ఉపన్యాసాలతో సాహసకార్యాలతో సంస్కారయుద్ధములో యోధురాలై ఉండేది. కె. కె. చేతుల్లో పడింది కనుక ఇలాంటి 'వీరశిల' కాలేదు.

"జీవితం" అనే నవలలో పదహారణాల సంస్కర్త—వీరావేశంతో వీరేశలింగం ముద్రతో దర్శనమిస్తాడు. దక్షిణామూర్తి ఉలిపికట్టె. ఊరివారికి "రాక్షసుడు". 'పంచకల్యాణి'లోని విశ్వనాథంవలె అల్లుడనే మిడత కోసం కూర్చున్న బల్లి మాదిరి కాకుండా, 'బెదిరిన మనుషులు'లోని మరో కుహనా సంస్కర్తలా 'రత్నం' అనేపేరు కలిసి వచ్చేట్లు తన కుమార్తెకు సీతారత్నం అని పేరుబెట్టి వేంకటరత్నంనాయుడిగారి శిష్యుణ్ణనిపించుకోజూడకుండా, ఈ దక్షిణామూర్తి పదిహేనెకరాల పొలాన్నీ ఇంటినీ ఈ సంస్కారపు జమకింద తగలేస్తాడు. అయితే కథల్లోని యువకులకు, తమ పెద్దల యుద్ధాలు అనవసర మనిపించేటంత మార్పు వచ్చింది. వితంతు వివాహాలకంటె సంఘం ఒకమెట్టు పైకెక్కి విడాకుల వరకు పోయింది. రెండుతరాల మనుషులకు పొంతన కుదరక, పెద్దలకు పిల్లలు పితూరీదార్లుగానూ, పిల్లలకు పెద్దలు చాదస్తులుగానూ కనిపిస్తున్నారు. నిన్నటి సాహసి నేడు పరిహాస భాజనుడవుతున్నాడు. ఈ సంఘపరిణామాన్ని 'జీవితం'లో దక్షిణామూర్తి గురించి ప్రకాశం, 'పంచకల్యాణి'లో విశ్వనాథం గురించి లలితల ద్వారా కె. కె. సూచిస్తారు.

## వేశ్యలో మానవత్వం

వేశ్యావృత్తికి సంబంధించిన పాత్రలు ముఖ్యంగా 'నీకేం కావాలి?', 'ఎండమావులు' అనే నవలల్లో చాల బలంగా చిత్రితాలయ్యాయి. గురజాడ అప్పారావు మధురవాణి ఏకాపునైనా పెళ్ళాడి హాయిగా మిరపతోటను చూచుకుంటూ కాయకష్టం చేస్తూ బ్రతకగోరింది. మధురవాణికి లేనిది ఆర్థిక భద్రత. అయితే వేశ్యావృత్తికి మూలకారణం ఆర్థికమేనా? ధనం సమకూరాక వేశ్యలు వృత్తి మానుతున్నారా? వేశ్యావృత్తి లలితకళ వంటిదైతే, పడుపు వృత్తి యంత్ర పరిశ్రమగా మారి, స్త్రీ అతి చవక వస్తువైంది. పడుపుగత్తెలను ఆ వృత్తికి ఆకర్షించి, ఆ నిరంతర ఆరోగ్య వ్యయానికి ఇష్టంతో కట్టివేసేదేమిటి? ఈ ప్రశ్నలకు జవాబుగా, క్షుద్ర జీవితాన్ని వర్ణించే గొప్ప నవలలు చాలా వెలువడ్డాయి—కుప్రిన్ yama, the pit, ఎమిల్ జోలా

Nana, డ్రీజర్ Sister Carrie లాంటివి. ఆ స్థాయికి చేరుకున్నా చేరుకోకున్నా, గొప్ప పాత్రలను రెంటిని కె. కె. సృష్టించారు—కస్తూరి (నీకేంకావాలి?), సుందరం (ఎండమావులు).

'మారుపేర్లు' అనే నవల వలె, 'నీకేంకావాలి?' అనే 75 అచ్చుపుటల పెద్దకథ ఒక సమస్యకు పూరణం వంటిది. డబ్బు, ప్రేమ—ఇందులో మనిషికి ఏది ముఖ్యం, అనేది ఒక సమస్య. ఒక వాతావరణానికి మచ్చికపడిన ప్రాణిని ఇంకొక వాతావరణంలోకి తదనుగుణమైన ఆలోచనా వైఖరులకూ—''ఒకగాడి''లో నుంచి పైకెత్తి ఇంకొక గాడిలోకి వెయ్యగలమా? ఇది రెండవ సమస్య.

రమామణి అనే వేశ్యకు ఎవడో పెద్దమనిషి పుట్టించి పోయినపిల్లకస్తూరి.ఆ పెద్దమనిషి కుమారుడు భావనారాయణకు చెల్లెలనే అందమైన పదార్థంతో అక్కర కలిగితే, అతని మిత్రుడు కస్తూరిని మచ్చిక జేసుకుని మంచిబుద్ధులు నేర్పి భావనారాయణకు కానుకగా ఇవ్వవలెనని సంకల్పిస్తాడు. తనకు అనుకోనివిధంగా సమకూరిన ధనంతో, బెజవాడ నుండి కలకత్తా వరకు సుందరితో రైలుప్రయాణం చేసి, దారిలో కస్తూరి వెకిలి పనులకు మండిపడుతూ, నీతులు మప్పుతూ భయపెట్టి లొంగదీసుకోవలెననుకుని నిష్ఫలుడౌతాడు. డబ్బుకూ డాబుకూ లొంగిరాని కస్తూరి మంచితనానికి లొంగిపోతుంది. ఒంటివేడికి కరిగిపోతుంది. మనస్సుకు మనస్సు సరియైన జవాబిస్తుంది: దయకు దయ! గురజాడ అప్పారావు 'సంస్కర్త హృదయం'లో రంగనాథయ్యరులాగా పైకెత్తేందుకు పోయిన ప్రబుద్ధుడు కింద పడుతాడు. అతనికి శీలం ఉన్నంతవరకూ ఆ దుశ్శీల ఎడంగా ఉండి, అతను శీలాన్ని వదులుకొన్నాడని, తనను అపేక్షిస్తున్నాడని తెలుసుకున్నాక, స్వార్పణం చేసుకుంటుంది. రమామణి ఇంటికి వచ్చి కుక్కల్లా కాచుకుని వుండే ''ఖాతాదార్ల'' లాంటి వాడుకాడు—మనస్సున్నవాడు, రసికుడు, నిజంగా తనను కోరాడు.అతనిదృష్టిలో కస్తూరిమామూలు పడుపుకత్తెకాదు. అతని ప్రేమకు సరికిసరిగా తనప్రేమనిచ్చే ప్రేయసి. ఇది వట్టి గాలిమేడకాదు—శరీరాలు నిర్మించుకునగా హృదయం గచ్చువేసిన ఆత్మసౌధం! ఉన్మాదమో మత్తో ఎక్కించక కళ్ళు తెరిచే ప్రేమ ఇది. దేహలకలయికతో మొదలైనా మనస్సులను శుభ్రపరిచింది. ఒకరి మంచితనాన్ని మరొకరికి చూపింది. ఆత్మాభిమానం, కులాహంకారం, సాంఘికాధిక్యం—ఇవి ఉన్నంతవరకూ జ్ఞానోదయం కలగ లేదతనికి. ఒక గాడిలో నుంచి ఎత్తి ఇంకొక గాడిలోకి మనుష్యులను వేయవచ్చుగాని, అది ధనంతో అయ్యే పనికాదు. ధనం సాధనమాత్రమే. పరివర్తనకు అది తోడ్పడవచ్చు. ముఖ్యం మనస్సు—దాని ద్రవీకరణ రూపమైన ప్రేమ. ప్రేమ అనేది పూర్తిగా దైహికమూకాదు—మానసికమూకాదు. దేహంతో మొదలు కాని ప్రేమ ఉండనట్లే, దేహాన్ని మీారని ప్రేమ ఉండదు.

చలం కూడా ఇలాంటి కథను ఇంకో విధంగా ఆదరించినవారే. అయినా చలం రచనలోని అన్ని అభిప్రాయాలు కె. కె. సమ్మతిపొందవు. ఈ కథలోనూ, 'గడ్డురోజులు'లో సత్యం ద్వారానూ చలం ప్రస్తావన వస్తుంది. కొంతవరకు మాత్రమే చలంతో ఏకీభావం. వివాహమనే సంఘ సంస్థ లోపరహితంకాదు. గురజాడ కూడా ఈ లోపాలను ఎత్తి చూపారు. అయితే చలం సూచించే ప్రత్యామ్నాయాన్ని—స్వేచ్ఛాప్రణయం—కె. కె. అంగీకరించరు. చలం ఉద్రేకాల కీకారణ్యంకాగా, కె. కె. ఆలోచనల ఉద్యానవనం. ఆయనది ఉచ్ఛృంఖలావేశం, ఈయనది క్రమవికసనం. జలపాతంవలెచలం అభిప్రాయాల ధోరణి రాలురప్పలతో బాటు మంచివాటిని కూడా స్థానభ్రంశం రూపనాశం పొందించగోరితే, నెమ్మది మీాదట రాశిని పెంచుకుంటూ వెలుగును ప్రసరిస్తూ కె. కె. భావన వినాశకంగా (nihilist) పరిణమించదు. మనస్ఫూర్తిగా పరస్పరం ద్వేషించుకుంటూనే గృహమే కారాగృహంకాగా భార్యాభర్తలు కొందరైనా వివాహ సంస్థలోని లోపాలకు సుఖాన్ని బలిపెట్టుకుంటున్నారు, అని గుర్తించి, ఒద్దిక ద్వారానూ స్త్రీ ఆర్థికస్థితీ సంస్కారస్థాయీ పెంపొందడం ద్వారానూ, ఈ లోపాలు చాలావరకు పూడిపోవచ్చునని కె. కె. ఇతర రచనలు సూచిస్తాయి. దాంపత్యం ఇలా ఏడ్చింది గనకనే కస్తూరి ఎవడికీ భార్య కానొల్లదు. భార్యాత్వమంటేనే బానిసత్వమని వాచ్యంగానే అంటుంది.

అలాంటిమరొక''స్వేచ్ఛాజీవి''సుందరం(ఎండమావులు). ఇక్కడ సంస్కారంలేని బజారు వాతావరణం ఉన్నా, మానవ స్వభావం ఉభయసామాన్యమే. భార్య గంగిని చక్కబెట్టుకోలేక తన్ని పుట్టింటికి తోలేసిన రంగయ్య, అది సినిమాహాళ్ల వద్ద రెండో ఆటవేళ రోజూ హాజరై పడుపు పనికి పూనుకుంటే, కోపంతో భగ్గుమంటాడు.కాని, ఆ వృత్తిలోనేపుట్టిన సుందరంను పల్లెత్తు మాటైనా అనడు. సుందరి నిత్యకన్య. చిననాటి నుండి చెలిమి చేసినా రంగయ్యకు కూడా పెళ్ళాం కావాలని కోరుకోదు. రాత్రిపూట రంగయ్య వద్ద గడిపి సుందరం ఇచ్చిన సుఖం త్రైలోక్యాధిపత్యమే. సుందరం 'సామాన్య' కావచ్చు. శేషు అనే త్రాగుబోతు నాలుగేళ్లు దాని నుంచుకొని జైలుకు పోయేముందు రంగయ్య 'ఆదా'లో పెట్టి పోయాడు. అయినా అతనికి అది 'స్వీయ' మాత్రమే. మధ్యమధ్య 'పరకీయ' అయినా ఖాతరు చెయ్యడు. ప్రేమ అనిపించుకోని, అనిపించుకోజాలని ప్రేమ-స్నేహమూలమైన అభిమానం—ఈ ఇద్దరికీ ఉన్న అనుబంధం. సుందరానికి ''ప్రేమబంధం సహజంగా కనబడేదిగాని నీతిబంధం చాలా అసహ్యంగా కనబడేది.'' రంగయ్య రంగారావుగా మారి కథకుడుగా పేరు గడించి మద్రాసుకు తనను తీసుకునిపోయాక గూడా అతనికి తాను భార్యగా మారిపోవలెనని కోరికను త్రోసివేస్తుంది. సినిమాలలో స్థానం దొరికాక, తనపట్ల రంగారావు ధోరణిలో మార్పు కనిపించి, అతను 'మర్యాద' కోసం ప్రాకులాడ మొదలెట్టేసరికి, అతనిలో సహజ మానవత్వం బదులు కృత్రిమాడంబరత్వం వచ్చి చేరేసరికి, తాను ఒక చిన్నఇంట వేరే కాపురం పెట్టింది. రంగారావు కట్టుకున్న పేకమేడలు కూలి అతనికి ఎండమావులలో దప్పిక తీరక, తిరిగి ఎప్పుడు దారికి వచ్చాడో, అప్పుడు తానైతానే వచ్చి కలిసింది. భార్య గంగి పీడకల, సినిమా అతి మంచికల—వీటి మధ్య యథార్థమైన, ఫలప్రదమైన

బ్రతుకులోని మానవహృదయ శుభ్రతకు ఈ పానిపిల్లను కె. కె. విజయస్తంభంగా నిలిపారు. మంగళసూత్ర మొక్కటే స్త్రీకి పురుషుడిపై పురుషుడికి స్త్రీపై జీవితహక్కును కలిగించలేదు. అంతకంటె స్థిరమైన హక్కు హృదయానిది. హృదయంలేని భార్యల కంటె హృదయంగల వేశ్యలైనా మేలు. నిజానికి, భర్త మీద ఇష్టంలేకుండా రోజూ అతనికి తన దేహాన్ని అర్పించుకునే ఆడది వ్యభిచారంకంటె ఘోరమైన అపరాధం చేస్తున్నది—మరెవరికోకాదు, తనకే—ఆ అపరాధం ఆత్మహత్యాసదృశం. ఈ నవలలో కన్పించే దృక్పథం ఇలాంటిదే.

## సంఘమూ-పాపమూ

వేశ్యావృత్తి, వ్యభిచారం—వీటి ప్రసక్తి ఎట్లాగూ వచ్చింది కాబట్టి, కె. కె. కథల్లో చాలా రచ్చజేసిన కథను స్ఫురించక తప్పదు. దానిపేరు 'పచ్చకాగితం.' ప్రపంచానుభవమూ, భావనాశక్తీ అసలేలేని ఇందిర పన్నెండో ఏటనే మగనాలైనా, పదునాల్గో ఏట కూడా ముద్దరాలుగా ఉండిపోయింది. దైహికంగా వ్యక్తురాలైందనేగాని మానసికంగా అవ్యక్తురాలు. ప్రక్కవారి నుంచి రంకుతనమన్నా భర్తను ధిక్కరించడమన్నా పాపమనే అభిప్రాయాన్ని స్వీకరించిందిగాని రంకుతనమంటే ఏమిటో తెలియదు. సోమయాజులు అనే పొరుగింటి పడుచువాడు ఇందిరను అవలీలగా లోబరుచుకున్నాడు. అదే రంకుతనమని కూడా ఇందిర తెలుసుకోలేదు. అతన్ని ప్రతిఘటించలేదు. ఆ పనిలో ఉద్రేకమూ సంతృప్తీ అనుభవించలేదు. అయితే తెలియని మార్పేదో ఇందిరను వశపరచుకోసాగింది. ఆ అనుభవం మళ్లీ కావాలి. ఇందిర తన దేహాన్ని గుర్తించగలిగింది. అది తెలియజెప్పిన గురువు సోమయాజులు. ఇంతలో భర్తతో సంధానమైంది. అయితే, సోమయాజుల ముందు ఈ భర్త పరమ అర్భకుడనిపించాడు. సోమయాజు లిచ్చిన అనుభవం ముందుంచుకొని, తానే ఇతగాడికి పాఠాలు నేర్పగలదు. సుఖం ఇవ్వగలిగిన సోమయాజులు తనకు పచ్చకాగితం ఇచ్చి వుండనక్కరలేదు. ఇవ్వవలసివస్తే, తన నుంచి పాఠాలు నేర్చుకున్న భర్త పేరిటి ఈ వాజమ్మ ఇచ్చి ఉండాలి. ప్రేమంటే ఏమిటో నేర్పగలిగిన సోమయాజులు తననే ప్రేమించమని ఇందిరకు నేర్పలేదు. అందుచేత ఇందిర భర్తను ప్రేమించింది. కాబట్టి 'అవినీతి'కి స్థానంలేదు. అంటే, పాపపు పని చేశాక గూడా, పాపపు పని అని, తెలియనందుచేత, నీతి గురించీ పాతివ్రత్యం గురించీ ఇందిర మనస్సులో అప్పటికే ఏర్పడి ఉన్న గొప్ప గురి చెక్కుచెదరనేలేదు.

పాల్కురికి సోమన చిత్రించిన ముగ్ధసంగయ్యపాత్ర బసివిరాలైన వేశ్యకాంతా సంభోగం వల్ల కూడా కామజ్ఞానం ఉదయించని పరమ అమాయక శిఖామణి, ఋశ్యశృంగుడికి నకలు. సంఘ జీవితంలో పిల్లలకు పదేళ్ల ప్రాయానికే ఇంతో అంతో కామపరిజ్ఞానం కలుగుతూనే ఉంది. అయితే 'భావనాశక్తి'లేని ఒక చిన్నదానికి సమాజంలో ఎలాంటి అనుభవాలు వస్తాయి, అనే సమస్యకు ఈ కథ ఒక పూరణ. కె. కె. వ్యభిచారాన్ని సమర్థిస్తున్నట్లు కొందరు వీరకమ్యూనిస్టులు అప్పట్లో చాలా హంగామా చేశారు. కె. కె. చేసిన తప్పంతా, కథాగత పాత్రల అవస్థలతో గాఢప్రమేయాన్ని చూపేటంత మోటుగా రాయకపోవడమే. ఇది నిర్మమత్వం అనిపించవచ్చుగాని నీతినిరసనం కాదు. విరుద్రేకమనిపించవచ్చుగాని వ్యభిచార సమర్థనం కాదు. శాస్త్రవేత్త ప్రయోగశాలలో చూపే వేర్పాటు, తాటస్థ్యం కూడాకాదు. మనుషుల మనస్సులను తరచి చూచేవాడు మనోభావాల గురించి పట్టించుకొన్నంతగా వాటి పాపపుణ్యాల గురించి పట్టించుకోడు. ఇక్కడ పాపపుణ్యాలను గురించిన సామాజికభావన గురించి పరిశోధన జరిగింది. వ్యక్తి తనకు తెలిసి చేయంది పాపమూకాదు పుణ్యమూకాదు, తప్పూకాదు ఒప్పూకాదు. అది ఒకానొక పని మాత్రమే. సంఘమే దానికి పాపపుణ్యాల ముద్ర వేస్తుంది. ఇది పరిశోధనా సారాంశం.

## వితంతువులూ-అనాథలూ

బాలవితంతువుల సమస్య ఈశ్వరచంద్ర విద్యాసాగరుని హయాం నాటిది పొమ్మని, వీరేశలింగంపంతులు పరిష్కరించి వేసిపోయాడు లెమ్మని ఉపేక్షించదగిందికాదు. ఈ నాటికీ అది అపరిష్కృతమైనదే. ఈ సంఘపరమైన అక్రమం కె. కె. ని చాలా పసితనంలోనే బటువుగా కదిపివేసినట్లుంది. ఆ విషయం గురించి నవలల్లోనూ కథల్లోనూ ఆయన ప్రస్తావించినప్పుడెల్లా గుండెల్లో అలుగు దిగినట్లుంటుంది. 'చదవు'లో శకుంతల ఈవరకే పరిచయమైంది. 'అమాయకురాలు' అనే కథలో భ్రమర వెంకటేశ్వర్లనే తన బాల్యస్నేహితుణ్ణి మెప్పించేందుకై, మళ్లీ తలవెంట్రుకలు పెంచుకొంటుంది. అయితే అతనికి ఒక సంబంధం స్థిరపడిందని తెలిశాక, మనస్సు ముక్కలయ్యే నిస్పృహతో, తానే క్షురకర్మకు పూనుకుని మళ్లీ వికృతరూపిణిగా మారుతుంది. సంఘం మీద పగతీర్చుకోలేక, తన సౌందర్యం మీదనే అసహ్యం పెంచుకొంటుంది.

'వారసత్వం'అనే మంచి నవలలో అనూరాధగాని, 'తార'లో శ్యామలగాని అలాకాదు. వాళ్లకు జీవితం మీది అపేక్ష చివరి వరకూ చావలేదు. భ్రమర వలె వాళ్లు పసివాళ్లూకాదు, అంత మెత్తని స్వభావమూలేదు. సుదర్శనం అనే బిడ్డల తండ్రి ప్రోద్బలానికి అనూరాధ, ప్రకాశరావనే మోసగానితో పెళ్లికి (మళ్లీ పెళ్లి) శ్యామల, ఒకరు సంకోచంతోటీ ఇంకొకరు ఆనందంతోటీ, లోబడిపోతారు. సుదర్శనం భార్య దుర్గాంబ అక్షరాలా దుర్గాంబే కాబట్టి అనూరాధను నేరుగా గాకుండా భర్తను రాచి రంపాన పెడుతుంది. అనూరాధను పెళ్లాడే సాహసం సుదర్శనానికిలేదు. ఇల్లు కట్టించి ఇస్తాడు. వ్యాపారంలో వాటాలుకొని ఆమె పేర వేస్తాడు. కాని, సంఘాన్ని కాదని పెళ్లాడలేడు. అతను అలాగైతే, అనూరాధ కూడా పునస్త్రీ కావడానికి సుముఖత చూపెట్టదు. తాను తినేది దొంగకూడు. చేసేది పాపకర్మ. కాబట్టి పెళ్లాడి ఈ పాపాన్ని పుణ్యంగా మార్చుకోవాలనుకోవడం ఆత్మవంచన. అనురాధ మనస్తత్వం ఇలాంటిది. సుదర్శనం తనను ఉద్ధరించాడు, నిలువనీడ నిచ్చాడు, సుఖమిచ్చాడు. అతనిపట్ల కృతజ్ఞత ఉంది. గౌరవం ఉంది. అంతేగాని, పెళ్లాడి అతని

భార్యను కావలెననే అత్యాశలేదు. పొంగి చల్లారినపాలు కాబట్టి ఇంత తాపీగా సాఫీగా తమ సంబంధాన్ని శాస్త్రీయ పరిధిలోనే నిలుపుకోగలిగారు వాళ్లిద్దరూ.

పుస్తె కట్టీ కట్టకముందే గుటుక్కుమన్న భర్త, శ్యామలకు లీలగానైనా గుర్తులేదు. ఊహ తెలిశాక పేరంటాలకూ సంబరాలకూ తాను పనికిరాకపోయాననే చింత మాత్రమే. శ్రీ రామశాస్త్రి అనే సంస్కరణాభిలాషి ప్రోద్బలంవల్ల శ్యామల తండ్రి రెండో పెళ్లి చేసి చేతులు కడుక్కున్నాడు. కంటికి నదురుగా కనిపించి చెవికి గూడా బురిడీ మాటలతో ఇంపుగొల్పే ప్రకాశరావు, శ్యామలకు భర్త అయ్యాడు. ఎలాంటి భర్త! భార్యను పెట్టుబడిగా పెట్టి, సౌందర్యానికి ప్రలోభపడే ధనవంతుల నుంచి లాభాలు వసూలు చేసుకుందామనే వ్యాపారం అతనిది. తర్వాత, మద్రాసులో శ్యామలకు సినిమా ఛాన్సు ఇప్పించి డబ్బు సంపాదించుకుని సంఘంలో పైమెట్టుకు చేరుకుందామనే కోరిక. శ్యామలకు అతని మీద రోత ఏర్పడింది. ఒక చెట్టియారును మోసంచేసి గడించిన డబ్బుతో ప్రకాశరావు అంతర్ధానమయ్యాక, శ్యామల బ్రతుకు బజారున పడి వుండవలసిందేగాని వాసుదేవరావు అనే సంపన్నుడు చేయి అందించబట్టి అది మళ్లీ చిగురించింది. అయితే మాత్రం? శ్యామల వితంతువుల సమస్యను ఎలా పరిష్కరించినట్లు? ఎవరికో ఒకరికి ఉంపుడుగత్తె కావడమేనా ఈ పరిష్కారం? కాని కాలేదు, అదే పదివేలు. తెగించి పెళ్లాడినా, ఇటువంటి భర్త దాపురించినప్పుడు, వయస్సులో ఉన్న ఆడది ఏం చేస్తుంది? శ్యామల అదే చేసింది. ఏం చేయాలి, ఏంచేస్తే మంచిది, అనే ఆదర్శాల, నీతుల ప్రసక్తి కాదిది. అనూరాధ కూడా ఈ ఉపపత్ని హోదానే పొందింది. 'కన్యాశుల్కం'లోని మీనాక్షి చేసిన చీకటి తప్పులూ, 'అమాయకురాలు'లో కె. కె. సృష్టి భ్రమర అఘాయిత్యం, 'చదువు'లో శకుంతలకు లభించిన ముండలముఠాకోరుభర్త శ్యామలకు నామమాత్రపతి ప్రకాశరావు—ఏమి తెలుపుతున్నాయి ఈ కేసులు? పూర్ణమ్మలా ఆత్మాహుతికి పాల్పడకుండా, విధవలు ముఖ్యంగా యువతులు చేతికందిన పామును కూడా పట్టుకుని ప్రవాహాన్ని ఈదుదా మనుకోవలసి వస్తున్నది. సుఖపడ్డవాళ్లు లేకపోలేదు.

భర్త లోకంమీదికి పోగా, పునిస్త్రీ అయిఉండీ దాంపత్య సుఖంలేక అనాథురాలుగా అటమటించే స్త్రీ హృదయాన్ని, యశోద అనే పాత్ర ద్వారా, 'లేచిపోయిన మనిషి' అనే 19 పేజీల చిన్నవలలో కె. కె. ఆవిష్కరించారు. ఎంత ఆస్తి ఉన్నా, కొత్త ఆస్తి వచ్చిపడినా, యశోద నిర్వేదానికి అంతులేదు. పైగా ఈ ఆస్తిని చూసి మేనమామ అయిన లక్ష్మీకాంత మనే పైలాపచ్చీసు గాడు యశోదను బుట్టలో వేసుకోవాలని పిచ్చివేషాలు వేసి బుద్ధి చెప్పించుకున్నాడు. యశోదకి ప్రాయశ్చిత్తం చేయాలనిపూనాలో కనిపించిన ఒక తెలుగు కుర్రవాణ్ణి ఇంటికి పిలుచుకు వచ్చి, వీడే నీ మగడని చెప్పాడు. యశోద ఏం చేయాలి? నిగ్రహంతోటీ స్వాభిమానంతోటీ ప్రవర్తించే దక్షిణామూర్తి, తానే యశోద భర్త నారాయణశాస్త్రి అయినంత స్వతంత్రంగా సొంతదారుగా ప్రవర్తించి, యశోదకు ఎంతో మనస్తాపాన్ని కలిగించాడు. అతన్ని భర్తగా భావించడమెట్లా? యశోద తండ్రి చలమయ్య మోచేతి నీళ్లు తాగలేక, అతను అదే వూరిలో ఒక హోటలులో సర్వరుగా చేరి, హోటలు యజమానిని కొట్టి జైలుకు పోవడం, ఆ దెబ్బ లాటకు కారణమైన హోటలు పనిపిల్లను తీసుకుచ్చి ఈ ఇంట పనికి కుదర్చడం, యశోదకు సంకటమైపోయింది. తన భర్తే కాకుంటే అలిగి ఎందుకు వెళ్లినట్లు? అయినా ఈ పరువు తక్కువ పని ఏమిటి? యశోద కన్నీళ్లు కార్చింది. ఆ కన్నీళ్ల మూలంగానే ఆమె హృదయానికి దక్షిణామూర్తి ఎక్కిపోయాడు. చివరకు నారాయణశాస్త్రిని తానేనని నిరూపించుకున్నాడు కూడా. ఎంతో నాటకీయతతో ఉన్న ఈ నవలికలో, స్త్రీ మనస్తత్వంలో మరొక అంశాన్ని కె. కె. పైకెత్తి చూపారు. స్త్రీత్వం, భార్యాత్వం అపేక్షించే ఒక సంపన్న యువతికి గల అహంకారాన్ని, స్వాతిశయాన్ని,ఆ అపేక్షలు ఎలా తొలగించివేశాయో ఈ నవలిక ప్రదర్శించింది.

## అంద చందాలు

'అరుణోదయం' నవలలో సుభద్రది కాకివన్నె, కాకి కంఠం. అయినా గాయని, నటి. రామ్మూర్తిని మెప్పించ గలిగింది. ఇలా ప్రతిఅనాకారీ బొంతకుతగిన గంతను పొందగలదా? అందచందాలే పెళ్లిపెటాకులకు ముఖ్యమవుతున్నప్పుడు, ఒంటి చాయను బట్టి మనిషి అందం నిర్ణయింపబడుతున్నప్పుడు, వికారం పట్ల సహనమూ సానుభూతీలేని ఒక ఆధునిక యువకుడికి వికారియైన ఒకస్త్రీని పరిచయంచేసి దాన్నిపెంచి ఫలితాలెట్లా గుంటాయో చూడబూనుకొన్నట్లుగా ఇటీవలి కాలంలో 'కురూపి' అనే నవలికను కె. కె. రాశారు. అయితే ఈ వస్తువు ఆయనకు కొత్తదేమీ కాదు. 'ప్రేమించిన మనిషి' అనే పాత నవలలో గోపాలం అనే యువకుడు పద్మ అనే యువతి దేహాన్ని మీరి మనస్సు నెలా దర్శించాడో చూపెట్టారు. పద్మ ఎర్రగా బుర్రగా సరోజ వలె ఉండక, "...వంటి చర్మం పదునుపెట్టి చెప్పులు కుట్టటానికి తయారు చేసినట్టుగా వికారంగా ఉంది. అసలు మనిషిని చూస్తేనే గానుగాడిన చెరకుగడలాగా ఉంది." కాబట్టే సరోజ ఆకర్షణ, పద్మ వికర్షణ. చివరకు సరోజ మనస్సు చిన్నదీ వికారమైనదీ అని, పద్మ మంచిదని, రంగుపూస్తే ముఖం చూడ వస్తుందని గోపాలం గ్రహిస్తాడు. గోపాలం ఆడదానిని తప్ప మరిదేన్నీ ఆలోచించలేని వయస్సులో ఉన్నాడు. నలభైఏళ్ల స్త్రీని కోరగలడు. పదహారేళ్ల మంగిని ముద్దాడగలడు. పెళ్లి అనే భావం వచ్చేసరికే ఆలోచనకు పూనుకుంటాడు. తనవి ఎంతటి అభ్యుదయ సాంఘిక భావాలైనా, వంగి వంటి పనిపిల్లను పెళ్లాడలేడు. పైగా మంగి సుఖపడదట! అతనికి అడ్డువచ్చింది స్వవర్గ సంస్కారం మాత్రమే. సరోజను ఎవడో పెద్ద ఉద్యోగి పెళ్లాడాడు. అది అటుంచి, సరోజ స్వభావం తనకు సరిపడదు. పద్మ తనపైన కన్నువేసింది. వాళ్లది బీద కుటుంబమైనా ఒకప్పుడు బాగా బతికిన వాళ్లు. పైగా సినిమా నటిగా పైకి వస్తున్నది. ఇన్ని కారణాలున్నాయి—పద్మను తన భార్యగా గోపాలం ఎట్లా కేలకు

ఎన్నిక చేయడానికి. ఈ హంగులేవీలేక పద్మ పట్టి అనాకారి మాత్రమే అయివుంటే, గోపాలం పెళ్ళాడేవాడో లేదో చెప్పడం కష్టం.

'కురూపి'లో సరస్వతి సొగసరీకాదు, అనాకారీకాదు. ఒక వేళ అనాకారి అయినా దాన్ని కప్పివేయగలంత తెలివితేట లున్నాయి. తన నెవరూ ప్రేమించి పెళ్ళాడరు లెమ్మనే నిస్పృహ, ప్రేమను గురించీ, మరొక దాన్ని గురించీ ఆమె చేత కఠినపు మాట లనిపిస్తుంది. పెళ్ళేవద్దు పొమ్మంటుంది. కోరికలేకగాదు—వరుడు రాడనే బాధవల్ల మాత్రమే. కనకం అనే కథకుడితో సరస్వతికి కలిగిన పరిచయం స్నేహమై, ప్రేమగా పక్వం చెందడానికి, ఏదో ఒక ఉత్పాతం అవసరమైంది—సరస్వతికి ఆరవ ప్రాణం వంటి అన్నబిడ్డ చావు. కనకం ఓదార్పు మాటల కంటె అతని ఒంటి వేడీ కంటితడీ సరస్వతిని గట్టెక్కించాయి. ఇంతకుముందు బిగబిగుసుకుని, అయాచితంగా వచ్చిన ముద్దుకు కూడా కదల బారని శిలవంటి సరస్వతి, ఇప్పుడు సహానుభూతి కలగలిసిన దేహ స్పర్శకు ప్రవాహప్రాయమైంది. ముగింపు కృత్రిమమని అనిపించినా, సమస్య విడిపోయింది. కథలోనూ జీవితకథలోనూ కురూపులకు గూడా స్థానం ఉందని మాత్రమేగాక, అందంగాలేని పాత్రలకు గూడా ప్రాధాన్యం ఉందని తేలింది. కాకుంటే, అలాంటి పాత్రల వల్ల అసాధారణ సమస్య లేర్పడవచ్చునంతే. అవి పరిష్కారంకాని వేమీకావు.

## అమ్మలూ—కూతూళ్ళూ

పెళ్లిళ్లకు సంబంధించిందే మరొక కోణం. ప్రేమ వివాహాలు ఇంకా బహుకొద్ది సంఖ్యలోనే జరుగుతున్నాయి. పెద్ద వాళ్ళు ఏర్పాటుచేసిన సంబంధాలే ఎక్కువ. కట్నాలూ కానుకలూ, చదువూ నౌకరీ, ఆస్తీ కులమూ—ఇవే ప్రధానాంశాలు. వీటి మీద కాంతిని ప్రసరింపజేస్తూ కె. కె. కొన్ని నవలలు రచించారు. మిగత వాటిలో అవి లేవనికాదుగాని, వీటిలో హెచ్చని మాత్రమే. వాటిలో 'పంచకల్యాణి' కాలక్రమాన్ని బట్టి మొదటి దనుకుంటాను. ఆ తర్వాత 'సరితాదేవి డైరీ', 'కొత్త అల్లుడు', 'కొత్త కోడలు.'

మొదటి దానిలో తప్ప తక్కిన వాటన్నిటిలోనూ పెళ్లి తాపత్రయం కూతుళ్ల కంటె వారి అమ్మలలోనే ఎక్కువగానూ బాహాటంగానూ కనిపిస్తుంది. 'పంచకల్యాణి'లో లలిత తల్లి సౌభాగ్యమ్మ (విధవరాలు) ఉన్నా ఎంతో నిగ్రహమూ సమర్థతా కలిగిన వ్యక్తి అయినందుచేత, ఆ ట్టే బయటపడదు. ఇక సరితాదేవి, కమలమ్మ (కొత్తఅల్లుడు), హనుమాయమ్మ ('కొత్త కోడలు')సమర్థులమనుకునే అసమర్థపు, అస్తవ్యస్తపు వ్యక్తులు. యుక్తాయుక్తాలుగానీ యోగ్యతాయోగ్యతలు గానీ తెలియని మూర్ఖురాళ్ళు. తమ కుమార్తెలకు పెళ్లి కావాలనే దుగ్ధ ఒక్కటే వాళ్లకు తెలిసింది. వాళ్ల దృష్టికి కుమార్తెలు అర్భకురాళ్ళు తెలివితక్కువ వాళ్ళు, దద్దమ్మలూ పెద్దమ్మలూ, తమ మంచి ఏమిటో తమకే తెలియదు కాబట్టి ఈ తల్లులు ఆ పిల్లలకు అనువైన మగళ్లను సంపాదించి పెట్టగోరుతారు. భర్తలను కుమాళ్లను ఖాతరు చెయ్యరు. ఎప్పుడో కాలగర్భంలో కలిసి పోయిందనుకోబడుతున్న మాతృస్వామ్యం (Matriarchate) ఈ అడపెత్తందార్లలో మళ్లీ ప్రాణం పోసుకుంటుంది. వీళ్ల దుష్టపాత్రలుగా ద్వేషాన్ని రాబట్టి ఎంతో విషాదాన్ని కలిగించే వాళ్ళేగాని, పిల్లలు బుద్ధిమంతులు కావడంవల్లనూ అబ్బలు నిదానస్థులు కావడంవల్లనూ, చివరకు వాళ్ల ఆటలు కట్టుబడి పోయి, ఈ నవలల కథలన్నీ సంతోషంతో ముగుస్తాయి. మరి ఈ ఉద్ధత వ్యక్తులు బోర్లాపడుతారు. ఆ పడడంలో ఒక్కసారిగా పడి, చదివే వాళ్లకు హాస్యాన్నీ కరుణనూ కలిగించి మరీ పడుతారు. ఈ పాత్రలన్నీ ఒకేవిధంగా ఆలోచించి ఒకే పద్ధతికి లోబడిన పాత్రలు కావడంబట్టి, హాస్యానికి పనికివచ్చినంతగా మరొకందుకు పనికిరావు.

కూతుళ్ళూ అల్లుళ్ళూ కొత్తతరం మనుషులైనందు చేత పెద్దలతో ఘర్షిస్తూనో, పెద్దలకళ్లు కప్పుతూనో, చివరకు తమ అభీష్టాలను నెరవేర్చుకొంటూరు. లొంగిపోవడమనే ప్రశ్న లేనేలేదు. వాస్తవ జీవితంలో ఉన్నంత కంటె మెరుగ్గా తెలివిగా కనిపిస్తూ స్వేచ్ఛను నిలబెట్టుకుంటూరు. అమ్మలవి హాస్యప్రధాన పాత్రలైతే, వీళ్లవి ఆదర్శ పాత్రీకరణలు. వెరసి, రెండూ వాస్తవాన్ని ఎక్కువగా మన్నించినట్లు కనిపించదు. 'సరితాదేవి డైరీ' ఒక్కటే ఆధారమైతే, సరిత కుమార్తె సరోజ తెలివితక్కువ పిల్ల అనుకోవలసి వచ్చేది. నిజానికి అలాకాదని 'సరోజ డైరీ' తెలుపుతుంది. తల్లి తనను రంజన్‌తో తార్చడానికి గూడ పూనుకొన్నా, సరోజ నిభాయించుకుంది. ఆత్మగౌరవం గల ఒకవ్యక్తి మరో వ్యక్తిని కోరేటట్టుగా, రంజన్‌ను కోరింది. అతను తాకినా ముద్దాడినా ఛీకొట్టలేదు గాని ప్రోత్సహించలేదు కూడా. సుముఖత చూపిందేగాని లొంగిపోలేదు. సరోజ సంస్కారి. అందుచేతనే వెకిలితనానికి దిగిన సావిత్రిని కాదని, సరోజను గౌరవించి ప్రేమించి పెళ్లాడాడు. తన తలిదండ్రులు సావిత్రితో పెళ్లి నిశ్చయించి శుభలేఖలు వేయించినా లెక్కచెయ్యక సరోజను రిజిస్టరీ పెళ్లి చేసుకున్నాడు. 'కొత్తఅల్లుడు' లో కమలమ్మను ఖాతరు చెయ్యకుండా చంద్రావతి నేరుగా కుశాలావు హోటలు గదికి వెళ్లి, అతన్ని పెళ్లాడేందుకు పూర్ణాంగీకారం తెలిపి, తల్లిని ఎదుర్కొంది: "మీ అందరి యిష్టాలూ వినివిని తలపట్టిపోయింది. ఇకముందు నా ఇష్టమేమిటో మీరు వినండి". 'కొత్తకోడలు'లో సరోజిని నేరుగా హనుమాయమ్మ ఇంటికే వచ్చి చలపతితో ధారాళంగా మాట్లాడుతూ, ఇంటెల్లపాదినీ (హనుమాయమ్మను తప్ప) మంచి జేసుకుంటుంది. ఇక్కడా రిజిస్టరీ పెళ్లి. కమలమ్మలూ, హనుమాయమ్మలూ, సరితలూ ఓడిపోకతప్పదు. తాము వెనకబడి, ముందుసాగిన వారిని వెనక్కు లాగేందుకు ప్రయత్నించడంలో బోర్లాపడి, తాము బాధపడుతూ ఇతరులను బాధపెట్టి, చివరకు నవ్వుల పాలౌతున్నారు. అలనాటి అగ్నిహోత్రావధాన్లు వీళ్లను ఆవేశించాడు. అయితే విషాదంగాక, హాస్యం కథలను ముగిస్తున్నది. అది సంఘవ్యాధులకు సున్నితమైన శస్త్ర చికిత్సకై వినియుక్తమౌతున్నది గాని వెకిలితనానికికాదు. ఈ

అమ్మతే గెలిచి ఉంటే భీభత్సమో శోకమో ప్రముఖంగా భాసించి ఉండేది.

నీ కుమార్తెను పెళ్లాడుతాను, లేదా నీ కుమారుడికి భార్య నౌతాను అని తమంత తామై కదిలివచ్చి కాబోయే భార్యలతో భర్తలతో నిస్సిగ్గుగా వ్యవహరించే వారి మంచితనం ఈ అత్తలకు కనిపించటంలేదు. ఏవో లోపాలను కప్పిపెట్టి మోసం చేసేందుకే ఈ పన్నాగా లన్నట్లుగా అత్తలు వెయ్యికళ్లు పెట్టుకుని తమ రెక్కలకింది పిల్లలను కాపాడుకుందామని ఆదుర్దా చూపుతున్నారు. పైగా, వీళ్లకు తమ అదృష్టంలో నమ్మకమే లేదు. అదృష్ట దేవత ఈ అల్లుళ్ల, కోడళ్ల రూపంలో వచ్చినా వాళ్లు ఆహ్వానించే స్థితిలోలేరు. పేదరికానికి, మట్టమైన ఆశలకు మాత్రమే అలవాటుపడిపోయిన మధ్యమవర్గపు కింది ఫాయా వాళ్లు, ప్రపంచపు పోకడ తెలియని కూపస్థమండూకాలు, ఆచార మర్యాదలంటూ పట్టింపులతో కన్నబిడ్డల సుఖాలను కాలరాచే వాళ్లు—ఈ గండాగొండి 'కులపాలికలు.'

## పాలకులు—పాలితులు

'పంచకల్యాణి' అనే నవలలోకూడా ఈ పెళ్లి వ్యవహారాన్ని ఐదుగురు కన్యల జీవితాలద్వారా భిన్నరూపాలతో ముచ్చటించినా, ఇందులో ఆ హాస్యంలేదు. మగవాళ్ల పొడనైనా సహించ లేని వీర మహిళా స్వాతంత్ర్యవాది లలిత, మన్నుదిన్న పాముగా ఉండి తండ్రి ఆమోదంతోగాని ఎవరినీపెళ్లాడనొల్లని తాయారు, తండ్రి ఎట్లాగూ తనకు సంబంధాలు తేలేడని రామకృష్ణ అనే ధనవంతుడైనబంధువును మెప్పించి సుఖమిచ్చి అతనికిరెండోభార్య అయి సంపదలలో తేలిపోయే సమర్థురాలు సుశీల,సుధాకరమూర్తి అనే ఒక అడవిమనిషిని పెళ్లాడి అత్తవారింటి అడవి పద్ధతులకు ముఖంవాచి భర్తచేత గెంటించుకుని వరసా వావీ ఎంచక చలపతితో వ్యభిచరించి తిరిగి తండ్రి పంచకువచ్చి సెక్రెటేరియట్‌లో ఉద్యోగం చేసే జానికి, అన్నదమ్ముల మీద గురిచచ్చి ఆడంగిరేకుల మగవాడని తెలిసినా ఏదోఇంత ఆస్తివుంది, పైగాచెప్పినట్లు నడుచుకుంటాడులెమ్మని కమలాకరాన్ని పెళ్లాడిన లక్ష్మి—వీళ్ల పెళ్లిళ్లు, ప్రేమలు, వీళ్ల తలిదండ్రుల అన్న దమ్ముల అవస్థలూ అభిప్రాయాలు ఈ కలగాపులగాన్నంతటినీ ఒకచేతి విసనకర్ర వ్యూహంలో కుదించిన నవల 'పంచకల్యాణి', ఒక చిన్నసైజు సంఘచిత్రమనదగింది. ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చేటంతవరకు,స్త్రీకి ప్రేమ,దాంపత్యసుఖం,మగనితో సమస్థితి, 'హక్కులు', దాదాపు వృథాలే. ఆ స్వాతంత్ర్యం నిమిత్తం, లలిత పురుష జాతితో యుద్ధం చేయాలంటే, జానకి ఉద్యోగం చేస్తుంది. పెళ్లికాక ముందు తండ్రికీ, అయిన తర్వాత మగనికీ మైనంలా వంగిలొంగే తాయారుకు పోటీ, తనంతతానై ఏదో విధంగా మగణ్ణి సంపాదించుకుని లోబరచుకుని అతని సంపద ననుభవించే సుశీల. ఈ ఇద్దరి మధ్య, రెక్కలులేని పిట్టవలె ఆశనూ ఆత్మవిశ్వాసాన్నీ కోల్పోయి, స్త్రీసముడైన పురుషుణ్ణి బుట్టలో వేసుకుని గాఢంగా నిట్టూర్చిన జానకి.

మనకింకా పెళ్లి గొప్ప సంఘసమస్యలలో చాలా గడ్డు సమస్య. పెళ్లికీ భావిజీవనసౌఖ్యానికీ పీటముడి పడిఉన్నప్పుడు, దాంపత్యంలో ఏకపక్షాధికారం ఆ సౌఖ్యాన్ని కుంటుపరుస్తుంది. సహిస్తూ ఉన్నదని, స్త్రీ సంతుష్టి చెంద లున్నదనలేము. వర్ణాల, వర్గాల అసమానత్వం కంటె దీర్ఘకాలికమైనదీ, దారుణఫలితాలు కలిగించేదీ ఈ స్త్రీ, పురుషుల అసమానత్వం. ఉదాహరణకు, సుశీల సవతితల్లి సుందరమ్మవయస్సు సుశీల వయస్సే అయినా, ముసలివాడైన సీతాపతికి రెండవ భార్య కావడం ఆమెదౌర్భాగ్యం, జీవితానికి సంఘమిచ్చిన శాపం. తాయారు వదిన సావిత్రి భర్తకు దాసి, పిల్లలకు ఆటవస్తువు. నవలా ప్రారంభంలో ఈ యువతు లైదుగురు కలిసి కాలేజిలో ఆడదలచుకున్న నాటకం పేరు 'మగ మహారాజులు' సార్థకమైన పేరు. రాజుల ఏల్బడిలో ప్రజలు పాలితులే (Subjects) గాని పౌరులు (citizens) కానట్లు, మగజాతి పాలనలో స్త్రీలు పాలితులే.

ఆడవాళ్లకు తెలివితేటలు తక్కువ అనే మాజీ సంస్కర్త విశ్వనాథం మొదలు, తాను మాత్రం తైనాతీ పనిచేస్తూ తన చెల్లెలులక్ష్మి కళ్లకుగంతలు కట్టుకోవాలనే నాగరిక నవయువకుడు సీతారాం వరకు, ఈ మగమహారాజులు నయాన భయాన ఆడవాళ్లను అదుపులో మితుల్లో పెట్టగోరుతున్నారు. రంగారావు వంటి స్త్రీజనాభ్యుదయవాదులు కొందరు నైట్ ఎరెంట్ (Knight-errant) లక్షణాలు ఒంటబట్టించుకుని, బస్సులలో లేచి సీట్లివ్వడం, వానలో గొడుగివ్వడం, ప్రమాదంలో వచ్చి చక్రం అడ్డు వెయ్యడంలాంటి చిట్టిపనులు చేస్తున్నారేగాని, సమస్యను మూలంవరకు తరచి అక్కడ గొడ్డలి పెట్టు పెట్టడంలేదు.చాలమంది స్త్రీలు కూడా తమ అనుభవం చేత మోసపోయి స్త్రీ సమస్యే లేదంటున్నారు. పాతకాలపు వాళ్లు ఆడది మగవాడికట్టుదిట్టాలలోనే ఉండిపోవా లంటున్నారు. విద్యావంతులైన యువతులలో గూడా తమ స్థాయి గురించిన గుర్తింపేలేదు. ఎటువచ్చీ లలిత లాంటి వీరనారీమణులు ఆవేశాన్ని చూపినంతగా ఆలోచనను సారించక, మగవారి మీది ద్వేషంతోటి తమ బ్రతుకులలోనే నిప్పులు పోసుకుంటున్నారు. డిగ్రీలుండటం ఆడదానికి అదనపు బలాన్నివ్వడంపోయి, మరొక సమస్యను తెచ్చి పెడుతున్నది: "డిగ్రీలుగలపిల్ల శీలంలేనిదానితో సమానం." ఇక కట్నాల మాట చెప్పడమెందుకు?

ఈ చిత్రం, మర్యాదస్థుల మనుకుంటున్న మధ్యమవర్గానిదే గాని, అటు సంపన్నులూ ఇటు నిత్యదరిద్రులూ ఇంత అన్యాయం కాదు. ఈనాటి కాలేజి విద్యార్థులను గురించి మాట్లాడుతూ, లలిత చేసిన వ్యాఖ్యానంలో అతిశయోక్తి ఉందేమోగాని అది అబద్ధంకాదు.

"ఆడవాళ్లను గౌరవించాలి, వాళ్లకు మగవాళ్లతోబాటు సమాన హక్కులివ్వాలి, జీవితంలో పురుషుడికి సమమైన పాత్ర స్త్రీ కూడా నిర్వహించాలి" అని అడ్డమైన వాళ్లూ చెప్పే ధర్మ పన్నాలలో ఆవగింజంతైనా విశ్వాసంలేని వాళ్లు కాలేజీల్లో చదువు తున్నారు! వీళ్లే రేపటి నాయకులు! వీళ్లకన్న రిక్షాలు లాగే వాళ్లూ, లాగుడుబళ్లవాళ్లూ తమ స్త్రీలను ఎక్కువ గౌరవంగా చూస్తారు! ఆ మాటకు వస్తే వాళ్ల ఆడవాళ్లు తమ భర్తలతో సమాన హోదా అనుభవిస్తూనే ఉన్నారు."

లక్ష్మి అన్న సీతారాం దాకా ఎందరు, జానకి అన్న కమలా కరం వంటి శిఖండి కూడా తన చెల్లెలు పరస్త్రీగా ఉండాలని, ఏ ఇంజనీరో డాక్టరో దాని భర్త అయితే బాగుంటుందని ఒకవైపు అనుకొంటూనే,ఇంకో వైపు జానకి చెలికత్తెలలో ఎవతె తనను మోహిస్తుందా అని వలలు వేస్తాడు.''జానకిఒక పురుషుణ్ణి ప్రేమించటమనేది అతని ఊహకు అసంభావ్యంగా తోచింది.'' లక్ష్మి అన్న శంకరం ఆడ సినిమాస్టార్ల అందచందాలను అగ్గించి వర్ణించవచ్చుగాని, అతని భార్య సావిత్రి ఏ నటుడి అందం మెచ్చుకున్నా అతను అగ్గిరాముడౌతాడు.

పరిష్కారమార్గం ప్రేమా? ప్రేమకూ సంఘనీతికీ పొనుగుదలలేదు కాబట్టి అది ముసుగువేసుకుని సందుల్లో గొందుల్లోనో, హృదయాల్లో మాత్రమేనో, ''అరణ్యావాసమూ అజ్ఞాతవాసమూ చేస్తుంది.'' అది అరుదేమోగాని అబద్ధ మేమీ కాదు. ఈ విషయం చలపతి చెప్పగా జానకి తెలుసుకొంది. లలిత దృష్టి లో ప్రేమించే హక్కుగాని, ఆ హక్కును అమలు పెట్టుకునే అధికారంగాని, మగవాళ్లకే ఉంది. ప్రేమింపబడే హక్కును స్త్రీ అమలు చేసినప్పుడే తాను బాగుపడుతుంది. పూర్వం, ఈహక్కును సానివాళ్లు అమలు పరచుకున్నారు. ''సానివృత్తి చట్టరీత్యా నిర్మూలమయితేనేంగాక, ఆడవాళ్లందరూ ఆనాటి ఉంపుడు కత్తెల వైఖరి అవలంబిస్తే ఆడదాని సమస్య అరక్షణంలో పరి ష్కారమవుతుంది.'' సంసారాలు చేస్తూనే, ఉంపుడుకత్తెల వైఖరి! ఇది సమన్వయ సిద్ధాంతం. ఆడదాని మీద ఇప్పటి రోజుల్లో మోజుతగ్గిందాఅంటే, ఈఆడబొమ్మలముఖచిత్రాలతో పత్రికలు, పోస్టర్లు, ఆడవాళ్ల అలంకరణ వస్తువులతో పరిశ్రమలు ఇవన్నీ ఏమిటి మరి? ఆడదానికి నేటి మన్నన భోగవస్తువుగానే. అదీ ఇతరుల స్త్రీలు. సంసారాల్లో మాత్రం కుళ్లు. కుళ్లిన కాయగూరలను పారేస్తారు గాని కుళ్లు సంసా రాలను మాత్రం సాగిస్తారు. ఇంతకీ ఉన్నంతలో ఈ సమస్యకు విశ్వనాథం చూపినదే సాధ్యమైన పరిష్కారం. చట్టాలూ వగైరా రొష్టను తగ్గించగలవేమోగాని తుడిచి పెట్టలేవు. ''సంసారాలు చక్కదిద్దుకోవటం కుటీరపరిశ్రమ. ఎవరి కసువు వాళ్లు ఊడ్చు కోవాలి.'' కె. కె. అభిప్రాయం ఇదేనైనా ఆశ్చర్యపడే అవసరం కనిపించదు.

## 5

### యువకుని నాణ్యాలు

కాలాన్నిబట్టి నడకల్లోనూ నడతల్లోనూ మార్పులు. అరుణోదయవ ఛతూ వుండిన రోజులలో, కొద్దిపాటి చదువూ సంస్కారమూ ఆస్తీపాస్తీ గలిగిన రామ్మూర్తిలాంటి యువకులు పరిణామాలను గుర్తించి, తదనుగుణంగా తామూ రూపొందారు. ఆశయాలంటూ ఆదర్శాలంటూ సత్యంలాంటి వాళ్లూ, ఉద్యమాలంటూ ఉత్సాహాలంటూ సుందరం లాంటివాళ్లు బతకలేక చితికిపోయారు. రామరావు, మార్పునుగుర్తించి స్వీకరించే సూక్ష్మ గ్రహణశక్తి యువకుల మనస్సుల నుండి వైదొలగిందేమో, లేక సాంఘికసంచలనాల మీద గురితప్పిందేమో, బాహ్యాభ్యంతరాలలో ఇప్పుడు తీవ్రమైన వైరుధ్యం ఏర్పడి ఉంది. వ్యక్తి వాదం అతిశయించింది. వేషభాషల నాగరికత, హృదయం అపరి పక్వతనూ మేధ అపరిణతినీ దాచివేయజూచి విఫలమవుతున్నది. అలనాటి సంస్కారం దూరమైంది. సాహిత్యం, కళలు వ్యాపార సాధనాలయ్యాయి. క్షుద్రాసక్తులు పెచ్చరిల్లాయి. ఇది స్థూలంగా 1947 తదనంతరం కలిగిన పెనుమార్పు.

కె. కె. నవలల్లో కూడా ఈ మార్పు ప్రతిబింబిత మౌతుంది.ఇది హఠాత్పరిణామంకాదు కాబట్టి ఇందులోనూ ఒకటి రెండు తరాలు, వారి మధ్య అంతరాలు కనిపిస్తాయి. 'ప్రేమించిన మనిషి' లో గోపాలం, 'జీవితం' లో ప్రకాశం, మరీ ఇటీవలి వారి వలె అప్రాచ్యులుకారు. మునుపటి రోజుల కొనసవ్వళ్లు వారిలో వినవస్తాయి.

గోపాలం 'డబ్బు జబ్బు' మనిషికాదు. అహంభావులలో ఒకడు—అంటే తనకు కావలసినట్టు, ప్రపంచం ఉండవలెనను కుంటాడు. తాను బతుకుతున్న బతుకు తృప్తినివ్వదు. మన శ్శాంతిలేదు. ప్రేమ, నీతి వగైరా విషయాలలో స్వతంత్రించి ఆలోచించగలడు. పేదలను కనికరించగలడు. రక్తపాతమూ బలప్రయోగమూ లేనంత మేరకు కమ్యూనిజాన్ని హర్షిస్తాడు. విప్లవం అంటే చుట్టూజూస్తూనే, నేటి ఆర్థిక వ్యవస్థకూ ప్రజాస్వామ్యానికీ ఉప్పు నిప్పు అని భావించగలడు. గోపాలాన్ని రాజకీయ పరిభాషలో వర్ణించవలసి వస్తే, లిబరల్, లేక రేడికల్ పోనీ సోషలిస్ట్ ప్రజాతంత్రవాది అనవలసి వస్తుంది. అతను తప్పవి సరిగా వైరుధ్యాల పుట్ట. ఇది గుడ్డిలో మెల్ల. మంగి వంటి పనిపిల్లను పెళ్లి చేసుకుంటే బాగుంటుందని ఊహించి, అయినా తన కొత్తస్థితిలో మంగి సుఖపడలేదు లెమ్మనుకుని సమాధానం చెప్పుకుని, పెళ్లి చేసుకోవచ్చేసరికి వర్ధమాన నటియైన పద్మను మాత్రమే చేసుకుంటాడు. సాహసమైన ఊహ, సామాన్యమైన పని—గోపాలానికే కాదు, నూటికి తొంభైతొమ్మిది వంతుల మధ్యమవర్గపు విద్యాధిక యువకుల నిజస్వరూపం ఇలాంటిదే. కాయకష్ట మొకటే 'హంబగ్' లేని పనిగదా అని ఆ పనికి పూను కుంటాడా అంటే, హోదా అడ్డు వస్తుంది. కమ్యూనిజాన్ని శుద్ధ మానవకారుణ్యావాదంగా బోధపరచుకున్న క్రిశ్చియన్ సోషలిస్టుల వలె గోపాలం కూడా స్వవర్గ మిచ్చే అదనపు సుఖాలను వదులుకొని కింది వర్గంతో మమేకం కాలేడు. ''నేను మీజాతిని నమ్మను'' అని మంగి పెద్దన్న రాఘవులు (పని కోల్పోయిన ట్రాము డ్రైవరు) అంటే ఎంతో బాధపడ్డాడు. ఇడ్లీ ముక్కలతో, అణాబేడలతో, మంగిని తనకు కృతజ్ఞురాలిని చేసుకుని దాని ఆసరాతో ఒక ముద్దు కూడా ప్రసాదించిన గోపాలానికి, ఈ మాటలు కనువిప్పు. ''మేమీ జీవితాన్ని మింగాలేము, కక్కా లేము; మా జీవితాలకు మనశ్శాంతి, సుఖమూ, సంతోషమూ అంటూలేవు.''

ఎన్ని లోపాలున్నా గోపాలం ప్రేమించదగిన స్వభావం గల పాత్ర. సంఘంలో పైనుంచి కిందికి పోవడం ఎంత ప్రయాసా భరితమో, కిందినుంచి పైకి పోవడం ఇబ్బడి కష్టమని నిరూపించిన

పాత్ర 'ఎండమావులు'లో రంగారావుది. కె. కె.కి ఒక అలవాటు వుంది. తన నాయకపాత్రలలో ఎక్కువమంది ఎప్పుడో ఒకప్పుడు ఎంతో ఒకంత కాలం కథకులనుగా చూపించడం, తద్వారా కథలను గురించి పత్రికలను గురించి సినిమా కథలను గురించి విమర్శ చెయ్యడం. 'చదువు'లో సుందరం 'భారతి'కి కథలు పంపినట్లు, 'అరుణోదయం'లో రామ్మూర్తి కథల ద్వారా ఒక పత్రికకు సంపాదకుడైనట్లు, 'గడ్డురోజులు'లో సత్యం పత్రికా సంపాదకుడూ నాటకకర్త అయినట్లు, 'జీవితం'లో ప్రకాశం కథల మూలంగా సినిమాల కెక్కినట్లు, చూపిస్తారు. రంగారావు కూడా అంతే. పత్రికలు ప్రెస్సు పనులూ కె. కె. అనుభవ పరిధిలోకి, దాదాపు కేంద్రస్థానానికి వచ్చినట్టివే. 'వీరాభిమన్యు' అనే చిత్రానికి 1930 లలోనూ,'జ్యోతి' అనే దానికి 1950 లలోనూ ఆయన పని చేయడమేగాక, సినిమా కేంద్రాలకు దగ్గరగా ఉండి సినిమా జీవులతో పరిచయా లున్నందుచేత, వీటిని గురించి కూడా కథల్లో నవలల్లో ప్రస్తావించడం జరిగింది. అయితే ఈ సినిమాకు సంబంధించిన రచనా భాగాలలో, ఫిలిం జర్నలిస్టుల, కథకుల పాత్రల ద్వారా, ఆయన హాస్యాన్ని ఎక్కువగా ఉద్దేశించినట్లుంది. ఎందుకంటే అవి కేరికేచర్ల వంటివో స్కెచ్చీల వంటివోగాని గంభీరమైన పాత్రలుకాదు. సినిమా జీవితం కె. కె. అనుభవ పరిధి సరిహద్దుల్లోనే ఉండిపోవడం ఇందుకు కారణమనుకోవచ్చు. అది పూర్తి తెలుగుకు నోచుకోలేదు. మసకమసక (umbra and penumbra) గానే దర్శనమిస్తుంది. సినిమా కథకుని పాత్ర ద్వారా ఆ పరిసరాలను తాపీగా 'సీరియస్'గా ఆయన చూపెట్టింది మొదట ఈ 'ఎండమావులు'లో రంగారావు ద్వారానే అనాలి.

రంగడు—రంగయ్య—రంగారావు—ఈ క్రమంలో ఒక ప్రెస్సు కార్మికుడు తన తెలివితేటల ద్వారా పైకి వచ్చాడు. వడ్రంగి కొడుకుగా మొదలై ప్రసిద్ధ కథకుడనిపించుకున్నాడు. ఇంగ్లీషు చదువు రాదని చిన్నచూపు చూసిన విమర్శకులను చిన్నబుచ్చి అతని నవలలు రాణించాయంటే, స్వానుభవాన్ని పురస్కరించుకున్న రచనలు అయినందుచేతనే. నవలలను సీరియలైజు చేసే పత్రికల పెద్దమనుషులు అతన్ని తొక్కివెట్టాలని చూస్తే, ప్రచురణ కర్తలు దోచెయ్యజూచారు. మద్రాసుకు చేరుకున్నాక, ఒక సినిమా ప్రొడ్యూసరు, అతని చేత పని చేయించుకుని చిత్రం విడుదల చేసి డబ్బు సంపాదిస్తూ గూడా అతని నోరు కొడుతాడు. సినిమాల్లో రచయితకు ఉన్నస్థానం ఎక్స్ట్రానటి స్థానం కంటె హీనం. పోటీ ఎక్కువ. గౌరవం తక్కువ. కారుడ్రైవరు మొదలు అసిస్టెంటు డైరెక్టరు వరకు కథను మార్చివేసే వాళ్లే. ఇతరులు గౌరవించడంలేదు గనుక తనపై తనకూ గౌరవభావం తగ్గి, డబ్బే ముఖ్యమై, రచన బజారు వస్తువుగా చవకబారి పోతున్నది. యాంత్రికత్వం అలవడుతున్నది. పూర్వంలేని భేషజం వచ్చింది. మానవ సంబంధాలు ధనంతో నిర్ణయమవుతున్నాయి. ఇంకొక నవలలో కె. కె. అన్నట్లు, నీతినిజాయితీల విషయంలో కూడా, లోకానికీ సినిమాలోకానికీ పోలికలులేవు. ఒక సంఘంలోనే రెండు జాతులున్నట్లుగా ఉంది. రంగారావుకు గిరవచ్చాక, ఎక్కువ కాలం అతను ఆ ఎత్తుల్లో నిలవలేక కింద పడ్డాడు. అయితే మళ్లీ అట్టడుగుకు పోవడం నామర్దా అనుకున్నాడు. సుందరం (ఉంపుడుగత్తె) సంపాదనతోనే నెట్టుకుపోతూ అక్కడే ఉండిపోయాడు. రాజు అనే పాతరోజుల కమ్యూనిస్టు స్నేహితు డిచ్చిన ఈ సలహా కంటె ముఖ్యమైనది సినిమారంగం గురించి అతను చేసిన విమర్శ. "రాజును తప్పుపడితే పాక్షిక దృష్టికి తప్పుపట్టాలి. అది వక్రదృషికి మట్టుకు కాదు." రచయిత చూపెట్టిన సినిమా ప్రపంచం పాక్షిక దృష్టి నుండి చూపెట్టిందేగాని సమగ్ర చిత్రంకాదు. ఎందుకు కాదంటే, కాజాలదు గనక, రచయిత అనుభవం అసమగ్రం గనక.

"జీవితం" లో ప్రకాశం ద్వారా కూడా ఈ విమర్శను కె. కె. కొనసాగించారు. పత్రికలలో "వెట్టిచాకిరి", "తోలు బొమ్మలాటల" ధోరణిలో ఉన్న సినిమా నిర్మాణంలో చీకటి కోణాలలో తారట్లాట మళ్లీ ప్రసక్తాలైనవి. మళ్లీమళ్లీ అవుతాయి. ఈ విమర్శలే ముళ్లపూడి వెంకటరమణగారి 'గిరీశం లెక్చర్లు' వంటి రచనలలో మరింత తేలిక హాస్యంతోటి కనిపిస్తాయి. కె. కె.ది వ్యంగ్యం కూడాకాదు. విమర్శ. సినిమాలు సంఘానికి అతీతమైన స్వర్గరాజ్యమని ఆయన భావించరు. ఎక్స్ట్రాల ఇబ్బందులు, రచయితల కడగళ్లు, వ్యాపారంగా మారిన కళవల్ల కలిగే అల్పానల్ప అనర్థాలు, ఎవరికైనా బాధతో కూడిన ఆగ్రహాన్ని కలిగిస్తాయి. కలిగించకుంటే కలిగించాలి. ఎందుకంటే, విద్యాద్వారంగా ఉపకరించవలసిన సినిమాకళ పూర్తిగా ధనార్జనకే వినియుక్తమవుతూ రావడం, జాతికి క్షేమంకాదు. ప్రతి మేధావంతుణ్ణీ ఆలోచింప జేయవలసిన స్థితి గనుకనే దాదాపు ప్రతి నవలలోనూ కె. కె. ఈ ప్రస్తావన తెచ్చారు. మద్రాసు నగరానికి (ఇప్పుడిప్పుడు హైదరాబాదుకు) ఆంధ్రదేశం పంపుతూ వస్తున్న ఎగుమతులలో ప్రముఖమైన వస్తువు, సినిమాలలో చేరగోరే యువతీ యువకులు కాబట్టి కూడా, సినిమాకు సాంఘిక ప్రాముఖ్యం ఉంది. రంగారావు వంటి సీరియస్ పాత్ర ద్వారా ఈ సాంఘిక జీవిత విభాగాన్ని ఇంకా లోతుకు దిగి ఇంకానిండుగా ప్రదర్శించే అవకాశం ఉంది.

'పంచకల్యాణి' నవలా ప్రారంభంలోనే, ఒక సినిమా పోస్టరులోని ఆడబొమ్మలకు లేని లక్షణాలు జత చేస్తున్న పసివాళ్లను చూస్తూ ఆనందంతోటి పకపకలాడుతున్న విద్యావంతులైన యువకు లిద్దరు కనిపిస్తారు. సినిమా వ్యామోహం, స్త్రీ వ్యామోహం నేరాలేమీ కావు. అవి ఉండవలసిన మోతాదులో మర్యాదకు లోబడి ఉంటే ఉపద్రవం ఏముంటుంది? అది వెకిలి వేషాలకు దిగినప్పుడే చిక్కు. కుశాలావు (కొత్త అల్లుడు)లాంటి కుర్రవాళ్లు, కనీసం వేషభాషల్లో, సంవత్సర సంవత్సరానికీ ఎక్కువౌతున్నారు. అతని సుగుణాలు వినా అవలక్షణాలే హెచ్చుతున్నాయి. షోకుల్లో విలాసాల్లో పోటీలు, పైపోటీలుగా ఉంది. ప్రత్యేకించి ఈ తరపు కుర్రవాళ్లు అవలక్షణాల పిడతలని చెప్పడం లేదు. అవి ఎప్పుడూ ఉన్నాయి. అయితే మునుపటి ఆదర్శబలం

న్నుగిల్చింది. దానికి తాము బాధ్యులుకారు. తమ పనులకు మాత్రం బాధ్యత తమదే? "..మంది మీద చూస్తే, విద్యార్థులు చాలా అనాగరకంగా ఉన్నట్లు ప్రవర్తిస్తారు" అని పురుష ద్వేషిణి అయిన ఒక యువతి పాత్ర అన్నదంటే, తప్పు పూర్తిగా ఆవిడది కాదు. నవనాగరకులలో కనిపించే కొత్త విలువలు, కొత్త అభిరుచులు, కె. కె. నవలల్లో కూడా పూర్తిగా బయల్పడలేదు. ఈ తరం వెనుకటి కంటె ఎక్కువ లౌక్యం తెలిసినట్టిది. అది ఆదర్శ దారిద్ర్యం మాత్రమేకాదు. మునుపటి కంటె ఎక్కువ పనితనం కలట్టిది. వేదికల పైన వినిపించే మాటకారితనం కాదు. దీనికి ఎక్కువగా వేడుక కావాలి. పైగా, ఈ తరంవారి సాంఘిక భద్రత, ఆర్థికావకాశాలు ఎంత విస్తరించినా, సరిగా అందరికీ అందుబాటు కావటంలేదు. అందుచేతనే జీవితం పక్కసందుల ఆకర్షణ, అడ్డదార్ల వెదుకులాట. ఈ ధనపక్షం ప్రదర్శితం కాకుంటే, నవయువకుల పాత్రలు ఉన్నవి ఉన్నట్లుగా పాక్షిక చిత్రణలేమో?

## కార్బ్వాన్ నవలలు

మరిరెండు కె. కె. నవలలను స్పృశించి, ఇప్పటికే దీర్ఘమైన ఈ వ్యాసాన్ని ముగిస్తాను. ఆ నవలలు, 'బెదిరిన మనుషులు', 'బ్రతుకుభయం.' నేటివరకు అచ్చైన కె. కె. నవలలలో ఇవే చివరి వనుకుంటాను—పత్రికలలో సీరియల్సుగా వస్తున్న వాటిని తప్పిస్తే. ఈ రెండూ ఒకే కథకు పూర్వాపరభాగాలు. కె. కె. నవలల్లో మును పెన్నడూ లేనంతటి హాస్యధోరణి వీటికి ప్రాణం. రచయిత హాస్యవ నుకొని ప్రారంభించిన దానిని, ఆయన వాస్తవవాద ప్రధాన రచనా దృక్పథం అపహాస్యంగానూ సంఘ విమర్శగానూ పరిణమింపజేసింది. బెదిరిన మనిషిగా మొదలైన సీతప్ప బెదరగొట్టే మనిషిగా మారాడు. ఈ మార్పును గుర్తించి నందుచేతనే,మొదటి నవలకు వేళాకోళపు పేరు(టి. వి. శంకరన్) పెట్టి ప్రకటించిన కె. కె., రెండవ నవలకు తనపేరే ఉంచారు.

సీతప్ప అనే గుమాస్తా గోగోల్ The great coat లోని గుమాస్తావలెనైనా సాహసం చెయ్యలేడు. ఉపోద్ఘాతంలో భానుమతిరామకృష్ణ గారన్నట్లు, అతను "నాసి మాత్రమేగాక పిరికి సన్నాసి కూడా" కావచ్చుగాని, ఆ పిరికి తనానికి తగు కారణం ఉంది. అతనికి జీవితంలో భద్రతకావాలి. అదేలేదు. ఎందనా పనికిరాని పింఛనీదార్లకు అనాథ శరణాలయంవంటి ఒక ప్రైవేటు కంపెనీలో నెలకు ఏభై రూపాయలకు మించని జీతంతో, తుమ్మితే ఊడేలాగున అసిత్తుగా ఉన్న ఉద్యోగంతో, చిత్తంబత్తెం అంటూ, రామకోటిలో తారకం చూస్తూ, పక్క గుమాస్తాలపై కొండెలు చెబుతూ, సీతప్ప సీతప్పగానే ఉండగలడు గాని, గతానుగతికత్వాన్ని విడిచి, సాహసం చేసి ఏ ఘనకార్యమూ చెయ్యలేడు. నగరజీవిత మనే ఘోరారణ్యంలో తానూ తన బిడ్డలూ సింహాలూ సివంగులూ కాజాలరు గనక నక్కతనం అలవరచుకోవాలని అతని మతం. జీవితం కొట్టిన దెబ్బలకు పారలౌకిక సమర్థన లిచ్చుకుంటూ ఆత్మవంచన ద్వారా ఆత్మసంతృప్తి పొందడమే చేతనైన పని. ఆదిమయుగంలో మనుషులింకా శాఖామృగాలైయుండిన దినాళ్లలో నేలను చూచి నిలువు గుడ్లు వేసే వానరమూ, పిల్లి వేటకి చిక్కి తప్పించుకోవచ్చుననుకునే ఎలుకా, సీతప్పలో కనిపిస్తాయి. పామును ముట్టుకొని, అది పామని తెలిసీ అది గుడ్డ పేలికేనని తనకు తాను ధైర్యం చెప్పుకొని ఇతరులను నమ్మింప జూస్తాడని భానుమతి సరిగా వర్ణించారు.9

ఈ పాత్రలో హాస్యం మాత్రమే ఉంటే ఇది flat అయి ఉండేది. అలాంటి flat పాత్రలు హాస్యానికి మాత్రమే వినియుక్తమైనప్పుడు రాణించినంతగా విషాదానికి వినియుక్తమైనప్పుడు రాణించజాలవని ఇ. యా. ఫార్స్టర్ Aspects of the N vel లో అంటాడు. "Flat characters are best when they are comic. serious or tragic flat character is apt to be a bore." ఒకే ఒక్క భావం వాటికి కేంద్రమై, వాటి వైఖరిని ఒకే ఒక్క వాక్యంలోనే తేల్చి చెప్పే వీలుంటుందట.

సీతప్ప ఇలాంటి పాత్రే అయినా, విషాదచ్ఛాయ తొంగి చూడకపోలేదు. ఆ విషాదం అతని దొక్కడిదే కాదు—అతని వర్గానిది, జీవితంలో అతనిలాంటి ఇతరులకు అనేకులకున్న స్థానానిది. ఈ విషాదస్పర్శ మూలంగానే, సీతప్ప 'కేరికేచర్'లా మిగిలి పోకుండా సజీవ వాస్తవ వ్యక్తిగా మారుతున్నాడు. మనలో చాల మందిలో సీతప్ప లక్షణా లుంటానికి ఇదే నిజమైన కారణమనాలి. ఆత్మవంచన అతనికి పథ్యంలాంటిదైతే ఫర్వాలేదుగాని,ముప్పూటలా గొంతుదిగక తప్పని పోషకపదార్థమైనప్పుడే అతని అవస్థయొక్క తీవ్రత మనకు తెలిసి వస్తుంది. అష్టగ్రహ కూటమి వల్ల జలప్రళయం వస్తుందని విని నమ్మి, భార్యను నమ్మించి, మద్రాసు నుంచి పరారీయై, ఆ కారణంగా ఉన్న కాస్త ఉద్యోగం ఊడగొట్టించుకున్నాడంటే, నవ్వుబుద్ధి వేయదు.

ఈ పనికిమాలిన పిరికితనంవల్లనే చాదస్తంవల్లనే సీతప్ప తనతోబాటు కుమారుడు సత్యాన్నీ కుమార్తె సోమిదేవినీ పనికిమాలిన వాళ్లుగా తీర్చిదిద్ది హితబోధచేసి వాళ్ల దాంపత్య జీవితంలో గౌరవమూ సుఖమూ లేకుండా చేశాడు. చివరకు, అత్తగారింటి బందిఖానా నుండి స్వతంత్రించి, బావ భాద్రాచలం చేయూత తోటి సత్యం సికిందరాబాదులో ఉద్యోగం సంపాదించి ప్రయోజకుడయ్యాడనీ, మంకుతనం వదిలి కోడలు సీతారత్నం భర్తతో వెళ్లిందనీ, మనిషి ననిపించుకుని కుమార్తె సోమిదేవి భర్త భద్రాచలం వద్ద మళ్లీ పరువు సంపాదించుకున్నదనీ తెలిశాక కూడా "నే నమ్మనే నమ్మ" నంటాడేగాని, సీతప్ప ఈ పరిణామాలను హర్షించడు. పైగా, ఈ బాగుపడిన వారి తెలివి తక్కువను

9. 'బెదిరిన మనుషులు'లో పాత్రలన్నీ మధ్యతరగతివే. కాని ఏ రెండూ ఒక రకానికి చెందినవికావు—'కుటుంబరావుగారి లేఖాంశం. "సంఘ విద్రోహులందరూ భీకర రాక్షసులుకారు. అందులో చాలామంది బడ్డు బడుద్దాయిలున్నారు. కథకులు వ్యంగ్యధోరణి అవలంబించి హాస్యరచనలుకూడా చేయవచ్చు"—రేపటి కథాసాహిత్యం : వ్యాసం.

విమర్శించక బూనుకుని తన తెలివితేటలను ప్రదర్శించుకుంటాడు. అతనిలో ఉన్న దాని పేరు శాంతమూ కాదు, నిగ్రహమూ కాదు—అదురు. రచయితే కలగజేసుకుని ఇలా వర్ణించారు: "సుడిగాలిలో కొట్టుకుపోయే పులి విస్తరాకుకు సంక్షోభం తప్ప సంఘర్షణ ఏముంటుంది?" జీవితంలో "కొట్టుకుపోవడమే" సీతప్పకు తెలిసిన విద్య.

ఈ రెండు నవలల్లోనూ కె. కె. ప్రవేశపెట్టిన యువకుల పాత్రలు కూడా పరిశీలనార్హాలు. పైన చెప్పినట్లు (నవయువకుల నాణ్యాలు) కొత్తతరం యువకుల ధనపక్షానికి చెందిన శేషు, ఋణ పక్షానికి చెందిన నరుసు ఎన్నదగిన వ్యక్తులు. కాఫీ, టీలైనా ముట్టుకోని, పసుపూకుంకుమా పూయని ఆడదాన్ని మెచ్చజాలని, బజారుకు ఒంటరిగా పోయే ధైర్యంలేని సత్యం ముమ్మూర్తులా సీతప్ప కుమారుడే అయినా చివరకు తన స్థితిని గమనించి, ఒకప్పుడు తాను ఈసడించి భయపడిన వాతావరణంలో కూడా ప్రెస్సు వర్కర్లు సమ్మె చేసినప్పుడు తానూ వారితో చేరి, బావమరిది నరుసు చెంపతాటించి, భార్యను ఆజ్ఞలో పెట్టి, సత్యం కూడా ప్రయోజకుడయ్యాడు. సీతప్ప అన్న శివుడి కుమారుడు శేషు కొత్త తరానికి మేలివి ప్రతినిధి అనదగిన పాత్ర. తగుమాత్రం లలితకళాభిరుచి (బొమ్మలు గీస్తాడు, సంగీతం విని ఆనందిస్తాడు), తగుమాత్రం ఆదర్శాల మీద గురి (సత్యానికున్నట్లు కమ్యూనిజమంటే తాచుపాము కంటె భయప్రదమనే దడుపులేదు), తగుమాత్రం సాహసం (ప్రేమించి లలితను పెళ్లి చేసుకోవడమేగాక లలితను సమానస్థురాలి వలె చూడగలిగాడు) కలిగిన ఇలాంటి యువకులు నానాటికీ అల్పసంఖ్యాకులవుతున్నారు. పోగా, నరుసు లాంటి వారి సంఖ్య ప్రస్తుతానికి ఎక్కువగా ఉంది. నరుసు సాహిత్య వ్యాసంగమంతా నగ్న ముఖచిత్రాలతోనో హత్యా దృశ్య చిత్రాలతోనో పుస్తకా లచ్చు వేయించి, వేనకువేల ప్రతుల నమ్మించి, పాఠకజనం కంటె క్షుద్రమైన అభిరుచులు బలిసిన సాధారణ పాఠకమహాజనుల అభిమానాన్ని రూపాయణాపైసలుగా మార్చుకోవడమే. ఏదో ఒకవిధంగా డబ్బు సంపాదించాలి, పైకి ఇంకా పైకి సంఘంలో అత్యున్నత స్థానానికి ఎగబ్రాకి పోవాలి—ఇదే అతని ఆశయం. ఇలాంటి ఎగబ్రాకుడు తత్వం (Careerism) ధర్మాధర్మాలను ఖాతరు చెయ్యదని 'తార' అనే నవలలోని ప్రకాశరావు ద్వారా కె. కె. నిరూపించారు. వాడు అభినవ గిరీశమై, భార్యనే తార్చి డబ్బు చేసుకోజూశాడు. తనకై తానొక తత్వాన్ని కూడా ఏర్పాటు చేసుకున్నాడు: "ఎత్తు ఎక్కటం సుఖంగా ఉండదు, శాం! కళ్లు తిరుగుతాయి. ఎందుకొచ్చిన పీడ అనిపిస్తుంది. కాని ఎక్కాలి, ఎంతదూరం వెళ్లగలమో చూడాలి. ప్రతి గడ్డిపరకా అదే జీవిత లక్ష్యంగా పెట్టుకుంటుంది." అతని అభిప్రాయంలో పాతివ్రత్యం "బాష్". మనస్సు అనేకుల మీదికి మళ్లడం "ప్రకృతి ధర్మం". సెక్సు అనేది, ఉక్కపోస్తుంటే ఫాన్ పెట్టుకోవటం లాంటిపని. అదృష్టవశాత్తు, పరమదారుణమైన అభిప్రాయాలు గల ఇలాంటి కలుపుమొక్కలు సంఘంలోగానీ ఈ నవలాకుటుంబంలో గానీ అధికసంఖ్యలో లేవు. సత్యం లాంటి అంబేదకూ ప్రకాశరావు లాంటి కిరాతకుడికీ శేషువంటి యువకుడు దూరస్థుడు. కె. కె. తొలి నవలల్లోని నాయక వ్యక్తులతో ఇతనికే ఎక్కువ పోలిక.

## రెండుమూడు ముక్కల్లో...

దాదాపు నలభై ఏళ్ల కాలంలో తెలుగుదేశంలోనూ మద్రాసులోని తెలుగు కుటుంబాలలోనూ—ముఖ్యంగా మధ్యమవర్గ పరిమితిలో విద్యావంతులూ సంస్కారులూ అయిన యువజనుల మనస్సులకు కె. కె. నవలలు అద్దమెత్తి పట్టాయి. ఈ అద్దంలో సంఘ పరిణామ దృశ్యాలు కనిపించాయి కనుకనే అద్దం గొప్పదని చెప్పలేము, చెప్పగూడదు.10 కాని, హేతువాది, ఆలోచనాశీలి, స్థిమితమనస్కుడు అయిన ఒక రచయిత, తాను తనపై విధించుకున్న పరిమితులలో, ఎంత విశ్వసనీయంగానూ పఠనీయంగానూ రచించగలడో, కె. కె. నవలలు ప్రదర్శిస్తున్నాయి. ఇంతకంటె శిల్పంలో చాకచక్యమూ అభిప్రాయాలలో సాహసమూ చూపెట్టిన నవలాకారు లున్నారు గాని నిరంతరాయంగా సంఘజీవితాన్ని ఇంతటి చిత్తశుది తోనూ సమర్థతతోనూ నవలీకరించినవారు ఒక్కరు కూడా తెలుగులో నాకు కానరారు. తెలుగు కథాకారులపై నవలాకారులపై కె. కె. ముద్రను ఇదమిత్థంగా మనము చూడము గాని ఆకులకు తిండిగా మారిన సూర్యరశ్మివలె అది వారిలో లీనమై మనస్సుకు పట్టిపోయింది. గురుశిష్యులు లేనట్టున్న కె. కె. అసదృశుడు.

---

10. Aspects of the Novel: Introductory: E. M. Forster A mirror does not develop because a historical pageant passes in front of it. It only develops when it gets "fresh coat of quicksilver—in other words when it acquires new sensitiveness. .."



# త ప స్వి

## శ్రీ యస్. రాధాకృష్ణమూర్తి

### 1

ఆకసమంటిన మంటలు యింకా ఆరనేలేదు
గుండెల్లో చెలరేగిన నిప్పులు చల్లారనేలేదు
చింతా వ్యాకుల ఫాలంపై  చితాభస్మం చెరగలేదు

నే నూహించలేదు
ఇది ఘోరం
విధి క్రూరం

మాకున్న ఒక్క కన్నూ పోయిందనుకున్ననాడు
ఈ చీకటి చిరంజీవి అనుకున్న ఆనాడు
నే నున్నానని నీ వన్నావు
నీ వున్నావన్నమాటే మరిచాం
వెన్నెల వెదజల్లే
చల్లని చందమామ నీవున్నావని

వైరులు దుస్సాహస వీరులై
కరవాలం ఝుళిపించిననాడు
నేనున్నానని నీ వన్నావు
నీమాటే మరిచాం
యుగాల యోగసమాధిలో
మూతవడ్డ మూడో కన్ను
నీ వున్నావని
మా బాధను మరిచాం
ఆరుచున్న మంటల్లో ఆజ్యం పోసే నెవ్వడు
నిద్రపోతున్న నిప్పుని కదిలిస్తున్న క్రూరుడు
ఎవడీ చూడలేని దేవుడు.

**2**

ఈనాడు నీవు లేవు
మా కీనాడు నిజంగా కళ్ళు లేవు
లేనికళ్లల్లో కన్నీళ్ళు మాత్రమున్నాయి
విశ్వమంత అర్ణవమై విషాదం వహించింది
మా కీ నా డెవ్వరూలేరు
విశ్వమొక్క గళమై విలపించింది
కళ్ళులేని కబోదిని నడిపించే దెవ్వరు
ఈ లోకానికి కాంతి లేదు
ఈ దుఃఖానికి శాంతి లేదు
ఇక నేమని ఆనందించను
ఆవేదన నేమని అణచను

నీవు కొత్త చొక్కా తొడుక్కున్నావనా
మళ్లీ ఏదో రూపంలో కనిపిస్తావనా
నాచేతకాదు
కట్టెలు తెంచుకున్న కన్నీళ్లావను గీతకుకాదు.

**3**

నీవు తపోమయమూర్తివి
ఒక్కక్షణం మాకోసం
తపస్సు భంగం చేశావు
సౌహార్దం సౌశీల్యం
లోపించిన లోకంలో
సుమహృదయం సమభావం
చవి చూపించావు
పిరికిపందలం మనమని
పరిపంథులు భావిస్తే
ఫాలాక్షం తెఱచిచూపి
అంతలోనె మూశావు
కన్ను
మూసి మరల తపస్సులో మునిగావు
లోకానికి స్వస్తి చెప్పి.

నీతలపై వెన్నెల వెదజలే
చల్లని చందమామ
మృత్యుంజయుడు.

---



# గానరసము

## పండిట్ రవిశంకర్

సంగీతమే రసము. అలంకార సర్వస్వము. ఆ రసమునకు ఒక గౌరవము, ఒక మహత్వము ఉన్నాయి. మరి రసము అన్నమాటకు అర్థము చెప్పడము ఎట్లా? అది అనేక లక్షణములు గుణములు కలది. ఆ అర్థము ఒక్క పళాన అందదు. ఇంద్రజాలమువంటిది అది. దాని గుణము ఆధ్యాత్మికము అనవచ్చును. అద్భుత కల్పనా పూర్ణమనవచ్చును. నాదాత్మకమనవచ్చును ; కామ రంజితము, ప్రేమోత్సేక బహుళము అనవచ్చును. అనగా శృంగారోద్దీపకము—అన్నా అనవచ్చును. సౌంద ర్యమునకు రసమునకు సన్నిహితసంబంధము ఉన్నది. ఒకదానినుండి ఇంకొకదానిని వేరుచేయుడము కష్టము. వేరుచేస్తే నిధనము తప్పదు. అవినాసియయిన రసము వినాసి అవుతుంది. దానిసంగతి అది.

ఈ సంగీతములో రీతులు, బాణీలు ఉన్నవి. వీనిలో ఒకదానికంటె మరిఒకటి అధిక రసాన్వితము అనలేము.

మరి యీ సంగీతము అందరికి ఒక్కటిగా వుండదు. అన్నితీరులుగా ఉంటుంది. ఎవరి అర్థము వారిది.

నేను ఏదో పాడుతాను. వాయిస్తాను. మంచి గురువులవద్ద విద్యను అభ్యసించాను. ఉస్తాద్ అల్లా ఉద్దీఖాన్ సాహెబ్ శిష్యుడను అవడం నా అదృష్టం. నాది పూర్వపు బికనీరు, రబాబియా ఘరానా సంప్ర దాయము. ఇటువంటి సంప్రదాయమునకు చెందిన నాకు సంగీతమునుగురించి ఒక భావనఉన్నది. ఆ సంగీతముయొక్క గుణము ఆత్మసంబంధమైనది ; ఆధ్యాత్మికమైనది. సంగీతమునకు ఆత్మను ద్రవింప చేయగల లక్షణము వున్నది. అది దాని గొప్పతనము. మన సంగీతమంతటికీ ఇదే పునాది. ఈ పునాది శాశ్వతమైనది. ఇది గట్టిది గనుకనే దాని ధర్మము, దాని ప్రకృతి నిల్చివున్నవి. చెడలేదు. అనంతకాలము మీాద ఎన్నిరకముల ప్రబలప్రభావములచేత అది ప్రభా వితము కాలేదు! అయినా అది తన ధర్మాన్ని, తన నిజ స్వభావాన్ని చెడలేదు. ఏవో కొన్నిమార్పులు వచ్చాయి. కొన్ని కొత్తఅంశాలు చేరాయి. పాతఅంశాలు పోయి నాయి. సంగీతము ఎన్నడూ కదిలిక ఎరగని స్థాణువు వంటిదికాదు. చలనములేకుండావుండే లక్షణం కలది కాదు సంగీతం. సంగీతములో కదిలికవుంది. అయితే అసలునకు మోసములేదు. అది అట్లాగేవుంది.

గురువులకు గురువు అయిన ఏ పురుషోత్త ముడు వున్నాడో, ఆ పురుషోత్తముని స్తుతించడంలో మనుష్యుడు పొంగిన పొంగే సంగీతము. ఆదినుంచి అది అంతే. వినయము, భక్తి దాని లక్షణాలు. వానివల్లనే సంగీతమునకు శాశ్వతత్వ ప్రతీతి ఏర్పడినది. సంగీతానికి, యీ భక్తికి, యీ వినయానికి ఎంతటి సాన్నిహిత్యం ఏర్పడిపోయిందంటే, అవే అది అయినాయి. రాగాలాపనలో, ధృపద్‌లో యీ లక్షణాలయొక్క ఔత్కృష్ట్యాన్ని ప్రస్ఫుటంగా దర్శించవచ్చు. ఇది విశిష్టమైన ఉదాహరణం. ఇంత కంటే వేరు ఉదాహరణమేలేదు. ఈ సంగీతము గురు శిష్యపరంపర కలది. గురువు శిష్యునికి బోధించడము మార్గము. పుస్తకాలుచూచి నేర్చుకునేది, నేర్పేదికాదు. ఇందువల్లకూడా ఈ సంగీతం తన అసలు లక్షణాన్ని ధర్మాన్ని చెడలేదు.

పూర్వంనుంచి మనకు ఒక సంగతి తెలుసు. శిల్ప ములు, కళలు నిల్చి బ్రతుకుతున్నాయి. అంటేఅందుకు వాటి ఆత్మలక్షణం కారణం. అనగా ఆత్మకు రంజనము చేకూర్చేవి మాత్రమే నిల్చివుంటున్నాయి.విషయములకు ప్రకోపనము, ఉల్లాసము కలిగించేవి నిల్వడములేదు. చస్తున్నాయి. చరిత్రలో ఇది ఇట్లాగే జరుగుతున్నది.

సంగీతంలో మహా విద్వాంసులైనవారి చరిత్రలు చూస్తే వారు అద్భుతాలుచేసినజాడ గోచరం అవు

తుంది. ఒక్క సంగీతంవల్లనే వారు అద్భుతాలు చెయ్య లేదు. ఆధ్యాత్మికశక్తిసంపదకూడా వారికివుంది. అందు వల్లనే అవి సాధ్యమైనాయి.

తాన్‌సేన్‌గారిని గురించి ఒక కథ చెబుతారు. దీపకరాగంపాడి ఆయన జ్యోతిని పుట్టించేవారని; మేఘ రాగాన్ని ఆలపించి వర్షం కురిపించేవారని. తాన్‌సేనులు వట్టి సంగీతం ఎరిగిన వేత్త మాత్రమే అయితే ఆయన యీ పనిచేయగల్గివుండేవారేకాదు. ఈ దక్షత ఆయ నకు అబ్బివుండేదికాదు.

తాన్‌సేనులు స్వామి హరిదాస్ శిష్యులు. ఆ మహాగురువువద్ద ఆయన సంగీతంతోపాటు ప్రాణాయా మాన్ని, యోగాన్ని అభ్యసించారు. ప్రాణాయామ రహ స్యాలను, యోగపు మర్మాలను తెలుసుకున్నారు.

ఘౌస్‌మహమ్మదుగారివద్దకూడా తాన్‌సేనులు సంగీతవిద్య నభ్యసించారు. సూఫీతత్వం మర్మాలను ఆత్మదాకా పట్టించుకున్నారు.

పూర్వం ఋషులు వున్నారు.మునులు వున్నారు. వారి చరిత్రలను తిరుగవేసినా వట్టి సంగీతంవలన అద్భుతాలు జరిగినదిలేదని, సంగీతవేత్తలైనవారు ఇచ్ఛాశక్తి, సంకల్పబలంకలవారని తెలుస్తుంది. సంగీతవేత్తలకు ఏవో అతీంద్రయశక్తులు, యోగ శక్తులు ఉండేవి. భక్తియోగంవలన, తంత్ర శాస్త్రా భ్యసనము, ఆచరణము వలన వారు అద్భుతశక్తి సంప న్నులైవుండేవారు. ఇది బాహ్య ఆడంబరంకాదు. అంత శ్శక్తియొక్క పౌష్కల్యం.ఇది వట్టినాదముకాదు. దానికి అతీతము. యోగాన్ని, మంత్రశాస్త్రాన్ని గురించి ఏ మాత్రం ఎరిగిన వారికైనా ఒక్కసంగతి తెలుస్తుంది. ఆహత నాదానికి, అనాహత నాదానికి మధ్య అంతరం అస్పష్టం. ఆహతనాదం బాహ్యవిషయం. అనాహత నాదం ఆంతరం. అది సాక్షాత్తూ బ్రహ్మగీతం.

భారతదేశపు సంగీతంయొక్క లక్షణాలు తొమ్మిది. వానిని రసములు అంటున్నారు. ఆ రస ములు ఇవి: శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, భీభత్సము, అద్భు తము, శాంతము. ఈ తొమ్మిది రసములు సంగీతము యొక్క తొమ్మిది ముఖములు. తొమ్మిది అవస్థలు; మన సంగీత ప్రపంచములో ఈ రసములస్థాయి అనంత మైన కాలముమీద మారుతూవచ్చింది. ప్రతిఒక్క రసము విశిష్ట లక్షణములుగల ప్రత్యేకమైన సౌందర్య ప్రతీతికి అర్థవ్యక్తిని కల్పనచేస్తూ వచ్చింది.

ముందు చెప్పాను. ఆలాపనను గురించి; ధ్రుపద్‌ను గురించి. ఈ రకమైన గానము ఆధ్యాత్మిక ప్రపంచా నికి మానవుణ్ణి సన్నిహితపరుస్తున్నది. ధమబాణ్‌లో ఈ ఆధ్యాత్మికమైన లక్షణం కాల్పనిక జగత్తుతో సంవలనము చెందుతున్నది. ఖయాల్, తుమ్రీ—ఇవి యీ కాల్పనిక జగల్లక్షణాన్ని పూదిపల్కుతూ శృంగార రసప్రతీతికి ప్రోది చేస్తున్నవి.

గాత్ర సంగీత పద్ధతిలో ఒక సౌలభ్యంవుంది. ఇచ్చట రసమును తేలికగా నిష్పన్నము చేయవచ్చును. కారణము—నాదము. ఇక్కడ నాదము ఒక్కటేకాదు. శబ్దములుగూడా వున్నాయి. పదములు వున్నాయి. సాహిత్యం ఉన్నది. జనము అందరు కుశాగ్రబుద్ధులు కారు. మర్మజ్ఞులుకాని, తీక్ష్ణులుకాని కారు. అందు వలన వారికి సంగీతముయొక్క స్థూలస్వరూపం తేలికగా అర్థం అవుతుంది. రవీంద్రులు ఇట్లా అన్నారు: ''భారతీయ సంగీతము మానవుని అనుభవ విశే షముతో సంవలనం చెందివున్నది'' అని నేను అంటున్నాను. మనకు భారతీయులకు సంగీతము పారలౌకికమున్ను; పారమార్థికమున్నూ. నిత్యజీవి తంలో తాత్వికజీవితం పానువడివున్నది. ఈ సంగీతము ఆ తాత్వికజీవితమును నిత్యజీవితమునుండి పృథక్క రిస్తున్నది. జీవునకు, ఆత్మద్రవ్యానికి అనగా మానవాత్మకు, మానవునకు అతీతమైన సర్వ మైన జీవలోకముల ఆత్మకు గల సంబంధాన్ని, బంధు త్వాన్ని భారతీయ సంగీతం గానం చేస్తున్నది. మానవు నకు దైనందినము అనుభవానికివచ్చే సుఖము వున్నది. దుఃఖము వున్నది. ఇవి అంతమంతములు. వీనికి పరిమితి వున్నది. శ్రోతయైనవానిని మన సంగీ తము ఈ పరిమితులకు దూరముచేస్తుంది. అతీ తుణ్ణి చేస్తుంది. సర్వ రాగ వివర్జితమైన, ప్రపత్తి ప్రకర్షమైన, సర్వజగత్తుకు అధిష్ఠానరూపమైన ఐకాంతికధామంలోనికి తీసుకుపోతుంది.''

కాలం ఎట్లా మారిపోతున్నదోచూస్తే నాకు తరసా విచారం కల్గుతూవుంటుంది. మార్పులు జరుగు తున్నాయి సరే; ఆ మార్పులనుబట్టి మనం నడుచుకో లేకపోతున్నాము. ఆ మార్పులను సంబాళించుకోలేక పోతున్నాము. సర్వమున్నూ త్యజించి గురువు పాద

సన్నిధిని చేరి, వారిని కొలిచి విద్యనభ్యసించే రోజులు గతించిపోతున్నాయి. ఇందుకు ఆర్థిక పరిస్థితులు ఒక పెద్దకారణము. విద్యార్థులు ముందు గట్టిగా కృషిచేద్దామన్న ఉద్దేశంతోనే వుంటారు. ఒక నాల్గు రోజుల పాటు అంతా బాగానే వుంటుంది. తర్వాత బాహిరమైన ఏవో పలుకుబడులు వారిమీద పని చేస్తాయి. ఏవో ప్రభావాలు ఒత్తిడి చేస్తాయి. వారికి తాలిమి తగ్గిపోతుంది. తొందర అధికమౌతుంది. సాధన చెయ్యరు. మరి సాధనచేస్తేనేగాని సంగీతంలో మెలకువలు తెలియవు; అందాలు అంతుపట్టవు. అనగా సిద్ధికల్గదు.

ఇది అసలు సమస్య. ఇది కష్టమైనది. మనము అందరము దీనిని పట్టించుకోవలసి వున్నది. పట్టించుకొనకపోతే సంప్రదాయకమైన పద్ధతులలో సంగీతమును అభ్యసించి, దానిని గానము చేయగలవారు తల ఎత్తరు. కొత్తతరము రాదు. మనము ఈ సంగతిని పట్టించుకొని యీ కొత్తతరమునువారిని ఆ పద్ధతులలో పైకితీసుకురావలసివున్నది.

సంగీతమును గురించి ఎవరి భావము వారికి వున్నది. అది వారి అభిరుచులనుబట్టి, ఇష్టము అయిష్టములనుబట్టి వుంటుంది. రసగ్రహణమును గురించి కూడ ఇట్టి భావములే వున్నవి. ఏది బాగున్నది, ఏది బాగుండలేదు అన్న విషయముకూడ ఏదోవిధముగనే పరిష్కారము చేయబడుతున్నది. మంద్రస్థాయిలో ధృపద్‌బాణీ గానం చేయబడుతున్నప్పుడు, కొందరకు హాయిగా వుంటుంది. అందులోవారు లీనమై స్థాయీ భావాన్ని భజిస్తారు. కొందరికి, ఖయాల్, కొందరికి తుమ్రీ ఇట్టి ఆనందాన్ని తెచ్చిపెడుతూ వుంటాయి. మరికొందరికి ఇవే వట్టి ఏడుపుగొట్టు సంగీతమువలె విన్పిస్తాయి.

తారస్థాయిలోవున్న దేనినైనాసరే శ్రోతలు ఆనందించలేరు. లయలలో మార్పు, మద్దెలమోత వారికి పట్టవు. ఆ పద్ధతిలో అందము లేదంటారు. కాని విచిత్రం ఏమంటే యీరకమైన గానపద్ధతియే శ్రోతలను అధికసంఖ్యలో ఆకర్షిస్తున్నది.

నామట్టుక్కు నాకు ఒక అభిప్రాయంవుంది. గానం చేసేవానికిగాని, లేక జంత్రములను వాయించే వానికిగాని ఆ విద్యలలోని సర్వమైన సొగసులు తెలిసి వుండి, అట్లా గానంచేస్తే, లేక వాయిస్తే, మంచి అందమైన సొగసులను పుట్టించవచ్చు. రసనిమ్నగలను సృష్టించవచ్చు. అప్పుడు ఆ గానము, లేక ఆ వాద్యము మంద్రస్థాయిలో వున్నదా, తారస్థాయిలో వున్నదా అన్న ప్రశ్నలేదు. ఆ ప్రశ్నవున్నా అక్కడ లేనట్టేలెక్క.

సంగీతంలో శారీరం ప్రధానమైన విషయం. కంఠం అందంగా ఉండాలి. శ్రేష్ఠమైనదై ఉండాలి. వాద్యాల విషయంలోకూడా అవి మంచి శ్రుతి కల్గినవి, శ్రేష్ఠమైనవి అయివుండాలి. సంగీతం అంతా శాస్త్రకట్టుగా ఉంటుంది. అది అందరికీ తెలియదు. అందరూ శాస్త్రంతెలిసి ఆనందించగలవాళ్ళుకాదు. అటువంటి రసికులు శాస్త్రాన్ని ఒక్కదాన్ని మెచ్చుకోలేరు. అందువల్ల సంగీతమునకు అన్నీ కుదిరిరావాలి. పరిస్థితి బాగుండాలి. స్థలం బాగుండాలి. సభ బాగుండాలి. ముఖ్యంగా రసగ్రహణశక్తిగల, సంగీతంలో సొగసులు ఆనందించగల సభాస్తారులు వుండాలి.

వినడము, ఆనందించడము — ఇందుకు సరియైన అభిరుచికూడా అవసరం. సంగీతములంటే భక్తి, శ్రద్ధ ఉండాలి. కచేరీకి పోవడము దేవాలయమునకు పోవడమువలె వుండాలి. అదే భక్తి, అదే శ్రద్ధ, అదే మౌనము—ఇక్కడకూడా ఉండాలి. కచేరీలకు వేళతప్పి రాకూడదు. సరిగ్గా సమయానికి రావాలి. వచ్చి గల్లంతు చెయ్యకూడదు. క్రమశిక్షణతోవుండాలి. పెద్దకచేరీలు జరుగుతున్నప్పుడు పాటించవలసిన మర్యాదలు కొన్ని ఉన్నాయి. వాటిని పాటించాలి. ఈ రోజులలో ఇవి బొత్తిగా కన్పించడములేదు. కచ్చేరి జరుగుతూవుంటే, అంతా బజారువతుగా వుంటుంది. పాడేవాళ్లకు, వాయించేవాళ్లకుకూడా ఇది మహా బాధగా వుంటుంది. బాధ పడుతున్నారు. తప్పడంలేదు.

ఇంకో విషయం చెప్పాలి. మనదేశంలో ఏ ఒకటీ రెండూ నగరాలలోనో తప్ప, తక్కిన ఎక్కడా సర్వపరికర సమృద్ధమైన సంగీతమందిరాలులేవు. చలువ యంత్రాలులేవు. ప్రతిధ్వని పుట్టకుండాచేసే ఏర్పాట్లులేవు.

ఇంకో విషయంచెప్పి ఆగుతాను. ఫలానా సంగీతమే రసాత్మకమైనదని, అన్నిసొగసులు అందాలు కల్గినదని చెప్పడమునకులేదు. అన్ని బాణీల సంగీతములలోను రసం, దాని గుణములు వుంటూనే వుంటాయి. పైగా ఇవి ఎక్కడినుంచో వూడిపడవు. పాడెడివాడు, జంత్రవాదనము చేసేవాడు ఈ రసాన్ని, ఆ రసము యొక్క సర్వమైన అందములను శ్రోతయైనవాని మనస్సులో పుట్టిస్తారు. వారు ఆ రసాన్ని శ్రవణముల ద్వారా క్రోలి ఆనందిస్తారు.

# మమత

శ్రీ "మురళీకృష్ణ"

"జీవిత యాత్రలో అరవై మైలురాళ్ళు దాటి యింతకాలం సుదీర్ఘ ప్రయాణం చేశాక, 'జీవితం మిగిల్చిందేమిటా?' అని గతంలోకి చూచుకొంటే మిగిలిందిది తప్ప మరేంలేదు..." అంటూ ఏడెనిమిది మడతలతో దాదాపు చాలా వరకు మాసి చిరిగి పోయే దశలో వున్న ఓ ఉత్తరాన్ని కన్పించిన ప్రతి వ్యక్తికీ చూపుతుంటాడు సీతారామయ్యా పంతులు.

సీతారామయ్యా పంతులు పురాతనమైన లంకంత యింట్లో ప్రొద్దున్నే దివారాత్రాలకు ఒకే పర్యాయం వండుకొనేవాడు. వండిన ఆ వంటని, వూళ్ళోని రామమందిరానికి తీసుక వెళ్ళి, గంటవాయించి, దేముడికి చేయిచూపించి వచ్చేవాడు. సీతారామయ్యపంతులు జీవన భృతికిగాను వూరివారు చేసిన యేర్పాటు యిది. వండుకొన్న ఆ భోజనాన్ని యిష్టమున్న నాడు తినేవాడు. లేనినాడు లేదు. పోతే, దినంలో మిగిలిన కాలమంతా క్షణక్షణమూ గతాన్ని గుర్తుచేసుకొని తాను బాధ పడడమేగాకుండా, యెదురయిన ప్రతి వ్యక్తికి తన బాధను పంచేవాడు. ఊళ్ళోవాళ్ళకి ఆయనంటే జాలి లేకపోలేదు. ఆయనపై సానుభూతి చూపకపోలేదు. కాని యెదుట పడిన ప్రతిమనిషినీ, కన్పించిన ప్రతి పర్యాయమూ నిలవేసి యింతక్రితం ఎన్నోసార్లు చెప్పిన చరిత్రనే మళ్ళీమళ్ళీ చెప్పడంతో కొన్నాళ్ళకు వినేవారికి విసుగెత్తడం సహజం. సీతారామయ్యా పంతులు ఎదుట బడితే, తమంతట తామే ప్రక్కకు తప్పుకొనేవాళ్ళు. కానీ పంతులు వాళ్ళను పిలిచి పలుకరించి, జీవితం తనకు మిగిల్చిందేమిటో వివరించడం మొదలు పెట్టేవాడు...

మనిషి కష్టాలలో వున్నప్పుడు తోటివారినుండి సానుభూతి ఆశిస్తాడు. ఆ సానుభూతి తన కష్టాల నేవిధంగానూ తప్పించకపోయినా కనీసం మనఃక్లేశాన్ని పోగొట్టి, కష్టాల నెదుర్కొనే ఆత్మస్థైర్యాన్నందిస్తుందనే భావంతో సానుభూతిని కోరుతాడు. తాను వూహించినంతగా సానుభూతి పొందనినాడు, తన కేర్పడిన కష్టాలకంటే కూడా, సానుభూతి లభించనందుకు మరింత దిగజారిపోతారు. కాని యెదుట వారినుండి ఆశించే సానుభూతికి కూడా ఓ హద్దంటూ వుందని గుర్తించని నాడు మనిషి కేమాత్రం శాంతి లభించదు.

సీతారామయ్యా పంతులును చూడగానే, యితరులు ప్రక్కకు తప్పుకోవడానికి ముఖ్యకారణం అతడు చెప్పే చరిత్ర వినలేకపోవడం కాదు—అంతా చెప్పిన తర్వాత ఎదుట వ్యక్తి నీతడు వేసే చిత్రమైన ప్రశ్న!

'సమాధానం తెలిసీ చెప్పకపోయావో, నీతల వేయిముక్కలవుతుంద'ని ప్రశ్నించే భేతాళుడి శవం లాగా, సీరియస్‌గా ఓ ప్రశ్న అడిగేవాడు——"తాను కొడుకును క్షమించాలా? అక్కర్లేదా?" అని. అవతలి మనిషి మౌనంగా వూరుకుంటే, జవాబు చెప్పేదాకా వదలి పెట్టేవాడుకాదు సీతారామయ్యా పంతులు. అతడు చెప్పిన విషయమంతా వినేసరికి, కొడుకునతడు క్షమించవలసిన అవసరంలేదనిపిస్తుంది వెంటనే. ఆమాటే అతడితో అంటే వప్పుకొనే వాడుకాదు..... "నీకు తెలియదులే బాబూ! ఎంతజేసినావాడుకన్నబిడ్డ! పెంచిన మమకారం, కడుపుతీపి—ఎలాంటి తప్పునైనా మన్నించ మంటుంది. పసివాడివి, యీ బాధ నీకర్థం

గాదురే!'' అని మరేదో గొణుక్కొంటూ వెళ్లి పోయే వాడు.

అలాకాక, ... ''మీరు మీ అబ్బాయిని క్షమించాలి పంతులుగారూ! ఎంతైనా అతడు మీ కన్న బిడ్డ. అదీగాక కాలం మారింది. దానితోబాటు మనమూ మారాలి'' అని జవాబు చెపితే, వున్నట్టుండి ఉగ్రరూపం ధరించేవాడు...''నేను వాడిని క్షమించాలా? ఎవరి కోసం సర్వాన్నీ ధారవోసి, నాబహిః ప్రాణంగా పెంచానో వాడు 'నాకు తండ్రి అక్కర్లేదు పొమ్మను కొంటే' నేను మన్నించాలా? జీవితంలో అరవై పదులుదాటి, జవసత్వాలుడిగిపోయిన యీ వయసులో వాడు నాకు కల్గించిన వ్యధ నీవు గ్రహించలేవులేబాబూ!'' అనడమే గాకుండా, ''ఈ పరిస్థితి మీకూ వస్తేగానీ, నా మనఃక్షోభ అర్థంగాదు'' అని యెదుట వ్యక్తిని నిష్ఠూరమాడేవాడు. సీతారామయ్య పంతులు కిది నిత్యకృత్యం కాబట్టి, అతడి మాటలకు ఎవరూ బాధ పడేవారు కాదు....

...ఉద్యోగరీత్యా నేను ఆ వూరికివచ్చి దాదాపు రెండు మాసాలే అయినందున సీతారామయ్య పంతులు విషయంపూర్తిగా తెలియలేదు. ఎదురయిన నన్ను రెండుమూడు సార్లు అలవాటు చొప్పున నిలవేసి, తన హృదయంలోని బాధను వెల్లడించాడు కానీ, అతడు చెప్పే ఆవేశంలో విషయమేమిటో వివరంగా బోధ పడలేదు.

నేను అద్దెకుంటున్న గదిలో చేరి కొద్దికాలమే అయినా, యింటివారితో బాగా పరిచయమైంది. ప్రతిరోజూ సాయంత్రం స్కూలునుండి రాగానే, కొంత సేపు యింటి యజమాని విశ్వనాథంగారితో కబుర్లు చెపుతూ కాలక్షేపం చేయడం అలవాటయింది. విశ్వ నాథంగారు ఆఊళ్ళోకెల్లా సంపన్న గృహస్థు. వ్యక్తి గతంగా ఉదార స్వభావుడవటం మూలాన వూరివారికి 'తలలో నాలుక' లా వుండే వారు.....

...ఓరోజు సాయంత్రం స్కూలునుండి వచ్చాక గదిలో యేంతోచలేదు. వూరిచివరి కాలువ గట్టువైపు షికారు వెడదామని బయలు దేరాను. కాని వాతావరణం అనుకూలంగా లేనట్లు కన్పించింది. వెడితే, కొంత తడవుతోపూర్తిగా తడిసి పోగలవు సుమా! అని ఉరు ముల మెరుపులతో ప్రకృతి హెచ్చరించింది. ఆకాశం దట్టంగా మేఘావృతమయింది. వెడదామా? వద్దా? అనుకొనేంతలో విశ్వనాథంగారు పలుకరించారు. అ ''వర్షం వచ్చేలాగుంది మేష్టారు! షికారెళ్లే ప్రయత్నం సాగదు. ఇలా వచ్చి కూర్చోండి! కబుర్లతో కాలక్షేపం చేద్దాం!'' అని పిలవడంతో, వెళ్లి వరండాలో కూర్చొన్నాను.

సన్నగా వాన జల్లు ప్రారంభమయింది...

గ్రామపంచాయితీఎలక్షన్ల మొదలు—ఇంతో పాకిస్తాన్ యుద్ధంవరకూ ఏవేవో విషయాలు దొర్లాయి. మాటల మధ్యలో ఏదో ఒక అంశంపై సంభాషణ సాగిపోతోంది. ఇంతలో, రోడ్లో ఎవరితోనో గట్టిగా మాట్లాడుతున్న సీతారామయ్య పంతులు కంఠం విన్పించడంతో యిద్దరం రోడ్డువైపు చూచాము. డాక్టరు కోసం వర్షంలో హడావుడిగా పరుగెత్తుక వెళ్లే ఓవ్యక్తిని చేయిపట్టుకొని ఆపి, వుత్తరం చూపి, యేదో అడుగుతున్నాడు పంతులు....

సీతారామయ్య పంతులు గత చరిత్ర యేమిటో తెలుసు కోవాలన్న కుతూహలంతో, విశ్వనాథంగారిని చెప్పమని అడిగాను. పంతులుపై సానుభూతితో గాఢంగా నిటూర్చి, చెప్ప నారంభించారు విశ్వనాథం గారు........

''సీతారామయ్య పంతులు శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన వ్యక్తి. మరీగొప్పగా లేకపోయినా, ఏదో కొంత ఆస్తీ, పాస్తీ కలిగినవారికి లేకలేక పుట్టిన ఒక్కడే కొడుకు. నిప్పును కడిగి శుభ్రంచేసేంతటి ఆచార వ్యవహారాలు, నిత్యాగ్ని హోత్రాలు, వేళ తప్పని జపతపాలు—వీటిమధ్యపుట్టి పెరిగిన సీతారామయ్య పంతులులో చిన్నతనం నుండీ సనాతన ధర్మాలూ, నిష్ఠలూనియమాలూ జీర్ణించుకో పోయాయి. తల్లిదండ్రులు కుదిర్చిన సంబం

ధానికి మారుమాటాడకుండా, తలవంచడంతో ఓ శుభ ముహూర్తాన 'జానికమ్మ' అతడి జీవితాన్ని పంచుకొనింది. ఆవిడ పేరుకు తగినట్లుగానే అతిఓర్పు, వినయవిధేయతలు అన్నింటినీ మించి పూర్వాచార గౌరవం కలిగి వుండడంతో సీతారామయ్యను సంపూర్తిగా తృప్తిపరచగలిగింది. భార్యను ప్రాణప్రదంగా ప్రేమించి, అపురూపంగా చూచుకొనే వాడు సీతారామయ్యా పంతులు.

చిలుకాగోరింకల్లాంటి కొడుకునూ కోడలునూ పెళ్లయిన మరుసంవత్సరంలోనే జన్మించిన వారి వంశోద్ధారకుడి ముద్దుముచ్చట్లనూ చూడనోచని సీతారామయ్యా తల్లిదండ్రులు అతి స్వల్పకాల వ్యవధిలోనే ఒకరి తర్వాత ఒకరు కాలంచేశారు. అప్పట్లో జానికమ్మ ఓదార్పే లేకపోతే, సీతారామయ్యా పంతులు తిరిగి మామూలు మనిషి కాలేడేమో? అనేంతగా బాధపడ్డాడు.

రెండేళ్లు గడిచాయి. కాలగమనం వలన, చాలా వరకు కుదుటబడి కాలం వెళ్లదీసేంతలో విధి మరోసారి సీతారామయ్యా పంతులును చూచి వెక్కిరించింది. గర్భందాల్చిన జానికమ్మ, ప్రసవ సమయంలో నానా యాతన పడి, ఓ సూర్యాస్తమయం వేళ తనను నమ్ముకొన్న వారిని విడిచి, శాశ్వతంగా అస్తమించింది. ప్రాణప్రదంగా చూచుకొనే భర్తను, క్షణం విడిచి వుండలేని బిడ్డ రామమూర్తిని వదలి, జానికమ్మ కన్నుమూయడంతో సీతారామయ్యాపంతులు చాలా క్రుంగిపోయాడు. భార్య స్మృతి చిహ్నంగా మిగిలిన పసిబిడ్డను తల్లీ తండ్రి అయి కొన్నాళ్లు పెంచాడు. కాని యింట్లో 'స్త్రీ' అవసరం తప్పనిసరయే సరికి పునర్వివాహం చేసుకోవలసి వచ్చింది. కేవలం పరిస్థితుల ఒత్తిడి చేత, అవసరం చేత పెండ్లి చేసుకొనడం వలన ద్వితీయ కళత్రాన్ని సరిగా ఆదరించలేకపోయాడు పంతులు. పైపెచ్చు గతించిన జానికమ్మనే పదేపదే తలచి బాధపడడం, సవతి తల్లి యెలా పెంచుతుందోనన్న అనుమానంతో పసివాడైన రామ్మూర్తి పెంపకంలో ప్రతిదీ స్వయంగా కల్పించుకోవడం వీటితో సీతారామయ్యా పంతులుకూ రెండవ భార్యకూ అభిప్రాయభేదాలేర్పడ్డాయి. దానికి తోడు ఆవిడకు భర్త అనుసరించే మూఢసనాతనాచారాలూ, నిష్ఠలూ నియమాలూ సరిపడేవికావు. వారిద్దరి మధ్య ఏర్పడిన పొరపొచ్చాలు రానురానూ 'చిలికి చిలికి గాలివాన అయినట్లుగా' రోజురోజుకు పెరిగాయి. తత్ఫలితంగా యిద్దరికీ సఖ్యత చెడి, అన్యోన్యత లేకుండా పోయింది. అలా కొంతకాలం గడిచింది. ఇతరులు వేలెత్తి చూపలేని కుటుంబ ప్రతిష్ఠకూ, అగ్నిహోత్రం లాంటి వాడని పేరొందిన సీతారామయ్యా పంతులుకూ తీరని కళంకం తెచ్చే సాహసం చేసి, యెదురింట మేడ మీదున్న యువకుడితో ఓ అర్ధరాత్రి వేళ లేచిపోయింది ఆవిడ.

భార్య మరణంతోనే క్రుంగిపోయిన సీతారామయ్యా పంతులు యీ అవమానంతో జీవచ్ఛవంలా అయ్యాడు. వీధిలో నలుగురి ముందూ నడవడానికి జంకి, యింట్లో నుండి కాలు బయటమోపకుండా గడిపాడు కొంతకాలం. అప్పట్లో అతడికి నిజంగా మతి చలించిందో లేక అతడి ప్రవర్తన లోకుల కావిధంగా అనిపించిందోకాని, 'సీతారామయ్యాకు మతి చెడింద'న్నారు...........

చెప్పడం ఆపారు విశ్వనాథంగారు. లంక పొగాకు చుట్టల కట్టలో నుండి ఒకటి తీసి, వెలిగించారు.

ఇంత క్రితం సన్నగా ఆరంభమయిన వానజల్లు పెద్దదయింది. కుండలతో క్రుమ్మరించినట్లు ధారాపాతంగా కురవ సాగింది వర్షం.....గంట ఏడున్నరయింది. రోడ్డు వంక చూచి, 'ఇకయీపూట హోటలు కెళ్లి భోంచేసే ప్రాప్తి లేదేమో?' ననుకొనేంతలో, విశ్వనాథంగారు నా వూహను పసికట్టారు. "ఈ వర్షంలో హోటలు కేం వెడతారు మేష్టారూ? ఇక్కడే భోజనం చేయండి!" అని నా జవాబు కెదురు చూడకనే, "అమ్మాయ్! శారదా!" అని కేక వేశారు. మరు కొద్ది క్షణాలలో లోనుండి గాజుల గలగల; ఆ వెనువెంట గోడపై మనిషి కదిలే నీడ; తలుపు

నానుకొని కన్పించే ఆకుపచ్చని చీరచెరగు—శారద రాకను సూచించాయి.

"ఈ పూట మన భానుమూర్తి మేష్టారు యిక్కడే భోంచేస్తారని మీ అమ్మతో చెప్పమ్మా!" అని, సగంలో ఆపిన సీతారామయ్య పంతులు చరిత్ర మళ్లీ కొనసాగించారు నావైపు తిరిగి.

"........అలాంటి పరిస్థితిలో ఓదార్చేందుకు బదులు సీతారామయ్య పంతులుపై కోర్టులో వ్యాజ్యం వేశాడు జానికమ్మ సోదరుడు. సీతారామయ్యపంతులు పునర్వివాహం చేసుకొన్నందు వలన ఆస్తి మరో విధంగా ఖర్చు చేసేయగలడనీ, అంతేగాక మతిభ్రమించినట్లున్న ఆ స్థితిలో దుర్వ్యయం చేసేయగలడనీ—అందుచేత తన చెల్లెలుకు పుట్టిన బిడ్డ కన్యాయం జరుగగలదు కాబట్టి బిడ్డతో సహా ఆస్తిని తన కప్పగించవలసినదని అతడి వాదం. ఆస్తిపాస్తులు రాబట్టుకొనేందుకు మామూలుగా లోకంలో బంధువులనే వారెలా చేస్తారో, అతడూ అలా చేశాడు.

అప్పటికే తల మునకలుగా క్రుంగిపోయిన సీతారామయ్యపంతులు దీంతో రెచ్చిపోయాడు. ఎలాగైనా తన బిడ్డను వారికి చెందకుండా సంరక్షించుకోవాలని తాపత్రయపడ్డాడు. ఇరువురి మధ్యా పంతాలు,పట్టుదలలూ పెరిగాయి. కేసు చిన్నకోర్టుల నుండి పెద్దకోర్టుల కెగ్రబాకింది. ఆర్థికంగా యిబ్బందులు పడటం చేత కోర్టు ఖర్చులకుగాను ఆస్తిలో ఒకటొకటే అమ్మవలసి వచ్చింది. రెండేళ్లు సాగిన ఆకేసు చివరకు త్రోసి వేయబడింది. సీతారామయ్యపంతులు తన బిడ్డను తానే వుంచుకోగలిగాడు కానీ, వుంటున్న యిల్లు తప్ప మిగిలిన ఆస్తి హారతి కర్పూరంలా హరించుకుపోయింది.

'పువ్వులమ్మిన చోట కట్టెలమ్మలేక' ఐదేళ్ల బిడ్డను తీసుకొని యెక్కడో దూరదేశంవెళ్లిపోయాడు. ఎలా బ్రతికాడో ఏమో, ఎవరికీ తెలియదు. సుమారు సంవత్సరం క్రితం మళ్లీ యీ వూరికి తిరిగి వచ్చాడు. దాదాపు రెండు దశాబ్దాలు ఆలనా పాలనా లేకపోవడంతో పురాతనమైన యిల్లు చాలాభాగం శిథిలమయినది. వచ్చిన నాటినుండీ గతాన్ని యిదమిద్ధమని ఎవరితోనూ విపులంగా చెప్పలేదు. కాని ప్రతివారితోనూ, "కొడుకే జీవిత సర్వస్వమనుకొని పెంచితే, అతడు దగా చేశాడ"ని మాత్రం చెపుతూ, ఓ వుత్తరం చూపి యేదో ప్రశ్నిస్తూంటాడు....

దానా—దీనా తెలియ వచ్చిందేమిటంటే, ఏ కొడుకు కోసమైతే, గుండెలవిసిపోయే బాధలలో కూడా కోర్టుల చుట్టూ తిరిగి అనేక కష్టనష్టాల కోర్చి, ఆస్తి సర్వమూ అర్పించి, యెక్కడో దేశంకాని దేశంలో వలసపోయి పెంచి పెద్ద చేశాడో ఆ సుపుత్రుడు తండ్రిని కాదనుకొనే స్థితికి వచ్చాడు. కుల మతాలు, సనాతనధర్మాలు అక్షరాలా పాటించే సీతారామయ్యపంతులు అభిమతానికి విరుద్ధంగా—రామమూర్తి తాను ప్రేమించిన క్రిస్టియన్ అమ్మాయిని రిజిష్టరు మ్యారేజ్ చేసుకొంటానని పంతంపట్టాడు. సీతారామయ్యపంతులు పెంచిన మమకారంతో అనునయంగా నచ్చజెప్పాడు. తండ్రిగా శాసించాడు. కాని ఆయన మాట చెల్లలేదు. తండ్రి కావాలో, ఆవిడతో పెండ్లి కావాలో కోరుకోమని బెదిరించాడు చివరి అస్త్రంగా. అతడు రెండవదాన్నే కోరుకోవడంతో యిద్దరిమధ్యా మాటామాటా పెరిగి, స్వగ్రామానికి తిరిగి వచ్చేశాడు సీతారామయ్యపంతులు.

'తాను ఎలాంటి పరిస్థితులలోనయినా, ప్రేమించిన యువతినే పెండ్లాడ దల్చుకొన్నాననీ, తన అభిప్రాయానికి తండ్రి సమ్మతించనట్లయితే—ఆ తండ్రికీ కొడుకూ, కొడుకు కా తండ్రి లేనట్లేననీ,ఇకమీదట తమ మధ్య తండ్రీకొడుకులుగా ఎలాంటి సంబంధ బాంధవ్యాలు లేవనీ' వ్రాతపూర్వకంగా రామమూర్తి వ్రాసిన వుత్తరమే సీతారామయ్యపంతులు నలుగురికీ చూపెట్టి, జీవితం తననెలా దగా చేసిందో వివరిస్తూ వుంటాడు........."

సీతారామయ్య పంతులు చరిత్ర అంతా వినేసరికి కళ్లు చెమ్మగిల్లాయి నాకు. అత డంటున్నట్టు జీవితం అతడిని దగా చేసిన మాట వాస్తవమే ననిపించింది.

సగంలో ఆరిపోయిన చుట్టను మళ్ళీ వెలిగించే ప్రయత్నం చేశారు విశ్వనాధంగారు.......

వర్షం ఏమాత్రం తగ్గలేదు. పెద్ద పెద్ద జల్లులతో నిలుపు లేకుండా కురుస్తోంది...ఎక్కడో దూరంలో ఓ పిడుగు పడ్డ శబ్దం విన్పించింది.....

''అసలు కాలం ముదిరి, వెర్రితలలు వేస్తోంది మేష్టారూ! లేకపోతే, శుద్ధమైన బ్రాహ్మణవంశంలో పుట్టిన రామమూర్తి, కష్టనష్టాల కోర్చి పెద్దజేసిన తండ్రిని కాదనుకొని, కిరస్తానీ అమ్మాయిని రిజిష్టర్ పెండ్లి చేసుకొంటాడా చెప్పండి? మనుష్యుల బుద్ధులు, ఆలోచనలు మారి, కాలం మారేకొద్దీ ఋతుక్రమం కూడా మారిపోతోందేమోనన్న సందేహం కలుగుతోంది. కాకుంటే, వర్షం ఏమాత్రం కురిసే అవకాశం లేని యీ కార్తెలో యిలా అకాలంగా కుంభవృష్టి ఏమిటి మేష్టారూ?'' అన్నారు విశ్వనాధంగారు.

''కాలం మారుతోన్న మాట నిజమేనండి! కాని కాలం మారవలసిన అవసరం కూడా వుంది. మనిషి నాగరికంగా రోజురోజుకూ ముందుకు వెడుతూ, మరింత సుఖంగా వుండడానికి తాను మారి, కాలాన్ని మార్చుతున్నాడు. కాని యిది ఒక్కసారిగా జరిగే పని కాదు. క్రమబద్ధంగా జరగాలి. అయితే యీలోగా యెక్కడో ఒకరూ, యిద్దరూ ఒక్కసారిగా మార్పు తేవాలని ప్రయత్నిస్తే అది దుఃఖదాయకంగానే అవు తోంది. ఎందుకంటే యిది సంధియుగం కాబట్టి...'' అన్నాను నాకు తోచిన విధంగా.

''ఏమిటో మేష్టారూ! మీ యువకతరం అభి ప్రాయాలకూ, మా పూర్వతరం వారి అభిప్రాయాలకూ సామ్యం కుదరదులెండి!'' అన్న విశ్వనాధంగారి మాటలతో మా సంభాషణ ఆగిపోయింది, లోనుండి పిలుపు రావటం మూలాన.

''లేవండి మేష్టారవు! భోంచేదాం!'' అంటూ యింట్లోకి నడిచారు విశ్వనాధంగారు. మౌనంగా అనుసరించాను.

.......భోజనం చేస్తున్నంత సేపుకానీ, ఆతర్వాత గదిలో వచ్చి పడుకొన్న మీదటకానీ, నా ధ్యాస సీతా రామయ్యపంతులు జీవితం పైననే నిమగ్నమయింది. ఆయనపై జాలితోబాటు, ఏదో ఆత్మీయతలాంటి భావం నెలకొనింది నాలో..........

ఆ తర్వాత మళ్ళీ రెండు మూడుసార్లు పంతులు కన్పించినపుడు, అలవాటు ప్రకారం ప్రశ్నించి జవాబు చెప్పమన్నపుడు మౌనం వహించడం తప్ప మరేం చెప్ప లేకపోయాను. ఏవిధంగా జవాబు చెప్పినా, పండి రాలి పోయేందుకు సిద్ధంగా వున్న ఆ వృద్ధ బ్రాహ్మణుడి మనః క్షోభకు ఉపశమనం కలిగించలేనేమోనని!

* * *

అనుక్షణం వేగంగా పరిభ్రమించే కాలచక్రం ఎన్నో మార్పులు తెస్తూ, మరో రెండు వలయాలను పూర్తి చేసింది.

విశ్వనాధంగారి కుటుంబంతో నా పరిచయం అభివృద్ధి అయి, నేను వారింటి అల్లుడు కావడం, 'శారద' నా జీవితంలో ధర్మపత్ని కావడం, మేమిద్దరం క్రొత్త కాపురం పెట్టడం కాలం తెచ్చిన మార్పుల్లో ఒకటి.............

....ఓరోజు వుదయం స్కూలుకు వెడుతుండగా, బజారు వీధి మలుపులో జనం గుమిగూడి వుండటం కన్పించింది. మానవ సహజమైన ఉత్కంఠ నాకాళ్లను అప్రయత్నంగానే అటువైపు నడిపించింది. ముందున్న జనాన్ని తొలగద్రోసుకొని, అక్కడి దృశ్యం చూసేసరికి గుండె ఝల్లుమంది. రోడ్డు మధ్యగా ఆగిన ఓ కారు, కారు ముందు చక్రాల వద్ద నెత్తురు మడుగులో పడివున్న సీతారామయ్యగారి దేహం!.....'దూరం నుండీ హారన్ మ్రోగిస్తున్నా విన్పించుకొనక, హడావుడిగా పరుగెత్తుతూ రోడ్డుదాటే ప్రయత్నం చేశాడనీ, ఎంత ప్రయత్నించినా తప్పించే వీలులేక పోవడంతో సీతా రామయ్యపంతులు కారుక్రింద పడ్డాడనీ' అక్కడ మూగిన జనం మాటల వలన తెలిసింది. సీతారామయ్యను గురించి యేదేదో చెపుతూ, వీలయినంత సాను

భూతి చూపుతూ నింపుతున్నారు జనసమూహం. చెమ్మగిల్లిన కండ్లను తుడుచుకొని, సీతారామయ్య పంతులు శవాన్ని సమీపించాను. సగం నలిగిపోయిన చేతి వ్రేళ్లలో నుండి యేదో కాగితం గాలికి రెపరెప లాడుతూ కన్పించింది. అతడు రోజూ నలుగురికీ చూపెట్టే పాతవుత్తరంలా కన్పించకపోవడంతో, ఏమిటోనని, ఆత్రంగా తీసి చూచాను. ఆ క్షణంలో మెదడులో ఎన్నో ఆలోచనలు. 'బహుశా వుత్తరం వ్రాసి, ప్రయత్నపూర్వకంగానే జీవితం అంతం చేసుకొన్నాడేమో' నని కూడా అనుమానం రాకపోలేదు.

కాని, అది సీతారామయ్యపంతులు తన కొడుకు రామమూర్తికి వ్రాసిన వుత్తరం. ఆశ్చర్యపోయి, పైన తారీఖు చూశాను. ఆరోజే వ్రాసిన వుత్తరం. అడ్రసు వుందేమోనని గబగబా యిటూ అటూ తిప్పి చూశాను. ఉహూ! లాభం లేకపోయింది. ఉత్తరం తీరికగా మళ్లీ చదువుకోవచ్చునని, మడిచి జేబులో పడేసుకొన్నాను.

ఇంతలో విశ్వనాధంగారు, గ్రామ పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు, పోలీసు సబ్‌ఇనస్పెక్టర్ యింకా మరికొందరు పెద్దలు చేరారు. విచారణలూ, సాక్ష్యాలూ వగైరా తతంగం పూర్తి అయాక, శవదహనాని కేర్పాట్లు చేయబడ్డాయి. రామమూర్తి అడ్రసు ఎవరికైనా తెలుసేమోనని విచారించబడింది కాని ప్రయోజనం లేకపోయింది.

ఎలాగో ఆ సాయంత్రానికి, పదిమందీ చేరి సీతారామయ్య పంతులు దేహాన్ని పిడికెడు బూడిద చేశాము. కానీ, అందరి స్మృతిపథాల్లోనూ, అతడెప్పటికీ మెదులుతూంటాడేమో ననిపించింది. ఎవరో దగ్గర బంధువును పోగొట్టుకొన్నంత విచారం, అనుభూతి కలిగింది నాకు.

'ఉత్తరం పూర్తి చేసి, పోస్టాఫీసుకు వెళ్లి అక్కడే అడ్రసు వ్రాసి పోస్టు చేద్దామని త్వరత్వరగా వెడుతున్నాడేమో పాపం! హఠాత్తుగా కారు రావడం, కంగారుతో యిటూ అటూ పరుగెట్టి, చివరకు లోకంతో ఋణం తీర్చుకొని వెళ్లిపోవడం జరిగింది.' విచారణ సమయంలో అవసరమైనప్పుడు, ఆ వుత్తరాన్ని చూపి, మళ్లీ నావద్దనే వుంచుకొన్నాను, తీరికగా చూద్దామని.

.....రాత్రి గదికి చేరుకున్న తర్వాత, ఆ వుత్తరం తీసి చదివాను.......

"చిరంజీవి రామ్మూర్తికి మీ నాన్న సీతారామయ్య ఆశీర్వాదములు..

నీవు తండ్రి అక్కర్లేదనుకొన్నా, నిన్ను కని పెంచిన యీ ముసలి తండ్రి నిన్ను వదులుకోలేక పోతున్నాడు బాబూ! ఇన్నాళ్లూ మానసిక క్షోభతో గడిపాను కానీ, చివరకు ఓడిపోయాను.

తరతరాల నుండీ వస్తున్న సాంప్రదాయాన్నీ, కుటుంబ గౌరవాన్నీ కాదని కులాంతర వివాహం చేసుకొన్నావన్న కోపం సర్వాన్ని పోగొట్టుకొని, నువ్వే జీవిత మనుకొని పెంచిన తండ్రిని కాదనుకొన్నావన్న బాధ, పట్టుదలలూ, పంతాలూ—వీటన్నింటిని కడుపు తీపి, తల్లిలేని నిన్ను స్వయంగా పెంచిన మమకారం, ముఖ్యంగా తండ్రికి బిడ్డపై గల మమత—జయించాయి.

కాలం మారింది. ఆ సత్యాన్ని గ్రహించక మూర్ఖంగా ప్రవర్తించడం అవివేకం. లోకం కోసం కాకపోయినా, కన్నబిడ్డ తృప్తికోసం, సుఖం కోసం నేనూ మారాను బాబూ!

నిన్ను క్షమించగలిగాను. నీ కోసం అనుక్షణం తపించిపోయే యీ వృద్ధుడి చెంతకు రెక్కలు కట్టుకొని పరుగెత్తుకు వస్తావు కదూ!

—సీతారామయ్యపంతులు."

ఉత్తరం చదవడం పూర్తి చేయగానే, వేడి కన్నీటిబొట్టు జారిపడింది. పాపం ఎంత ఆసక్తితో,

ఆశతో యీ వుత్తరం వ్రాసి కొడుకు కోసం యెదురు చూశాడో? బ్రతికుండగా చూడడానికి నోచుకోనక పోయినా, మరణానంతరం కర్మకాండ జరిపేందుకైనా కొడుకు వచ్చే అవకాశం లేకపోయింది. ఉత్తరంలో అడ్రస్సైనా వ్రాశాడు కాదు.........

సీతారామయ్యపంతులు బ్రతికుండగా, అతడు నలుగురితో చెప్తున్నట్టు జీవితం అతడిని దగా చేసిన మాట నిజమే. జీవితమే కాక, విధి కూడా అతడిని దగా చేసిందేమో?' ననిపించింది నాకు.

ఆ తర్వాత [illegible] సీతారామయ్యపంతులు స్మృతిపథంలో మెదిలినప్పుడల్లా ఆత్మీయుడిని పోగొట్టు కొన్న బాధ కలుగుతూ వుండేది నాలో......

......ఆ నాటి నుండీ యిప్పటివరకూ నా కొక అనుమానం వేస్తూనే వుంది.....

'మతి చలించినట్లున్న ఆ పరిస్థితిలో సీతా రామయ్యపంతులు ఆత్మతృప్తికోసం అలాంటి వుత్తరం వ్రాసి, చదువుకొని తృప్తి చెందాడా? లేక తనను కాదనుకొన్న కొడుకును మమతానుబంధం చేత నిజంగానే క్షమించగలిగాడా?.....'



# సమగ్ర ఆంధ్ర సాహిత్యం

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

"స్వాబుల యుగం" అనే పేరితో వెలువడిన శ్రీ ఆరుద్ర గారి "సమగ్ర—ఆంధ్ర సాహిత్యం" ఎనిమిదవ సంపుటంలో ఉన్న కవుల వివరాలు :

(1) తెనాలి రామకృష్ణుడు (2) శంకరకవి (3) వెలగపూడి వెంగన్న (4) పెనుమత్స కవులు. అంగద బసవయ్య (5) వాసిరాజు రామయ్య (6) చందలూరి చిక్కయ్య (7) కానుకొలను అన్నమరాజు (8) బైజరాజు వెంకటనాథుడు (9) మొల్ల (10) అయ్యలరాజు రామభద్రుడు (11) తెనాలి కవులు బంధువులు (12) అద్దంకి గంగాధరుడు (13) పొన్నికంటి తెలగన్న (14) చదలువాడ మల్లన (15) సారంగు తమ్మయ్య (16) కందకూరి రుద్రకవి (17) పింగళి సూరన (18) రామరాజభూషణుడు (19) మరింగంటి సింగరాచార్యులు (20) ముగ్గురు లాక్షణికులు (21) పన్నెండుమంది వేదాంతులు.

ఈ గ్రంథ రచన ఒక నిర్దిష్ట ప్రణాళికతో ప్రారంభము కాలేదని—యుగ విభజన కూడా సక్రమంగా, సాహిత్య పరిణామ దృష్ట్యా లేకపోవడంవల్ల అస్తవ్యస్తమైనదని డిసెంబరు భారతిలో నిరూపించాను. ఆ సమీక్షలోనే వీనిలో విడిచి పెట్టిన కవులనుగూర్చి తెలిపాను. ఈ ఎనిమిదవ సంపుటంలో ముందు సంపుటంలో ఉన్న 'ఇతర కవులు' అనే ప్రత్యేక భాగం లేకుండా, కవుల పేళ్ల శీర్షికలక్రిందే—ముగ్గురు, ఎనమండుగురు, పన్నెండుగురు కవులను చేర్చారు. దీనివల్ల విడిచి పెట్టిన కవుల సంఖ్య యింకా హెచ్చుయిందేకాని, తగ్గలేదు. ఆ యా యుగాల్లో కవుల సంఖ్య కవుల కాలాన్ని అనుసరించి ఉంటుందన్న సంగతి మనము ఈ సందర్భంలో మఱువరాదు.

గ్రంథకర్తలు—ప్రబంధ రత్నావళి ఆధారంగా చేసుకొని, యీ సంపుటాల్లో కవులను చేర్చారు. ఆ ప్రబంధ రత్నావళినుండే వారు విడిచి పెట్టిన కవులను గూర్చి మొదట ప్రస్తావిస్తాను.

### నాగులపాటి శేషనారాధ్యుడు

#### శ్రీ పర్వత పురాణము

తెలుగులో తిరుపతి వెంకటేశ్వర వాఙ్మయంవలె, శ్రీశైల మల్లికార్జున వాఙ్మయం కూడా విపులంగా ఉన్నా, వానిని గూర్చి పర్యాప్తమైన పరిశీలన జరుగలేదు.[1] శ్రీశైల ప్రశంస నన్నయ నన్నిచోడ కవులలో ఉన్నా, ఆక్షేత్రానికి సంబంధించిన మొదటి గ్రంథం పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర. అందలి పర్వతప్రకరణమే శ్రీశైలక్షేత్రం మాహాత్మ్యం. దాని ననుసరించినదే—శేషనారాధ్యుని శ్రీపర్వత పురాణం. దీనికి శ్రీశైలఖండమని నామాంతర మున్నది.

ఇది ఆఱాశ్వాసముల పద్యకావ్యం—ప్రబంధ రత్నావళి (135 వ పుట) లో శేషనాథుడు—పర్వత పురాణమున— అనే శీర్షికక్రింద యీ క్రింది పద్యముదాహరింపబడియున్నది.

ఉ. "తత్తరపాటుతో నిరులు తద్దయుమాన్పఁగఁజాలుకన్నును
వ్రేత్తునవేలుమూకలకువిందులు వెల్వెడు కన్నుదమ్మి యఁన్
మొత్త మెలర్ప లచ్చికిని ముదు గఁబట్టిన ముద్దుపట్టి మే
నెత్తిఁలంజూచు కన్నుగల యిట్టిది వేలుపు గొల్తు నిచ్చటన్."

ఈ పద్యమే—శేషనాథుని పర్వత పురాణావతారికలో నున్నది.

పర్వతపురాణంలో శ్రీశైల స్థల సన్నివేశాల మాహాత్మ్యమేకాక, నామోత్పత్తికి సంబంధించిన కథలున్నవి. వానిలో ముఖ్యమైనవి:

#### పర్వతనామోత్పత్తి

పూర్వం పర్వతుడనే మునీశ్వరుడు చాలాకాలం శివుని గూర్చి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై, వరం కోరుకో మన్నాడు. పర్వతుడు తనకు ప్రత్యేకంగా ఏమీ అక్కరలేదని—తన శరీరమంతా శివుడు కావాలని కోరాడు. ఈశ్వరుడు సరే నన్నాడు. పర్వతుడు తపస్సుచేసిన స్థలం శ్రీశైలం కాబట్టి ఆ స్థలానికి శ్రీ పర్వతమని[2] పేరు వచ్చింది. భక్తితత్పరతచేత పర్వతుడు, పార్వతి కన్న గొప్పవాడని—శేషనాథు డిట్లు చమత్కరించాడు.

---

1. శ్రీశైల దేవస్థానంవారుకూడా అపూర్వమూ, చిరస్మరణీయమూ అయిన శ్రీశైలమల్లికార్జున వాఙ్మయాన్ని గూర్చి యింతవఱకు ఏవిధమైన చర్య తీసుకొన్నట్లు కానరాదు. ఆ వాఙ్మయం వెలుగులోనికి వస్తే, ఆంధ్ర దేశ మత, చారిత్రక, సాహిత్య, సాంస్కృతికవిషయాలనుగూర్చిన విశేషాలెన్నో బయలు పడుతవి.

2. ప్రాచీన బౌద్ధ వాఙ్మయంలోను, శాసనాలలోను, శ్రీపర్వత మన్న పేరే ప్రచురంగా కనబడుతుంది.

"తత్పరత్వంబు సంధిల్లఁ దపముచేసి
శంభు దేహంబు శాంభవి సగమె పడసె
పర్వతుండనుమౌని తపంబుచేసి
దర్పకారాతి దేహమంతయును బడసె"

పార్వతి, ఎంత కఠినమైన తపోనియతితో ఉన్నా, శివుని అర్ధ దేహము మాత్రమే పడయ గల్గింది. పర్వతుడు తపస్సుచేత శివుని దేహాన్ని సంపూర్ణంగా పొందాడు.

## మల్లికార్జున నామోత్పత్తి

చంద్రవంశంలో పుట్టిన చంద్రగుప్తుడనే రాజునకు చంద్రవతి అనే చక్కని కూతురుండేది. ఆమె చిన్నప్పటి నుండి శివభక్తి పరురాలు. ప్రాయంతో భక్తి ముదిరింది. యౌవనవతి అయింది. ఆమె లోకోత్తర సౌందర్యాన్ని చూచి తండ్రి ఆమెను మోహించాడు. చంద్రవతి, తన తండ్రిని తన యందు మరులుకొల్పిన మన్మథుని జయించడానికి నిశ్చయించింది.

శ్రీపర్వత క్షేత్రంలో శివుని సేవిస్తూ, ప్రతిదినము ఆతనిని మల్లికా పుష్పములచేత పూజించేది. పూజతో పాటామె భువనమోహనకరమైన సంగీతంతో శివునిగూర్చి గానంచేసేది. నాట్యం చేసేది. ఆమె ఆట పాటలకు ముగ్ధుడై ముగ్ధేందు శేఖరుడైన శివుడు ప్రత్యక్షమైనాడు. ఇష్టమేదైనాసరే యిస్తా నన్నాడు. ఆమె, ప్రతిదినము శివుని కర్పించే మల్లికా కుసుమాలు, ఎల్లప్పుడు ఆతని శిరస్సునందుండేటట్లు వరం కోరింది. శివుడు మల్లికేశ్వరుడైనాడు. మల్లిక అర్జున కాంతితో ఉండడముచేత, అతనికి మల్లికార్జునుడనే పేరు వచ్చింది.[3]

శేషనాథు డీ పురాణాన్ని ప్రౌఢమైన ప్రబంధ శైలిలో సంతరించాడు. అతని పాండిత్య విశేషాలను గూర్చి యిట్లు చెప్పుకొన్నాడు.

మ. ప్రణుత శ్రీగిరినాథ లబ్ధకవితా ప్రజ్ఞా కళాభిజ్ఞుడన్—
గణభుగ్గ్రంథమత ప్రయోగ విలుఠత్ గాఢార్థసంవేత్తఁ ద
త్ఫణిభాష్యాయతఫక్కికాద్యుపద ప్రౌఢి ప్రమాఢౌకిత
ప్రణి పత్యస్ఫుటశబ్ద శాస్త్రనివహ ప్రామాణ్యపారీణుఁడన్.

ఈతడు అష్టభాషా విశారదుడని ఆశ్వాసాంత గద్యవల్ల తెలుస్తున్నది.

ఇది శ్రీ మల్లికార్జున కృపాలబ్ధ మేదురాష్ట భాషా విశిష్ట శివయోగివర్య శేషనారాధ్య ప్రణీతంబైన శ్రీ పర్వత పురాణమునందాద్యంతంబు షష్ఠాశ్వాసము.

తెలుగు సంస్కృత భాషా విశిష తలను గూర్చి శేషనాథుడెంత మనోహరముగా దెల్పినాడో చూడండి.

"జనని సమస్త భాషలకు సంస్కృత భాష ధరాతలంబునన్
ఘన లలితార్థ గౌరవ వికాసి తెలుం గభిరమ్య మంతకున్
గనుఁగొనఁ జాతబీజమున కంటెను కోమల పత్ర పుష్ప శో
భన మృదు పల్లవాభినవరమ్య రసాలవ౦ సొంపు నింపదే—"

ఈనాటివారు "జనని సమస్త భాషలకు సంస్కృత భాష ధరాతలంబునన్" అన్న మొదటి పాదము మాత్రమే ఉదాహరిస్తూ, దానిపైని భాషా శాస్త్ర విషయిక చర్చలు సాగిస్తున్నారు—కాని పద్య మింతవఱకూ ఎవ్వరూ పూర్తిగా తెలుపలేదు. అర్థ గ్రహణానికి అనుకూలింపగలదని పద్యమంతా యిక్కడ ఉదాహరించాను.

ఈ క్రింది పద్యం మురారి యనర్ఘ రాఘవ నాటక శ్లోకాని కాంధ్రీకరణం.

శా. చేతశ్శుక్తిక యందునిల్పి కళలంజేకూరి శాస్త్రోదక
ప్రాతం బక్షరమూర్తిమౌక్తికములై వర్ధిల్లుడున్ సత్ప్రభు
ఖ్యాతోపేత గుణ ప్రయుక్త సదలంకారాంగహారాళిగా
రీతిన్ సత్కవి కూర్ప నేర్చును బుధశ్రేణీ గళాగ్రంబునన్.

శేషనాథుడు, శివజన్ముడు, శివగోత్రుడు, శివయోగ సుధానుభవుడూ నైన శివభక్తుడు. శివ సేవా మాహాత్మ్యన్ని గూర్చి యిట్లు చెప్పాడు—

క. "మలహరుగుడి గోమయమున
నలికిన మర్త్యుండు నలుకునట కస్తూరీ
మలయజపంకము దివిష
జ్జలజాయతలోచనా కుచద్వయ వీథిన్"
4 ఆశ్వాసం.

శేషనాథుడు—"నూటయేబది సంవత్సరముల క్రిందట నుండి యుండవచ్చును" అని వీరేశలింగముగారు తమ కవుల చరిత్ర 3 వ భాగము 240 పుటలో వ్రాశారు. ప్రబంధ రత్నావళిలో నుదాహరింపబడిన పై పద్యాన్నిబట్టి, ఆతడు క్రీ. శ. 1550 కి ముందువాడని—నేను చాలా కాలం క్రిందట నిర్ణయించాను.[4] అయితే ఈ తరువాత 1530 లో నున్న భద్రకవి లింగకవి కవిస్తుతిలో శేషనాథుని స్తుతి యుండుటచేత ఆతడు క్రీ. శ. 1500 ప్రాంతమువాడని నిశ్చయించాను.

శ్రీపర్వతపురాణం ముద్రితమైనా[5] ఇప్పు డలభ్యం. దానికి సుసంస్కృతముద్రణం అత్యంతావశక్యం.

## కుంటముక్కల తిరుమలనాథకవి

### శైవాచార సంగ్రహము

ప్రబంధ రత్నావళి 53 వ పుటలో నిట్లు గలదు. తిమ్మయ—కుంటముక్కల—శైవాచార సంగ్రహము.

---

3. ఈ కథకు 'సిద్ధ నాగార్జున' శబ్దములోని అర్జున శబ్దానికి సంబంధ మున్నది. నాగార్జునుడు శ్రీ పర్వత క్షేత్రవాసి. శ్రీశైలం పుట్టు పూర్వోత్తరాలను గూర్చి బ్రహ్మాండమైనంత పరిశోధన జరగాలి. ప్రత్యేకంగా దీని కోస మొక పరిశోధన సంస్థ నెలకొల్పాలి.

4. భారతి—1938—జూన్.

5. క్రీ. శ. 1888 న సంవత్సరమున బొగ్గారపు చెన్నయగారిచే మదరాసులో శైవరత్నాకర ముద్రాక్షరశాలలో ముద్రితమైనది.

సీ. కపిల వర్ణము గోవు కడుపొప్పు పంచ వా
జనియించె దద్గర్భమున విభూతి
నల్లవి మొదవు వర్ణన కెక్కు భద్ర వా
దద్గర్భమున భసితంబు పుట్టె
నెఱ్ఱని ధేనువు నేపారు సురభి నా
గలిగె భస్మంబు దద్గర్భమందు
పొగచాయ గల యావు పొలుచు సుశీల నా
క్షారంబు గలిగె తద్గర్భ సరణి

గీ. చిత్రతర వర్ణ రుచులు ప్రసిద్ధిదాల్చు
గిడ్డి సుమనోభిదాన మంగీకరించు
ప్రభవమొందె దదీయ గర్భమున రక్ష
పంచముఖముల నిట్లుద్భవించె భూతి.

ఈ పద్యము—శైవాచారసంగ్రహము[6] ప్రథమాశ్వాసమున 26 వ పద్యముగా నున్నది. ఇది మూడాశ్వాసాల కృతి. వీరమాహేశ్వరాచారాన్ని విశదీకరించేది. కృతికర్త కుంటముక్కల తిరుమలనాథకవి. పరాశర గోత్రుడు. అహోబల మంత్రి పుత్రుడు. సకల విద్యా నిధాన బిరుదాంకుడు. ఈతడు కూచిరాజు ఎఱ్ఱన వ్రాసిన కొక్కోకమునకు కృతిపతియైన కుంటముక్కల మల్లమంత్రికి అన్న కొడుకు. మల్ల మంత్రి కాలము క్రీ. శ. 1480 ప్రాంతముగాన తిమ్మకవియు నా కాలమువాడే.

ఇదీ శ్రీశైలానికి సంబంధించినదే. శ్రీశైలంలోఉన్న సిద్ధ భిక్షావృత్తి మఠాని కధిపతియైన వారాణసీ సిద్ధ భిక్షావృత్తి మనుమడగు వీరభద్రుడీ కృతి ప్రోత్సాహకుడగు పిల్లలమఱ్ఱి గన్నమామాత్యునికి స్నేహితుడు. గన్నమంత్రియు శైవార్చనా సంపన్నుడు. ఈ కృతి కేవలము శైవ మతాచారమునకు సంబంధించినదైనను మంచి రచన గలది. తరువోజ యందు వాడబడినది.

ఈ సంపుటమున క్రీ. శ. 1600 వఱకునుండే కవుల గుఱించి యున్నది. వారిలో చేర్చవలసిన కవులున్నారు. ఆ కవులను గూర్చి సంగ్రహంగా చెప్పి తరువాత గ్రంథంలో ఉన్న కవులను విమర్శిస్తాను.

## పచ్చకప్పురపు తిరువెంగళ కవి

ఈతడు చొక్కనాథ చరిత్ర అను ద్విపద కావ్యాన్ని రచించి దక్షిణదేశంలో రామనాథపురం జిల్లా తిరుపత్తూరు సీమను పాలించే, గొల్ల పెద రామనాయకుని కంకితము చేశాడు. కృతిభర్త కమ్మకులజుడు. కృతికర్త భట్రాజు—పెద రామ నాయకుడు అచ్యుత దేవరాయని కాలంలో వాడు. క్రీ. శ. 1538 లో తిరుత్తళినాయునారు దేవాలయాని కొక గ్రామం దానం చేశాడు. తిరుపతిలోను నీతని శాసన మున్నది. తిరువెంగళ కవి పూర్వుడు ప్రౌఢ దేవరాయల్ని కవిత్వముచేత మెప్పించి పచ్చకప్పురము బహుమతిగా బడశాడు. అప్పటినుంచి వీరు పచ్చకప్పురపు వారైనారు. ఇతని కవిత్వము అట్టిదే.

## భద్రకవి లింగకవి

ఈతడు సానంద చరిత్ర, దేవాంగ పురాణము అను రెండు ద్విపద కావ్యాలు రచించాడు. వీర శైవుడు. ఈతని దేవాంగ పురాణము దక్షిణార్కాడుజిల్లా పడవీడుకు అధిపతి యైన కాళహస్తినాయకుని పేర రచింపబడినది. ఆతని శాసనాలు క్రీ. శ. 1530—32 ప్రాంతమున నున్నవి కాబట్టి కవి ఆ కాలమువాడే. సానంద చరిత్రలో 3 ఆశ్వాసాలు, దేవాంగ పురాణంలో ఏడాశ్వాసాలు ఉన్నవి. తననుగూర్చి "తెనుగున నెఱవాది ద్విపదకు రాజు" అని చెప్పుకొన్నాడు.

## కోట శివరామకవి

ఈతడు సానందోపాఖ్యానమును పద్య కావ్యంగా రచించిన కవి. కృష్ణరాయల అష్ట దిగ్గజములలో ఒకడైన ధూర్జటి శిష్యుడు. నాల్గాశ్వాసముల యీ పద్యకృతి పై ద్విపద కృతి ననుసరించినా ప్రత్యేకత గలది. వీరేశలింగముగారి కవుల చరిత్రలో నీతని చరిత్ర యున్నది.

## దోనూరి కోనేరునాథుడు

బాల భాగవతాన్ని, ద్విపదగాను, పద్యకావ్యం గాను రచించిన కవిసార్వభౌముడు. బాల భాగవత ద్విపద క్రీ. శ. 1547 లో రచించినట్లు ఆ గ్రంథాంతమున నున్నది.

## సిద్ధిరాజు తిమ్మరాజు

పరమయోగివిలాసము పద్య కావ్యముగా వ్రాసిన తిమ్మరాజు కొండవీటిసీమ క్రీ. శ. 1550 లో పాలించుచున్నట్లు శాసన నిదర్శన మున్నది. "ఈతని కవిత్వము సర్వ విధముల చేతను ద్విపద కావ్యమునకంటె (అనగా చిన్నన్న కృతి కంటె) శ్రేష్ఠతరముగా నున్నది." అని ఆంధ్రకవుల చరిత్ర 185 వ పుటలో గలదు.

## రామరాజు రంగప్పరాజు

సాంబోపాఖ్యాన ప్రబంధకర్తయైన రంగప్ప రాజు క్రీ. శ. 1550 ప్రాంతమువాడు.

## బొడ్డుచెర్ల చినతిమ్మన

సంస్కృతమున జయదేవకవి రచిత ప్రసన్న రాఘవ నాటకమును పద్య ప్రబంధముగా బొడ్డుపల్లి చిన తిమ్మన రచించియున్నాడు. ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధమని దీని పేరు. ఆశ్వాస విభజన లేక మూలమునగల నేడు అంకముల విభజనలో నున్నది. కృతిభర్త నంద్యాల తిమ్మరాజు. ఇతడును కళాపూర్ణోదయ కృతిభర్త నంద్యాల కృష్ణరాజును అన్నదమ్ముల మనుమలు. ఈ ప్రబంధము 1550 ప్రాంతమున రచితమై యుండవచ్చును. ఈ ప్రబంధము—మూడేండ్ల క్రిందట

---

6. ఈ కావ్యము మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమువారిచే క్రీ. శ. 1951 లో ముద్రితమైనది.

శ్రీ డాక్టరు బి. రామరాజుగారిచే పీఠికాదులతో ప్రకటింపబడినను ఈ సంపుటములో చేరకపోవుట వింతగా నున్నది.

## పట్టమెట్ట సోమనాథసోమయాజి

ప్రశస్తకవి సోమనాథ సోమయాజి తెలంగాణాలో బిక్కనవోలు సంస్థానాధీశుడైన కామిరెడ్డి కంకితముగా సూతసంహితను, కామిరెడ్డి తమ్ముడు ఎల్లారెడ్డికి కృతిగా బ్రహ్మోత్తర ఖండమును పద్య కావ్యాలుగా రచించాడు. బ్రహ్మోత్తర ఖండంలో కామిరెడ్డి త్యాగమువల్ల జీవించు కవి పండితులు శాలివాహన శకమునకు సమానులని యీ విధంగా చెప్పాడు.

గీ. కలిమి బిక్కనవోలి శ్రీ కామిరెడ్డి
భూమివిభు నాశ్రయించిన బుధులు నిజము
శాలివాహన శకవర్ష సంఖ్య బదియు
నైదునూర్లైన వర్తమానాబ్దములుగ.

అనగా కామిరెడ్డి పోషితులు 1500 మంది. శాలివాహన శక వర్షం 1500 క్రైస్తవ శకం 1578 తో సరిపోతుంది. కాబట్టి కవి, కృతిపతి కాలం క్రీ. శ. 1578.సూత సంహితలో 7 ఆశ్వాసాలు, బ్రహ్మోత్తర ఖండంలో 5 ఆశ్వాసాలు ఉన్నవి. ప్రౌఢకవిత గలవి.

## మల్లారెడ్డి

కామిరెడ్డి సోదరుడైన మల్లారెడ్డి—షట్చక్రవర్తి చరిత్ర ప్రబంధ రచయితగా నీ వఱకు కవుల చరిత్ర కెక్కియున్నాడు. ఆ కావ్యమేకాక, శివధర్మోత్తరము, పద్మ పురాణము కూడా మల్లారెడ్డి రచించాడు. మల్లారెడ్డి సోదరుడు ఎల్లారెడ్డి, వాసిష్ఠ లింగపురాణాదులను తెలుగు చేసినట్లు తెలుస్తున్నదికాని ఆ గ్రంథాలు లభించలేదు.

## రాయసం వెంకటపతి

సంగీత సాహిత్య కళా ధురంధరుడైన వెంకటపతి లక్ష్మీవిలాసమనే ప్రబంధాన్ని రచించాడు. ఈతడు 1572—1585 వఱకు పెనుగొండను పాలించిన శ్రీరంగ రాయల[7] రాయసము మంత్రి.

## రేటూరి భావన

'అక్కల పాట' అని ప్రచారములోనున్న కామేశ్వరి చరిత్రను నీతడు ద్విపదగా రచించాడు. ఈతని గురువు అద్దంకి సింగరాచార్యుడు. క్రీ. శ. 1511—1568 మధ్య ప్రాంతమున నున్నవాడు.

## ఎల్లకర నరసింహకవి

రాయవాచకంలో ఉదాహరింపబడిన భారత సావిత్రి అనే వచన కావ్యాన్ని రచించిన కవి. మార్కండేయ పురాణ ద్విపద యీతని కృత్యంతరం. సింగరాచార్యుని సమకాలికుడగు తిరుమల లక్ష్మణముని యీతని గురువు.

ఇంకా కొంతమంది ఉన్నా, విస్తర భీతిచేత విరమించాను. పైని చెప్పిన వారి కావ్యాలన్నీ ముద్రితమైనవే. ఇక అచ్చుకాకుండా సాహితీ పరిశోధకులకు కవులచరిత్రకు పరిచితులైన మరి ముగ్గురు కవులు కావ్యాలను గూర్చి మాత్రమే తెలుపుతాను.

## నారన సూరన

'ఉదయనోదయము' అనే ప్రశస్త ప్రబంధాన్ని సూరన రచించి ఎవ్వరికి కృతి యీయకుండా చనిపోగా, అతని కుమారుడు నారన దానిని క్రీ. శే. 1538 లో అచ్యుత రాయల కాలంలో కొండవీటి రామయభాస్కరమంత్రి మంత్రి ముడియం భాస్కరునికి కృతి నిచ్చి దాన్ని వెలయించాడు. కాబట్టి సూరన కృష్ణరాయలకు కొంచెము ముందువాడు. ఒక్క తంజావూరి లైబ్రరీలో మాత్రమే దీని కొక ప్రతి ఉన్నది. దానినుండి ప్రతులు రెండు మూడు వ్యాప్తిలో ఉన్నా, ఇంత వఱకు ఇది అచ్చు కాకపోవడం ప్రబంధ వాఙ్మయానికి పెద్ద లోపం. శ్రీమానవల్లివారు దీనిని గూర్చి తొలుత లోకానికి తెలిపారు.

ఇతడు వ్రాసినదే 'వనమాలీ విలాసము' అనే ప్రబంధం అసమగ్రంగా లభిస్తున్నది.

## అంగర నృసింహకవి

'రాజ రాజాభిషేకము' అనే అయిదాశ్వాసాల ప్రబంధాన్ని రచించిన అంగర నృసింహకవి క్రీ. శ. 1510 ప్రాంతము వాడు. వీరేశలింగ కవుల చరిత్ర మూడవ భాగం 201—204 పుటలలో ఈతని చరిత్ర కలదు. అయితే అందలి కాల నిర్ణయం సరికాదు. కృతిపతి కొప్పుల వల్లభూపతి క్రీ. శ. 1360 ప్రాంతమున నున్న నామయ నాయకునికి[8] ఐదోతరము వాడు.

## పెదపాటి జగ్గన

అందఱికన్న ముఖ్యంగా చెప్పవలసిన కవి పెదపాటి జగ్గన్న. ఇతని ప్రబంధ రత్నాకరము. తెలుగున సంకలన గ్రంథాలలో నద్వితీయమైనది. ఇదే కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రి గారి ప్రబంధ రత్నావళి సంకలనానికి ప్రధానాధారమైనది. దీని యేకైక ప్రతి తంజావూరి పుస్తక శాలలో నున్నది. మూడాశ్వాసాలు మాత్రమే ఉన్నవి. ఈనాటి వాఙ్మయ చారిత్రక పరిశోధకులకు—అత్యంతంగా ఉపకరించిన యీ ప్రబంధ రత్నాకర విశేషాలు, గ్రంథకర్తనుగూర్చి తెలియ వచ్చుచున్న హంశాలు యీ సంపుటంలో వివరించవలసి ఉన్నా విన్నతములు కాలేదు. ప్రబంధ రత్నాకరము తంజావూరిలో ఉన్న ప్రతి ననుసరించి మూలంలో ఉన్న రీతిగా అచ్చు వేయించి

---

7. ఇదే తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యములో (1—20) చెప్పిన 'వాయసపుపుత్తి'.

8. ఇతడే దోనేపూడి శాసన దాత.

నట్లయితే దానినుండి ఎన్నో క్రొత్త సంగతులు తెలుసుకొన డానికి అవకాశం కలుగుతుంది.

ఇక ప్రత్యేక కవి సమీక్ష

## తెనాలి రామకృష్ణకవి

ఈ సంపుటంలో అందరికన్నా హెచ్చు పుటలు రామ కృష్ణునివే. కాని అతని తరువాతి కవులు, రామలింగ నామం తోడనే అతని పేర్కొన్నారు. పృథుచరిత్రలో నున్న యీ క్రింది ప్రశంస రామలింగ కవి లింగధారియైనట్లు స్పష్టపఱచు చున్నది.

"శృంగార రసాలింగిత
రంగత్కవితా నదీ తరంగము హృదయ
త్యంగద్భుజంగమాంగద
లింగమ్ము తెనాలిరామలింగము దలతున్—

రామకృష్ణుని కాల నిర్ణయాదులేకాక,9 ఆతడు కృష్ణ దేవరాయ కాలంలో అష్టదిగ్గజములలో ఒకడని యిదివరకే నిరూపితము కాగా—ఈ సంపుటం—44 వ పుటలో "అష్ట దిగ్గజాలలో ఒకడుగా రాయలవారి భువనవిజయంలో తెనాలి రామలింగడు ఎన్నాళ్ళు ఉన్నాడో, అసలు ఉన్నాడో, లేదో తెలియదు' అని వ్రాయుట దురూహ్యంగా ఉన్నది. అంతేకాదు. అతని గూర్చి వ్రాసిన కథలు, పద్యాలు కొన్ని విడ్డూరంగా ఉన్నవి.

42 వ పుటలో చూడండి.

బసవరాజు గోవిందరాజునుగూర్చి రామకృష్ణుడు చెప్పిన పద్య ముదాహరించాక యిట్లు వ్రాశారు :

"ఈ పద్యంలోని గోవిందరాజుకన్నా, కొంచెము తక్కువ అవహాస్యానికి ఎవరో తిరుమలరాయుడు పాలుపడ్డాడు. పాపం! ఆతనికి ఒంటికన్ను. ఆతణ్ణీ అతని ప్రియురాలిని కలిపి రామ కృష్ణు డిలా పద్యం చెప్పాడు :

"అన్నాతి గూడ హరుడగు
నన్నాతిం గూడకున్న నసురగురుండౌ
నన్నా తిరుమల రాయడు
కన్నొక్కటిలేదుగాని కంతుడు గాడే"

ప్రియురాలితో కలిస్తే ముక్కంటి, లేకుంటే ఏకాక్షి అని సులభ గణితంలో చాటువు చెప్పాడు. మొట్ట మొదట ఈ పద్యం తెనాలి రామలింగనిదికాదు. ఇందున్న తిరుమల రాయ డెవరోకాదు. వసుచరిత్ర కృతిపతియైన తిరుమల రాయడు. ఈ పద్యము చెప్పినది భట్టుమూర్తి. ఈ పద్యంలో ఒక చరిత్రకాంశం ఉన్నది. తిరుమల రాయునికి తాళికోట యుద్ధంలో ఒకకన్ను పోయినది. ఆతడు రాజు కాబట్టి ఈ సంగతి యెవ్వరికి తెలియదు. అది లేకపోయినా ఉన్నట్లే ఉండేది. ఈ సందర్భాన్ని అనుసరించి రామరాజ భూషణుడు పట్టాభిషేక సమయంలో—ధర్మపత్నితో ఉన్నప్పుడు శివుడు అర్ధ నారీశ్వరుడు కాబట్టి ముక్కంటిగా పోల్చి చెప్పాడు.

ఈ అంశం—ఏ వ్రాతలలోను లేదు. పాశ్చాత్య చరిత్ర కారులు మాత్రమే సూచించారు. ఇది భట్టుమూర్తిదేనని ఉదహ రిస్తూ, ప్రామాణికంగా ఇదివరకే చరిత్రకారులు గుర్తించారు 10

## బైచరాజు వెంకటనాథుడు

రామలింగని చరిత్రలోగాని, పై వెంకట నాథుని చరిత్రలోగాని వా రిరువురికి సంబంధించిన కథ కవిజీవితాల్లో ఉన్నా ఉదాహరించలేదు. వెంకటనాథుడు, కృష్ణరాయల సమ కాలికుడు. నిస్సహాయ ప్రబంధ నిర్మాణ ధురీణుడు. ఎవ్వరినీ లక్ష్యపెట్టేవాడుకాడు—తెనాలి రామలింగమువంటి మహా సమ ర్థుడు కూడా ఇతని ధాటికి తట్టుకోలేకపోయినాడు. ఈతడు రాయల సమక్షాన తన కావ్యం చదువుతూన్నప్పుడు రామలింగడు

ఈ—"రాచ కవిత్వ బాధ పడరాదు పరామరిసింపు దైవమా"

అని విచారించాడు. రాయలవారు వెంటనే లేచిపోయినారు. ఇది వర కందఱూ యీ ఒక్క పాదాన్నే ఉదాహరించారు. ఈ తరువాత నేను పూర్తి పద్యం సంపాదించాను.

నాచనసోముఁ డన్య లలనాచపలాత్మకుఁడౌటకల్ల పై
శాచికులోద్భవుండయిన జక్కుల యెల్లని రాచ వెంగనిన్
గాచిన వీరి తల్లుల యుగంబుల నన్నయ భట్టునుండెనో
రాచ కవిత్వ బాధ పడరాదు పరామరిసింపు దైవమా.

ఈ పై పద్యం ఈనాటి చాటు పద్య సంకలన గ్రంథాలలో చేరినట్లు లేదు. దీనిని 1893 లో 'అముద్రిత గ్రంథ చింతా మణి' అధిపతులు—చాటు పద్యాల శీర్షికలో ప్రకటించారు. ఈ పద్యార్థాన్ని పరిశీలింపవలసి యున్నది.

తెలుగున పంచతంత్ర కావ్యాలలో బైచరాజు వెంకట నాథునిది అన్నింటికన్నా పెద్దది. 5 అశ్వాసాలలో 2081 పద్యా లున్నాయి.ఇతర పంచతంత్రాలలోలేని 4 కథలు ఇందులోహెచ్చుగా ఉన్నాయి. భానుకవి పంచతంత్రం అన్నింటికన్నా చిన్నది. (738 పద్యాలు). అయినా చాలా విలువ గలది. భానుకవిని గూర్చి 7 వ సంపుటంలో ఇతర కవులలో చేర్పడ మెంతమాత్రమూ సరికాదు. అందలి చారిత్రక విషయాలు విజయనగర చరిత్రకారులు ప్రామాణికంగా గ్రహించారు. అన్నింటికన్నా ముఖ్యంగా భానుకవి పంచతంత్ర మొక్కటే—అసలు సంస్కృత పంచ తంత్రానికి

---

9. తెనాలి రామకృష్ణుడు,అతని సమకాలికులు. డాక్టరు— నేలటూరి వెంకటరమణయ్యగారు.

భారతి 1941 ఫిబ్రవరి—పుటలు 141—150. మార్చి— పుటలు 321—336.

10. Sources of Vijayanagar History. Madras University Publication. 1917. P.P 221-222. ChatuVerses about Tirumalaraya by Bhattumurti.

మూలమైన తంత్రోపాఖ్యానానికి దగ్గఱగా ఉంటుంది. భాను కవి పంచతంత్ర మూలము పై యుద్ధరించినట్లు భావిస్తున్నాము.

### అంగద బసవయ్య

బసవయ్య ఇందుమతీకల్యాణంలో ఉన్న—

> ''బీద శచీవిభుండు దితిబిడ్డ లవార్యులు వారు పల్మరున్
> బాదలు పెట్టగాఁ జెఱలువట్టగ నుండుట భారమంచు రం
> భాదిమరున్నివాస లసదప్సరసల్ చనుదెంచివచ్చిరో
> నా దరఫుల్లపద్మవదనల్ విహరించుదు రప్పురంబునన్''

పద్యాన్ని కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహంలో ఉదాహరించాడు. అయితే అందులో అంగర బసవయ్యా యని ఉన్నది. శ్రీమానవల్లివారు ప్రబంధ మణిభూషణ పీఠికలో అంగర అనే వ్రాశారు. ''అంగర'' యింటి పేరుగల కవులున్నారు.

### లింగముగుంట సర్వకవి

లింగముగుంట సర్వకవి పేరు సర్వకవియేకాని సర్వ దేవుడుకాదు. ఆదిపురాణము తెలుగున నున్నట్లు అప్పకవీయము వలన తెలుస్తున్నది. తెలుగున జైన కావ్యముల ప్రాచీనత యీావఱకే నిరూపించడమువల్ల యిక్కడ వివరించలేదు.

### చదలువాడ మల్లన

కార్వేటి నగర సంస్థాన చరిత్ర ననుసరించి యీతని కాలం క్రీ. శ. 1540 ప్రాంతమని తెలుస్తున్నది. ప్రథమంగా విప్రనారాయణచరిత్ర వ్రాసిన వాడు మల్లనే.

### కందుకూరి రుద్రకవి

రుద్రకవి నిరంకుశోపాఖ్యానం చతుర్థాశ్వాసాంతంలో యీ క్రింది పద్య మున్నది.

> శా. ''భస్మోద్ధూళిత దేహ పోషణ కళాపారీణ, వారాకరా
> కస్మాదుత్థిత కాలకూట విష దిగ్ధగ్రీవపాదాంబుజా
> తస్మాస్మర్త్య వ్రజ కల్పభూజ కరుణా ధన్యేక్షణా సేవమా
> నాస్మత్స్తోత్రక మత్తనూభవకనాగాఖ్యాంకలింగాహ్వయా''

దీనిని బట్టి రుద్రకవికి నిరంకుశోపాఖ్యాన రచనము నాటికి పుత్రుడేకాక పౌత్రుడు కూడ నున్నట్లు తెలియుచున్నది.

తరువాతి పద్యము:

> ఆతులతర సోమవార
> వ్రత నియమ ధురీణ హృదయ వారిజ సాధ్వీ
> శత వినుత చెన్నమాంబా
> వ్రతిదిన సంసేవ్యమాన పదపంకేజా

ఇందు పేర్కొనబడిన చెన్నమాంబ రుద్రకవి భార్య యగును.

### పింగళి సూరన

సూరన గరుడ పురాణ రచనను గూర్చి 190 పుటలో యిట్లున్నది. ''తను అల్లాటే కృష్ణ శాస్త్రి శిల్పి గిరిజా కల్యాణం'' ప్రతిష్ఠించక సూరనరాజుగారు గరుడ పురాణాన్ని తెలిగించారు. ఇది అష్టాదశపురాణాల్లో ఒకటైనా సూరనరాజు గారి కాలం దాకా దీనిని తెనిగించ డానికెవరు ముందుకు రాలేదు. ఇది విష్ణు సంబంధమైన పురాణమే గాని, ఉత్త ఓఘాయిత్య పురాణం. ఎవరింటనైనా పీనుగు లేచినప్పుడుఁగాని దీనిని చదవరు.''

మొదట—గరుడ పురాణం అష్టాదశ పురాణాల్లోనిది కానే కాదు. గరుడ పురాణము ఉత్త ఓఘాయిత్య పురాణమూ కాదు. అది శ్రీరంగమాహాత్మ్యన్ని తెలిపే పురాణం. కాబట్టే ''ఇటమున్ గారుడ సంహితాది కృతులన్'' అని సూరన ప్రత్యేకంగా దీన్ని పేర్కొన్నాడు. గరుడపురాణము శ్రీరంగమాహాత్మ్యమే అని నిరూపించడానికి ప్రమాణం చూపుతున్నాను.

ద్విపద రామాయణాన్ని అద్వితీయంగా రచించిన కట్టావరదరాజు శ్రీరంగ మాహాత్మ్యము అనే 10 ఆశ్వాసాల పద్య కావ్యము రచించాడు. దానిలో తన గ్రంథం గూర్చి యిట్లు చెప్పాడు.

> ఉ. చేయరె తొల్లి సత్కవు లశేష పురాణములుం దెలుంగునన్
> ఈ యితిహాస మెందు రచియింపమి తావకపుణ్యమెంత యా
> మ్నాయచతుష్క సారము సనాతనగారుడసంహితాశతా
> ధ్యాయి తెనుంగుసేయ డొక డర్హుడె నేటి కవీంద్రకోటికిన్

గరుడ పురాణం శతాధ్యాయ సంహిత—దీనిని శతాధ్యాయి అని అంటారు. ఇంతేకాక గద్యయందు—

ఇది శ్రీ వేంకటేశ్వర వర ప్రసాదాసాదిత చాటుధారా నిరఘాట సరస చతుర్విధ చతుర కవితా రచనా చమత్కార సకల విద్వజ్జనాధార కట్ట హరిదాసరాజ గర్భాబ్ధి చంద్ర వరద రాజేంద్ర ప్రణీతంబైన గారుడ పురాణ శతాధ్యాయి శ్రీరంగ మాహాత్మ్యంబను మహా ప్రబంధమునందు సర్వంబును దశ మాశ్వాసము సంపూర్ణము.

సూరన 'గారుడ సంహితా' అని చెప్పుటచేత అది శ్రీరంగ మహాత్మ్యమే కాని వేఱు కాదని తెలియనగును. దీనినే శతాధ్యాయి అందురు. మఱింగంటి సింగరాచార్యు లీ శతాధ్యాయిని[11] తెలిగించినాడు. మనకు తెలిసిన కవులలో మొదటి శ్రీరంగ మాహాత్మ్యము రచించిన కవి చెన్నమల్లు శ్రీ గిరన్న. తరువాతివాడు భైరవకవి. మూడవవాడు సూరన.

### రామరాజుభూషణుడు

వసుచరిత్ర రచనా కాలము క్రీ. శ. 1571 సంవత్సర మని యీావఱకు చారిత్రకులు నిర్ణయించియున్నారు.[11]

11. భారతి—1931 జాన్యువరి—కుందూరి ఈశ్వర దత్తుగారి వ్యాసము—వసుచరిత్ర రచనా కాలము.

సంగీత సాహిత్యములలో మహావిద్వాంసుడైన శిష్టు కృష్ణమూర్తి కవి వసుచరిత్రను సంగీత పురాణముగా వినిపించే వాడు. పీఠికాపురరాజాస్థానంలో ఆయన వినిపించినట్లు పానుగంటివా రిట్లు పేర్కొన్నారు.

''సంగీత సాహిత్య సుప్రసిద్ధుడగు కవివర్యునిచే—యనేక చిత్రవిచిత్రార్థప్రతిపాదన యుక్తమైన వసుచరిత్ర సంగీత పురాణ పఠనము జరిగిన దీ సభ యందే''.12

పాల్కురికి సోమనాథుని కృతుల తరువాత—తెలుగున, ఇతర భాషలలో పరివర్తన గౌరవము బడిసిన కృతి వసుచరిత్ర, సంస్కృతమున, తమిళ భాషలో అనూదితమైనది.13 కన్నడమున దీని ప్రభావ మున్నది. 17 వ శతాబ్దిని ప్రసిద్ధ కన్నడ కవి లక్ష్మీశుడు తన జైమిని భారతంలో 'భావం బెక్కడ లేక' అన్న వసుచరిత్రపద్యాన్ని అనుసరించాడు. ఆ శతాబ్దాంతంలో వెంకవార్యుడనే కవి వసు చరిత్రలో ఆశ్వాసాంత గద్య పూర్తిగా అనుసరించాడు. వసుచరిత్రలోని ప్రథమాశ్వాసంలో కొన్ని పద్యాలకు ద్వితీయాశ్వాసంలో పద్యాలకు కావలి వెంకట రామస్వామి చేసిన ఆంగ్లానువాదము ఇంగ్లీషులో పద్య ములతో నున్నది. భారతీయులలో ఇంగ్లీషు గద్య, పద్య రచనలు చేసినవారు రామమోహనరాయలు మైకేలు మధుసూదన దత్తు అని ఆంగ్లో ఇండియను లిటరేచర్ అనే గ్రంథంలో శ్రీనివాసయ్యంగారు వ్రాశారు.

కాని నేను పరిశోధించి—సప్రమాణంగా యావద్భారత వర్షంలో మొదట ఇంగ్లీషు గద్య రచన కావించినవారు కావలి వెంకట బొర్రయ్యగారని, ఇంగ్లీషు పద్య రచన కావించినవారు వెంకట రామస్వామిగారని నిరూపించాను.14

వసుచరిత్ర వ్యాఖ్యానాలలో బ్రౌనుదొరగారికి కృతి యిచ్చిన ములుపాక బుచ్చయ్యశాస్త్రి ప్రతి పదార్థ ప్రకాశికా వ్యాఖ్య ప్రశంసింపదగినది. బ్రౌను దొరగారిని తెలుగురాజు వలె—ఆశ్వాసాద్యంత గద్య పద్యాలతో కవి స్తుతించాడు.

వసు చరిత్ర లోకోత్తర విశిష్టత ఆ గ్రంథంలోని యీ గ్రంది పద్యంవల్ల వ్యక్తమవుతుంది.

'జీవనమెల్ల నత్కని నిషేవిత మాశయమెల్ల స్వచ్ఛతా
పావనతా గభీరతలపట్టు, ప్రశాంతము లెల్ల విశ్వధా
త్రీవలయ త్రికాలఫలదేశికముల్ నవకంబులెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము లానది పెంపు నుతింపశక్యమే
(2—105)

పై పద్యమున—'అనది' యనుటకు— లీ 'కృతి' అవినచో నది వసుచరిత్రకే యన్వయించును.

### మఱింగంటి సింగరాచార్యులు

సింగరాచార్య కవి చిన్నతనమునుండి కవిత్వముచెప్పి యిరవై యేండ్లనాటికి ఇరవై గ్రంథాలు వ్రాసిన మహాకవి. అచ్చతెలుగులో నిరోష్ఠ్య కావ్య రచనకు, తెలుగున చతురర్థి కావ్యానికి ప్రారంభకుడు. బహుముఖ ప్రజ్ఞాశాలి. సింగరాచార్యుని గూర్చి వివరంగా వ్రాయవలసి ఉన్నా, ఇందు చాలా సంగ్రహంగా ఉన్నది. అంతేకాదు. ఇతని రచనల గూర్చి యిచ్చిన పట్టిక కూడా సరిగాలేదు. వానిలో సింగరాచార్య రచనలు కొన్ని చేర లేదు. ఒక కృతికి ప్రశ్నార్థ చిహ్నమున్నది. కొన్నింటి పేర్లు వ్యత్యాసముగా ఉన్నవి. మొదట చేరని రచనలను తీసికొందాము.

### చెల్వపిళ్లరాయ చరిత్ర

ఇది వైష్ణవక్షేత్రమగు మేల్కోట అనే నామాంతరము గల యాదవాద్రిని వెలసిన చెల్వపిళ్లరాయని మాహాత్మ్య మును దెలిపే మూడాశ్వాసముల పద్య కావ్యం. చెల్వపిళ్ల అను నది సంస్కృతమున సంపత్కుమార శబ్దానికి తమిళ భాషా పర్యాయపదం.15 ఆ భాషలో 'శెల్వప్పిళ్లయి' అందురు. ఈ కావ్యాన్ని మఱింగంటి సింగరాచార్యులు రచించినట్లాశ్వాసాంత గద్య యిట్లు తెలుపుచున్నది.

''ఇది శ్రీ మద్వేంకట లక్ష్మీ నృసింహ వర ప్రసాద లబ్ధ కవితావిచిత్ర మౌద్గల్యసగోత్రపవిత్ర వేంకట దేశిక పౌత్ర, కుమార వేంకటాచార్య పుత్ర మఱింగంటి వెంకట నృసింహాచార్య విరచితంబైన శల్వపిళ్ల రాయ చరిత్రంబను మహా ప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము''. ఇది సిరసనగండ్ల నృసింహస్వామికి కృతి. సింగరాచార్యులు తా నీ నృసింహస్వామి సేవకుడనని యిట్లు చెప్పుకొన్నాడు.

సిరిసనగండ్ల నృసింహుల
సరసిజ సచ్చరణ యుగళ సంసేవకుఁడన్
నరసింహ నామధేయుఁడ
విరివిగ సత్కావ్య రచన విజ్ఞానుండన్.

ఈ చెల్వపిళ్ల రాయ చరిత్రను తన 10 వ యేట వ్రాసినట్లుగా వేరొకచో నిట్లు చెప్పికొని యున్నాడు.

సీ. పది యేండ్ల వాఁడనై బహు చమత్కృతియైన
శెల్వపిళ్లను రాయ చరిత మొకటి''

---

12. పిఠాపురము కోటలో 1921లో జరిగిన ఆంధ్ర సాహిత్యపరిషదేకాదశవార్షికోత్సవాధ్యక్షోపన్యాసము.

13. సంస్కృత వసుచరిత్ర ఈనడుమనే ముద్రిత మైనది. తమిళ వసుచరిత్ర 1955 లోనే ముద్రిత మైనది.

14. Pioneers of English writing in India The Telugu Cavaly family. Jourual of the O. R. I. Madras University.

15. ఈ శెల్వప్పిళ్ల తెలుగులో'చెల్లపిళ్ల' గా మారినది. మహా ప్రసిద్ధులైన శతావధాని చెల్లపిళ్ల వేంకటశాస్త్రిగారి యింటి పేరి 'శెల్వప్పిళ్ల'నుండి వచ్చినదే.

చెన్న మల్లేశ—చన్నమల్లేశ; చదలువాడ—చెదలువాడ;
ఈ రీతిగా చెల్వపిళ్ల చల్వపిళ్లగా వాడవచ్చును. అందుచేత పైన యతి సరియైనది. అముద్రితము. గ్రంథ సంఖ్య 686.

చిలువపడిగ రాఁడేనికథ

ఇది యచ్చ తెలుగు పేరితోనున్న యచ్చతెలుగు కావ్యము. 'చిలువ పడిగ రాఁ ఱేఁడు' అనగా దుర్యోధనుడు—చిలువ—అనగా పాము. పడగ—అనగా ధ్వజము. పాము ధ్వజముగా గల ఱేఁడు—అనగా రాజు—దుర్యోధనుడు. ఇందాతడు భానుమతిని పెండ్లియాడిన కథ వర్ణితమైనది.

మ. సిరియున్ బంటనెలంత నీలయును దాఁ జెన్నైన మైయొప్పుచే
నిరువంకం గొలువంగఁ బ్రేముడి యెడన్ హెచ్చన్ దయం బత్తులన్
నరలే కేలెడి చిల్వగట్టుదొర బాగైనట్టి దోరూపునన్
నరుఁడౌ సిర్పనగండ్లనుండు నరసింగప్పయ్యమమ్మోముతన్.

గీ. అట్టి జడదారి సంతున కంద మొదవ
తుంటవిలుకాని యయ్య క్రేగంటఁగాంచి
కంటిగంటి మఱింగంటి యింటి పేర
వన్నికకు నెక్కె నీనేల నింపెసంగ.

సీ. "ఆ వంగడపు సంద్రమందు.......నలరు ,
వేంకట గురుఁడు రంగమయందు
కొమరులను మమ్మ మువ్వుర నమర గనియె
అప్పలయ్యయు సింగయ్య యనెడివారు
అనుఁగుఁ దమ్ముఁలు గాగను నలరువాఁడ
నారసింహయయనియెడి పేరివాఁడ"

ఇందాశ్వాసాంత గద్య మత్తేభ వృత్తముతో నున్నది.

మ. ఇదియా చిల్వసిడెంపుఱేని చరితం బింపొందగాఁ దెన్గునన్
విదితుండౌ నరసింగసామి దయచే వేడ్కం మఱింగంటికం
న్నిదినిం బుట్టిన నారసింహకవి దా నేర్పొప్పగా గూర్చినన్
ఇది మూడోదగు గద్దె పద్దెములను న్నింపొందు నాశ్వాసమై.

దీని వెనుక నీ క్రింది సీస పద్యమున నాలుగు పాదములు గలవు.

సీ. పదియేండ్లవాఁడనై బహు చమత్కృతి యైన
చెల్వ పిళ్లనురాయచరిత మొకటి—
దీనిని ముందుదాహరించితిని.
వ్రాసితిఁ బదియొక్క వత్సరంబున నేను
నందనందనశతానంద మొకటి
పదిరెండు వర్షముల్ పరగ నలంకార
కృష్ణ విలాసంబు....నొకటి
అయిదైదుమూడును హాయనంబులలోన '
జనకరాయనిబిడ్డ చరిత మొకటి—ఇత్యాది
—అముద్రిత గ్రంథ సంఖ్య 662.

లేఖక దోషము లిట్లున్నా, పై పద్య పాదాల వలన సింగరాచార్యులు 10 వ యేట చెల్వపిళ్లరాయచరిత, 11 వ యేట నందనందనశతకము, 12 వ యేట అలంకార కృష్ణ విలాసము, 13 వ యేట జనకరాయనిబిడ్డ చరితము వ్రాసినట్లు తెలియుచున్నది. ఈ వ్రాత ప్రతిని ఇంకా బాగా పరిశీలించాలి.

సీతాపతి శతకము

శతక కవుల చరిత్రలో మఱింగంటి సింగరాచార్యులు శీర్షిక క్రింద—'సీతాపతి శతకము' ఉదాహరింపబడియున్నది. ఇందు కవి రామకథకు సంబంధించిన గ్రంథాలనేకములు శోధించి రాముని మానవత్వమును ఖండించి దివ్యత్వమును స్థాపించి నట్లా పద్యములు తెలుపుతున్నవి.

మ. మును రామానుజమౌళిగాంచి యటుపై మోదంబు జేకూర భ
ర్త నిరీక్షింపుచు సాధు భట్ట గురుమూర్ధన్య న్మఱింగంటి మం
చనయోక్తిన్మము గన్న రంగపతివై యారూఢి రక్షింపుమీ
యనవద్య ప్రతిభాధురంధర యయోధ్యారామ సీతాపతీ.

ఈ శతకమున తాటక హరణ హేతు నిర్ణయ సంచకము, రామ జన్మ హేతుత్రయమ్, వాల్మీకి రామాయణె, ఉత్తర రామాయణె, బ్రహ్మ వాక్యమున కర్థము—అను శీర్షిక లున్నవి.

ఈ గ్రంథం 262 పుటలో "(16) శ్రీ కృష్ణ శతానందీయం?" అని యా గ్రంథకర్తృత్వాన్ని గూర్చి ప్రశ్నార్థక చిహ్నమున్నది. అయితే అది సింగరాచార్యులదేగాని మఱియొక రిది కాదు. అందలి మొదటి పద్యము

శ్రీ కమలాపయోధర విశిష్ట మృగీమదలిప్తసౌష్ఠవా
లోక విలోకనంబులను లోకము లెల్లను బ్రోచునట్టి య
స్తోకత శేష శైలపతి చొప్పున సిర్పనగండ్లనుండు మా
శ్రీకరుడైన లక్ష్మి నరసింహుఁడు మమ్ములఁబ్రోచుగావుతన్.

అని యాతని యిష్ట దైవ స్తుతితో నున్నది.

తరువాత వంశ వర్ణన యున్నది. గ్రంథాంత గద్య:

ఇది శ్రీమద్వేంకట లక్ష్మి నృసింహవర ప్రసాద లబ్ధ కవితావిచిత్ర మౌద్గల్యసగోత్ర పవిత్ర వేంకట దేశిక పౌత్ర కుమార వెంకటాచార్య పుత్ర మఱింగంటి వేంకట నృసింహాచార్య ప్రణీతంబైన శ్రీ కృష్ణ శతానందీయము అను మహా ప్రబంధంబు నందు ద్వితీయాశ్వాసము. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక శాలలో తృతీయాశ్వాసములో కొంత భాగము కలదు. ఈ గ్రంథమును గూర్చిన విషయము డి. 473 సంఖ్య క్రింద 5 పుటలలో నున్నది

శబ్దాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణములో నీతడు 5 పద్యాలలో తాను రచించిన కృతులను వివరించాడు. వానితో నింతకుముందు వ్రాసినవి కలిపినచో నాతని కృతు లిట్లుండును.

9 వ యేట—1. వరదరాజ స్తుతి. 2. శ్రీరంగ శతకము
10 వ యేట—3. చెల్వపిళ్లరాయ చరిత్రము. 4. సుదర్శన నుతి. ఈ గ్రంథమున నిది 'చక్ర లాంఛన విధి' అని చెప్పబడినది.
11 వ యేట—5. కవి కదంబము. 6. నంద నందన శతకము.
12 వ యేట—7. శత సంహిత. 8. అలంకార కృష్ణ విలాసము.
13 వ యేట—9. రామకృష్ణ చరిత్ర—శ్లేష కావ్యము.
10. జనకరాయనిబిడ్డచరితము.
14 వ యేట—11. అష్టభాషాకృతులు.
15 వ యేట—12. నాటక శాస్త్రము.
16 వ యేట—13. ప్రేమాభిరామము. 14. ధనాభిరామము ద్విపదలు.
17 వ యేట—15. నల యాదవ రాఘవ పాండవీయము.
18 వ యేట—16. సకలాలంకారసంగ్రహము.
17. రసపుష్పగుచ్ఛము—అని కవి వ్రాసియున్నాడు. రసమంజరి యని యూహించుచున్నాను.
18. ఆంధ్ర భాషా భూషణము.
19 వ యేట—19. శబ్ద శాస్త్రము.
20 వ యేట—20. నిరోష్ఠ్య సీతాకల్యాణము.

వీని వెనుకనే నిరోష్ఠ్య దశరథ రాజనందన చరిత్ర వ్రాసినట్లు గద్యవలన తెలియుచున్నది. వీనిలో ముందు నేను వ్రాసిన—చిలువ పడిగ రాజానికత, సీతాపతి శతకము. శ్రీకృష్ణ శతానందీయము చేరలేదు. సింగరాచాప్యని కృతులను గూర్చి పరిశోధన మింకను జరుగవలసి యున్నది.

## అచ్చ తెలుగు కావ్య రచన

ఈనా డచ్చ తెలుగు కావ్య రచనకు—పొన్నిగంటి తెలగన్నయే ప్రథముడని యంద రంగీకరించిన విషయము. ఈ సంపుటంలో 141—148 పుటలలో తెలగన్న చరిత్ర యున్నది. అందాతడు గోలకొండ నవాబు ఇబ్రహీం కుతుబ్‌షా సరదారు అమీనుఖానుకు తన యయాతిచరిత్ర కృతి నిచ్చినందువల్ల ఇబ్రహీం కుతుబ్ షా కాలము వాడని స్పష్టపడుతుంది. తెలగన్న తన గ్రంథంలో (క్రీ. శ. 1550—1581) తనకు ముందెవ్వరూ అచ్చ తెలుగున కావ్యం వ్రాయలేదని—ఒక్క అచ్చ తెనుగు పద్యం కావ్యంలో ఉంటే ప్రజలు మెచ్చుకొనేవారని (1—12) వ్రాశాడు. ఈ సందర్భంలో ఒక ముఖ్య విషయం చర్చించవలసి యున్నది. నేను ముందు అచ్చ తెలుగు కావ్యములను రెండింటిని మరింగంటి సింగరాచార్యులు వ్రాసినట్లు నిరూపించియున్నాను. యయాతి చరిత్రలో నొక యాధారాన్నిబట్టి తెలగన్న సింగరాచార్యులు సమకాలికులే అగుచున్నారు. చూడండి—అమీనుఖానునకు కృతి నిమ్మని తనకు మొదట మరింగంటి అప్పనగారు తెలిపినట్లుగా ఆ కావ్యావతారికలో తెలగన్న యిట్లు వ్రాశాడు.

తనకున్నిచ్చలు మ్రొక్కు వారిని సిరుల్ దైవారఁగాఁ జల్లచూపున నెల్లప్పుడుఁ జూచి మన్నగల పెన్ప్రోడన్ మరింగంటి యప్పన గారిన్ మదిలోనిమాట తెలియం బాటింపుచున్‌గాంచినన్ గని యామేటి తలంపెఱింగి పొసగంగా నన్నుమన్నింపుచున్.

ఈ మరింగంటి అప్పనగారు తనకగ్రజుడైనట్లుగా సింగరాచార్యులు యిట్లు చెప్పాడు.

సీ. ''గురు రాజులచేత మ్రొక్కులు గొన్నట్టి
భగవత్స్వమానుఁ డప్పల గురుండు''

అని యా వెనుక వేంకటార్యనౌళి, నృసింహవిభుడు, కోనేటి రాయశౌరి, జగన్నాథసూరులను పేర్కొని—వారలగ్రజులుగాగ అని దశరథరాజనందన చరిత్రలో సింగరాచార్యులు చెప్పియున్నాడు.

సింగరాచార్యులు మల్కిభరాముచేత సన్మానితుడని తెలియుచున్నది. తెలగన్న సింగరాచార్యు లిద్దరు సమకాలికులైనప్పు డెవరు ముందు, ఎవరు వెనుక అనునది నిర్ధారణ కావలెను. సింగరాచార్యుల అచ్చతెనుగు రచనలు అంత ప్రౌఢముగా లేకుండుటచేత, అవియే ప్రథమమని, తెలగన్న వానిని చూచి ప్రౌఢముగా యయాతి చరిత్ర రచియించియుండునని నే హించుచున్నాను. ఎట్లయిన సింగరాచార్యుల రచనలు నిలిచియే యున్నవి.

## వేదాంతులు

పన్నెండుమంది వేదాంతులు— అను శీర్షికక్రింద యిచ్చిన వారంతా ఈ నవాబుల యుగంలోనే ఉన్నారని నిరూపించడ మెంతమాత్రమునూ సరికాదు. తెలుగులో వేదాంత గ్రంథ రచన యధావాక్కుల అన్నమయ్య లీలానందసర్వేశ్వర శతకంతో ప్రారంభమైనది. మడికి సింగన జ్ఞానవాసిష్ఠం వేదాంత గ్రంథమే. ఆత్మ సంబోధనతో, అద్వైత వేదాంత మార్గాన్ని శరభాంకుడు, భవదూరుడు, వటమూలుడు శతక రచనల మూలంగా ప్రచురం చేశారు. వేమన—తెలుగు వేదాంత వాఙ్మయంలో ముఖ్య ఘట్టం. వేమన కాలము. క్రీ. శ. 16 వ శతాబ్దపు ఉత్తరార్థ మెంతమాత్రమును కాదు—వేమనగూర్చి యీ సంపుటాల్లో వచ్చినప్పుడు—దాన్ని గూర్చి చర్చిస్తాను.

వేమన వెనుక తెలుగులో క్రీ. శ. 1500 నుండి వెలిసినది దత్తాత్రేయ సాంప్రదాయానికి చెందిన అద్వైత వేదాంత వాఙ్మయం—ఇది మహారాష్ట్ర దేశమునుండి వచ్చినది. ఈ సందర్భంలో క్రీ. శ. 1550, 1560 ప్రాంతాలలో దత్తాత్రేయ యోగి తెలుగులో రచించిన, వేదాంత సార సంగ్రహము, పరమానంద బోధ ప్రకరణము ఇందులో పేర్కొనబడలేదు.

275 పుటలో "అఖండసచ్చిదానందావధూత—ఈయన పురూరవ చరిత్ర అనే పద్య కావ్యం వ్రాశాడు. విషయం వేదాంతమే. ఈ పుస్తకంలో ఒక్క ఆశ్వాసం మాత్రమే లభించింది—(R 604) అని గ్రంథకర్తలు వ్రాశారు. కాని ఆ సంఖ్యలో ఉన్న గ్రంథంలో పద్యాలు కనుపర్తి అబ్బయామాత్యుని పురూరవ చరిత్ర (కవిరాజ మనోరంజనం)లో ఉన్నవి.

చ. వనమున నున్ననేమి గృహవాసము జేసిననేమి యాత్మ భా
వనయు నసంగ వృత్తి యరివర్గ జయంబును గల్గియుండినన్
వనముననున్ననేమి గృహవాసము జేసిననేమి యాత్మ భా
వనయు నసంగ వృత్తి యరివర్గ జయంబును లేకయుండినన్

ఇది ముద్రిత పురూరవ చరిత్రలో ప్రథమాశ్వాసం—151 వ పద్యంగా ఉన్నది.

ఇందులో పేర్కొన్న కవులు యోగసిద్ధిని గూర్చి వ్రాసిన విషయాలు—నన్నెచోడని కుమార సంభవమునాటి నుండి మహాకవులు వ్రాసినవే. పిల్లలమర్రి పినవీరన శృంగార శాకుంతలములో కుండలిని శక్తినే 'పాప కన్నె' అన్నాడు. అతడు 'వాణి నారాణి' అన్నది—నిర్నిద్రమైన యోగ శక్తిచేతనే అని మనము గ్రహించాలి. అదంతా గంభీరమైన విషయం. ప్రస్తుతం ఆ వేదాంతులలో కడపటివాడైన పరమానంద తీర్థులను గూర్చి ప్రస్తావిస్తాను.

పరమానంద తీర్థులు

పరమానంద తీర్థులను గురించి ప్రస్తుత గ్రంథంలో వ్రాసిన విషయాలు చూచినట్లయితే, గ్రంథకర్తలీతని రచనలను సరిగా పరిశీలింపనే లేదని స్పష్టమవుతున్నది. వీర శైవ వాఙ్మయానికి పాల్కురికి సోమనాథు డెట్టివాడో, పరమానంద యతి వేదాంత వాఙ్మయానికి అట్టివాడు. సోమనాథునివలె, దేశి సాహితీ ప్రక్రియల్లో గ్రంథాలు రచించి వేదాంతవాఙ్మయాన్ని విపుల ప్రచారంలోనికి తీసుకొని వచ్చాడు. అంతేకాదు. సోమనాథునివలె అఖండ ప్రతిభావ్యుత్పత్తులుగల విద్వాంసుడు. సోమనాథుడు శివ యోగి. పరమానంద యతి ఆత్మ యోగి. దత్తాత్రేయ సంప్రదాయానికి మూల పురుషుడు.

ఈతడు కేవలమూ దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయానికి సంబంధించిన కవి. దక్షిణ దేశంలో తంజావూరి మండలంలో ఉన్న చంపకారణ్య క్షేత్ర మీతని నివాస స్థలం. ఆ క్షేత్రములో వెలసిన దేవుడు రాజగోపాలస్వామి. ఆతనికి మన్నారు దేవుడని పేరు. ఆ దేవుని యాలయమున్న వూరి పేరు మన్నారు గుడి.[16] పరమానంద యతి వ్రాసిన సంపగిమన్నశతకమకుటమున కర్థము—చంపకారణ్య క్షేత్రమునగల మన్నారు దేవుడని. చంపక శబ్ద భవము సంపగి.[17] దీనినిబట్టిపరమానంద యతి యీ సంపుటములో నెంతమాత్రమును చేరడు.

ఈతని రచనలను గూర్చి యిట్లా వ్రాయబడియున్నది. "ఇతడు వ్రాసిన పుస్తకాలు పదకొండు ఉన్నాయి. అవి : (1) అనుభవ దర్పణం. (2) ఉత్తర గీతా వ్యాఖ్య. (3) ఉపదేశక్రమం. (4) గోపాల శతకం. (5) దత్తాత్రేయ శతకం. (6) పరమానంద శతకం. (7) బ్రహ్మ విద్యా సుధార్ణవం. (8) ముక్తి కాంతా పరిణయం. (9) వివేక చింతామణి. (10) శివజ్ఞాన సుందరి అనే ద్విపద కావ్యం. (11) సంపంగిమన్నశతకం—వీటిలో ఉపదేశ క్రమం, బ్రహ్మవిద్యాసుధార్ణవం వచన కావ్యాలు—" అని బ్రహ్మవిద్యాసుధావర్ణవంలో అవతారికనుండి కొన్నివాక్యా లుదాహరించారు. తరువాత 'శివముకుందపరమానంద' శతకము నుండి సంపగిమన్నశతకము నుండి ఉదాహరణ లీయబడ్డాయి. పైవానిని సాహిత్య ప్రక్రియలు మూలంగా వివరిస్తే వాని విశిష్టత బోధపడుతుంది.

శతకాలు

(1) సంపగిమన్నశతకము— ఈ శతకమున చివర పద్యంలో— "పరమానందయతీంద్రుఁడు — పరిపూర్ణుండైన నీదు భక్తుఁడు" అని కలదు. దీనివలన నీతడు పూర్ణసిద్ధి బొందినవాడైనా, భక్తిని ప్రబోధము చేశాడని తెలుస్తున్నది. ఇది మొదటి సారిగా క్రీ. శ. 1873 లో అచ్చయినది.

(2) దత్తాత్రేయ శతకము—ఇది యోగివరుల కానందముగా తన గురువైన దత్తాత్రేయుని పేర రచించినది. ఈ శతకము తెలుగు దేశమున చాలా ప్రచారంలో ఉన్నది. ఇందులో నున్న

"ఎంతదయో దాసులపై
పంతంబున మకరి పట్టి బాధింపగ శ్రీ
కాంతుండు చక్రమంపెను
దంతావళరాజుగాయ దత్తాత్రేయా"

అనే పద్యాన్ని పూర్వం పల్లెటూరి బడులలో పిల్లలకు వరవడి కుదర్చడానికి వ్రాయించేవారు.

(3) శివ ముకుంద శతకము—'శివ ముకుంద పరమానందా' అనే మకుటము. ఇందు కవి తనను ఆత్మ సంబోధన చేసికొన్నాడు. ఇదియు వ్యాప్తమైనదే. 'నేటికిని శివ గోవింద గోవిందా హర గోవింద గోవిందా' అనే తత్త్వపదానికిమూలం పై శతకమే.

పై పట్టికలో 4 వ ది 'గోపాల శతకం' అని యున్నది. అది ఏదో?

---

16. ఈ చంప కారణ్య క్షేత్రమునగల మన్నారుగుడియే దక్షిణ ద్వారకగా ప్రసిద్ధి కెక్కినది. చెంగల్వ కాళకవి రచించిన రాజగోపాలవిలాసము ఈ క్షేత్రమాహాత్మ్యాన్ని విశదీకరిస్తుంది.

17. సంపంగి శబ్దానికి—సంపఁగియు— సంపెగ—అను రూపాంతరాలున్నవి. పసిడిగిన్నియలోని సంపంగినూనె రసి. 4 ఆ; పెలుచ తన దాయయైన సంపెంగ నూనె— యయా; గడియించుకొని సంపెగలపైకి, విష్ణు—పూ. 2 ఆ—అని నిర్ధారక ప్రయోగాలు.

ద్విపదలు

(1) అనుభవ దర్పణము—అద్వైత వేదాంతాన్ని అనుభవ పూర్వకంగా వివరించేది. నాలుగాశ్వాసాల కృతి. గద్యలో తనను గూర్చి యిట్లు చెప్పుకొన్నాడు.

..............................
శ్రీమత్పరమహంస శ్రీపరివ్రాజ
కాచార్య శ్రీ పరమానంద తీర్థ
వాచానుధారన వర్ణితంబైన
యనుభవదర్పణంబను కృతియందు
ననుపదంబుగఁ జతుర్థాశ్వాసమయ్యె.[18]

(2) శివజ్ఞాన మంజరి—ఇదియు వేదాంత విషయకమే. పై పట్టికలో దీనిపేరు "శివజ్ఞాన సుందరి" అని యున్నది.

కాని యిది శివజ్ఞాన సుందరికాదు మంజరి. శివునిపేరున్నా ఇది అద్వైత గ్రంథం.

"అతి ముదంబున పర—మానంద తీర్థ
యతి నామ ధేయుండ—నింపు దలిర్ప
మహిత శివజ్ఞాన—మంజరి యనఁగ
మహిలోన ప్రాజ్ఞ—సమ్మతముగా నిపుడు
రచియించెదను లోకరక్షార్థముగను—

యక్షగానము—

ముక్తికాంతా పరిణయము

వివేక జీవుడు ముక్తికాంతనుఁ వివాహమాడిన కథ యక్ష గాన రూపంగా రచించాడు—

"అలరుచుఁ దగు బరమానందతీర్థ
యతి నామధేయు డాయత మోదమునను
చతురత ప్రౌఢిచే సజ్జనుల్ పొగడ
కరమొప్పగా ముక్తికాంతావివాహ
మరుదార పదచాళి కమరఁ జెప్పెదను—"

ఈ యక్షగాన కథావస్తువు గ్రహించి తరువాతి కవులు వ్రాశారు. వాని వివర లివి.

1. వివేక విజయము—చల్లా సూరయ కవి. ఇది నాటకము—వివేకజీవుడు ముక్తికాంతను పెండ్లి చేసి కొనుట అనునదే యితివృత్తం.

2. ముక్తికాంతాపరిణయము——వేగినాటి కొండయ ప్రణీతము. ఇది చంపూ కావ్యంగా మూడాశ్వాసాలలో రచితమైనది.

3. ముక్తికాంతావిలాసము——తరిగొండ వెంగమాంబ రచితము. ఇది యక్షగానము.

4. ముక్తికాంతాప్రియశతకము—ముమ్మిడి మల్లయోగి రచించినది. "ముమ్మిడిరాజా కృష్ణఘను మల్లా ముక్తి కాంతాప్రియా" అనే మకుటము. మత్తేభ శార్దూల వృత్తాలు.

పరమానందయతి యీ యితివృత్తాన్ని దత్తాత్రేయ వారి రచించిన 'జీవన్ముక్తిగీత' నుండి గ్రహించాడు. తరువాతి వారు అతన్ని అనుసరించారు.

ముద్రితాముద్రిత వివరణ

ముక్తికాంతాపరిణయము—పరమానంద యతి — 1956 లో ముద్రితం.

| | | |
|---|---|---|
| 1. వివేక విజయము— | అముద్రితం. | తం. పు. సంఖ్య 604—605 |
| 2. ముక్తి కాంతా పరిణయము | | మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక శాల సంఖ్య ఆర్. 801. |
| 3. ముక్తి కాంతా విలాసము | ముద్రితము. | పసల పార్థసారధి నాయని వారి విద్వన్మోద తరంగిణి ముద్రాక్షరశాలలో తే. 4-6-1869 దిని చెన్నపురిలో అచ్చయినది. |
| 4. ముక్తి కాంత ప్రియాశతకము | అముద్రితము | మ. ప్రా. లి. పు. సంఖ్య ఆర్. 981. |

వచన రచనలు

(1) బ్రహ్మ విద్యా సుధార్ణవము:—ఈ గ్రంథాన్ని గూర్చి—277వ పుటలో ఇట్లున్నది.'బ్రహ్మ విద్యాసుధార్ణవం... ఇది పదమూడు ప్రకరణాల అముద్రిత గ్రంథం.' ఇది సరికాదు. బ్రహ్మవిద్యాసుధార్ణవము—మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారిచే క్రీ. శ. 1952 లో ముద్రితమై ప్రకటింపబడింది.

(2) వివేకచింతామణి—ఇది మూడు పరిచ్ఛేదాలలోనున్న తెనుగు వచన గ్రంథం. పరిచ్ఛేదాంత గద్య యిట్లున్నది.

"ఇది శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ యతికృతౌ వివేకచింతామణౌ బ్రహ్మాండ ప్రపంచ భువన కోశ విస్తార వర్ణనం నామ తృతీయ పరిచ్ఛేదః"

పరమానందయతి గ్రంథమంతా తెలుగున వ్రాసినా గద్యలు మాత్రము సంస్కృతభాషలోనే వ్రాశాడు. ఇట్లే

18. తంజావూరి లైబ్రరీ—గ్రంథ సంఖ్య 293. పై రీతిని ద్విపదగా ముద్రితము కావలిసిన గద్య కేటలాగులో వచనముగా ముద్రితమైనది. చూ. పుట 85.

బ్రహ్మవిద్యా సుధార్ణవంలో కూడా సంస్కృత భాషనే గద్య యున్నది.

ఈ వివేకచింతామణిని కన్నడభాషలోనికి 16 వ శతాబ్ది యందున్న నిజగుణ శివయోగి అనువదించాడు.

> "శ్రీమదనంత సూరిజన సమ్మత దిందసవే వివేక
> చింతామణి యంబ సత్కృతియ........స
> త్ప్రేమ దొళుక్కు మిష్ట ఫలసిద్ధి సమున్నతి శంభులింగది
> కన్నడ................"

అని కన్నడ గ్రంథాంతమున గలదు. ఇది తెలుగున గ్రంథాంత మున నున్న పద్యమునకు కన్నడానువాదము.

(3) ఉపదేశక్రమము—ఇది విద్యారణ్యయతి ప్రణీత మైన వేదాంత వార్తికము అనే గ్రంథానికి ఆంధ్రానువాదము. చక్కని వ్యావహారిక వచనము. క్రీ. శ. 1873 లో అచ్చయినది. గ్రంథాంతమున

> 'పరమానంద యతీంద్రుడ
> స్థిర దత్తాత్రేయగురుని శిష్యుడ యోగ
> స్ఫురణానుభవుడ నీ కృతి
> సరసన్ రచియించినవాడ సర్వజ్ఞుడనై' అని

కలదు. దీనినే 'అక్షుతార్థోపన్యాసము' అను పేర చిద్ఘనానంద యతి శిష్యుడు సదాశివయోగి తమిళ భాషలోకి అనువదించాడు.

4. ఉత్తరగీతాటీక—ఇది మహా భారతంలో అశ్వమేధ పర్వాంతర్గతమైన ఉత్తరగీతకు అద్వైత పరముగా వ్రాయ బడినది.

ఈ యుగంలో వేదాంతులు కొద్దిగా ఉన్నా ఇది కేవలము ప్రబంధ యుగం. వెలుగోటి వారి చాటువులలో ప్రబంధాలను గూర్చి ఒక చాటువు ఉదాహరిస్తూ ఈ సమీక్ష ముగిస్తున్నాను.

> సీ. ధరనేలు నీ ప్రభుత్వము యయాతిచరిత్ర
> వరకీర్తి రాజశేఖరచరిత్ర
> వెలయు నీ శౌర్యంబు విక్రమార్కచరిత్ర
> ఘనమైన నీతి యా మనుచరిత్ర
> రూఢి నీ హరిభక్తి రుక్మాంగదచరిత్ర
> పొసగు నీ నిలయంబు వసుచరిత్ర
> నిత్యంబు నీ బుద్ధి సత్యధర్మచరిత్ర
> చెలగు నీ రూపంబు నలచరిత్ర
> గీ. ఇన్ని చరితలు నీ యందె యున్న విపుడు
> వసుధ నీ భాగ్యమెన్న నెవ్వారితరము
> పద్మనాయక వంశాబ్ధి భవ్య సోమ
> రంగఘనుయాచధీర విక్రమవిహార.

---

[సమగ్ర ఆంధ్ర సాహిత్యం, ఎనిమిదవ సంపుటము. రచయిత : శ్రీ ఆరుద్ర. వెల రు 5 లు. ప్రాప్తిస్థానము: ఎం. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాదు.]



# వల

## శ్రీ ఇస్మాయిల్

నవ్వుతూ నిలబడి వున్న నాన్న పక్కన అందమైన యువకుడు.

కొత్త చేప.

పాత ఎర.

''ఈయన ఇక్కడ కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్ రవి.....మా అమ్మాయి, రాణి.''

నాన్న పరిచయం చేశాడు.

''కూచోండి రవిగారూ.'' కుర్చీ చూపించాడు నాన్న.

''పరవా లేదండీ''

''అరె! సిగ్గుపడకండి! ఫీల్ ఎట్ హోమ్!''

అతను కూచున్నాడు.

నేను లోపలికి వెళ్లా.

మర్యాద చెయ్యాలి.

కాఫీ కాయాలి.

అందమైన అబ్బాయి వచ్చినపుడు కాఫీలో ఏదైనా మచ్చుమందు కలిపితే బావుంటుందంటాడు నాన్న.

చూపుల్తో ఉచ్చులు వేయాలి.

సెక్స్ అప్పీల్‌తో కట్టిపడవేయాలి.

సిగ్గుతో కత్తిదిగిన వాసంలాగ చీలిపోకూడదు.

గాలిపోయిన బ్లాడర్‌లాగ ముడుచుకుపోకూడదు.

నాన్న చాలా తెలివిగలవాడు. గారడీవాడిలాగ గాలిలో నుంచి పువ్వుల్ని సృష్టించగలడు.

తెలివివుంటే మాయలు చేయవచ్చునంటాడు నాన్న.

నాన్న చేసే మాయలు సాధారణంగా కాఫీతో ప్రారంభం అవుతాయి. ఉపయోగపడే ఏదో ఒకరకమైన వరస కలిసేదాకా వెళ్తాయి.

అందువల్ల కొందరికి నాన్న 'సుగర్ కోటెడ్ పిల్' అనే అభిప్రాయం వుంది.

ఇప్పుడు రవికి నేను చేస్తున్న కాఫీ ఒక రకంగా నా భవిష్యత్తుని నిర్ణయించాలి.

నేను చూసీ చూడనట్టు అతని వైపు చూడాలి. కాఫీ ఇచ్చేటప్పుడు అంటే అంటనట్టు అతని చేతివేళ్లు తాకాలి.

''మా రాణి కాఫీ బాగా చేస్తుందండీ'' అంటాడు నాన్న అప్పుడు.

అక్కడినుంచి నా గురించీ, నా అందం గురించీ అదీ ఇదీ మాట్లాడతాడు. కట్నాల మీద చిన్న ఉపన్యాసం ఇస్తాడు.

డబ్బు లేకపోతే ఏ అందానికైనా దాదాపు అర్థం లేనట్టే నన్న విషయం నాన్నకు తెలుసు. అయినా డబ్బుతో నిమిత్తం లేకుండా నన్ను చేసుకునే అబ్బాయి వస్తాడంటాడు.

కాఫీ డికాక్షన్ మరుగుతోంది.

కాఫీ గ్లాసు వెనక రహీం నీడ కనిపిస్తూ వుంది.

ఈ ఉంగరం నా బర్త్‌డే ప్రెజెంటుగా రహీం ఇచ్చిందే.

పుట్టినరోజున బట్టలేమిటని తన గదిలో, ఎలక్ట్రిక్ దీపం వెలుగులో నన్ను నగ్నంగా నిలబెట్టి, ముద్దుపెట్టుకుని, కౌగిలించుకుని, వేలికి తొడిగాడు రహీం ఈ ఉంగరాన్ని.

R. R. అని దాని మీద చెక్కివుంది.

"రాణీ రహీం" అనేవాడు.

నేనతన్ని నిజంగా ప్రేమించాను—నా మొదటి ప్రేమ.

నిజానికి నేను ప్రేమ అనుకున్నదాంట్లో విపరీతమైన కామం వుంది.

అతను కాలేజీలో ఉపన్యాసాల్లో మాట్లాడుతున్నా, నాటకాల్లో నటిస్తున్నా చూసిన ఆడపిల్ల నిద్రపోయే ముందు అతన్ని తలచుకోవాల్సిందే.

రహీం: ఆకర్షణ, అందం, ప్రజ్ఞ.

ఫ్రెండ్స్ ముందు నేను నిర్భయంగా చెప్పేదాన్ని: "ఓ! రహీం! ఐ లవ్ హిమ్. రహీం నా హీరో! నా ప్రిన్స్" అని.

గుండెల్లో ఆ మాటల్ని మడతపెట్టేసి పైకి అనలేనివాళ్లు నన్ను తెగించినదాన్నని అనేవారు.

నేను నిజంగానే తెగించా.

నేను అందమైనదాన్ని.

సెక్స్‌ని టెర్లిన్ చీరలో, జాకెట్లో బిగువుగా ప్యాక్‌చేస్తే అందం దానంతట అదే వస్తుంది. నేను అందంగా ఉన్నాననే విషయం నాకంటె ఎక్కువగా నన్ను చూసే మగవాళ్లకే తెలుస్తుంది.

నేను అందంగా ఉన్నానంటే సెక్సీగా ఉన్నాననే అర్థం. సెక్సీగా లేకపోతే అందమేలేదు. రహీం అదే మాట అనేవాడు.

రహీం భీష్ముడు కాదు.

ఆడదాని ముందు ముఖ్యంగా అందమైన ఆడదాని ముందు మగవాళ్లు బలహీనులే.

నేను రహీం వెంటపడ్డాను. అతన్ని వేటాడాను. ప్రేమలేఖలు రాశాను.

అతను ఎక్సెప్షనల్ స్పెసిమన్ కాదు.

లొంగాడు.

నాన్నకు ఈ విషయం తెలియనివ్వలేదు.

రహస్య ప్రణయంలో ఆనందం వర్ణనాతీతం.

స్టోలెన్ కిసెస్ ఆర్ స్వీట్.

చదువుకునే ఆడపిల్లని నేను. నాకు ఆ రకంగా కొంత స్వేచ్ఛ.

నాన్నకు ఒక్కతే కూతుర్ని, తల్లిలేనిపిల్లని—అట్లా ఇంకొంత స్వేచ్ఛ.

మేం ఉండేది హైద్రాబాదులో—ఆరకంగా కావలసినంత స్వేచ్ఛ.

ఇటువంటి స్వేచ్ఛను ఎంట్లాఉపయోగించుకోవచ్చునో రహీంని ప్రేమించినప్పుడు తెలిసింది.

ఫ్రెండ్స్‌తో సినిమాకు వెళ్తున్నానని చెప్తే నాన్న నమ్మేవాడు. నా మీద నాన్నకి నిజంగా చాలా నమ్మకం.

నాన్నకి అప్పుడు ఇప్పుడున్న తెలివితేటలూ లౌక్యంలేవు. ఒకవేళ వున్నా వాటిని ఉపయోగించాల్సిన అవసరం లేకపోయింది.

రహీం గదికి వెళ్లేదాన్ని.

ఇప్పుడనిపిస్తోంది — గర్భనిరోధకసాధనాలు ప్రేమను ఎంత పవిత్రం చేస్తాయో.

"ఐ లవ్యూ."

"నువు లేకపోతే నేను బతకలేను."

"నువు నా ఆరాధ్యదేవతవి."

రహీంచేతుల్లో నేను వంకరటింకర వాలులోకి పరుగెత్తే నీటిలా అయ్యేదాన్ని.

అతన్ని ఎంత ప్రేమించినా నా భయం నాకుంది.

ఆడదాన్ని మరి.

ఇండియాలో ఆడదాన్ని, సంకెళ్లు వేసుకుని స్వేచ్ఛగా తిరిగేదాన్ని, ఏం చేయడానికీ వీలులేనిదాన్ని.

ఆ విషయం చెప్తే నవ్వేవాడు రహీం.

గర్భనిరోధక సాధనాల గురించి చెప్పాడు.

లూప్స్! కండోమ్స్! ఎఫ్బెల్స్! పిల్స్!

భయం లేదన్నాడు.

ఇద్దరం పెళ్లి చేసుకునేంతవరకూ వాటిని ఉపయోగించవచ్చు, చదువులుపూర్తి అయిన తర్వాత, ఇద్దరం ఉద్యోగాలు చూసుకున్న తర్వాత పెళ్లి చేసుకుందామన్నాడు. ప్రేమవివాహాలకు డబ్బు ఊత

కావాలి, డబ్బు సంపాయించేంత వరకూ గర్భనిరోధక సాధనాలు వాడవచ్చునన్నాడు.

నేను ఎంతగా సంతోషించానో!

మోడరన్ సైన్స్ మనిషికి ఎంత చక్కగానో ఉపయోగపడుతున్నదనుకున్నా.

అతనికి సైన్స్ గురించి, సెక్స్ గురించీ—అన్నీ తెలుసు.

''రాజా! నీ స్పర్శలో స్వర్గం వుంది.''

''రహీం! ఇంకా, ఇంకా! కౌగిలించుకో.''

''ఎంత కౌగిలించుకున్నా ఇద్దరిమధ్యా దూరం అంతరించదేమిటి?''

''ఎంత మంచివాడివి రాజా నువ్వు.''

''చైనా గోడలాగ ఇద్దరి మధ్యా ఈ చీర ఎందుకు?'' అనేవాడు.

''గోడని పడగొట్టనా!''

నవ్వుకునే వాళ్లం.

వెలుగులో ఆడం అండ్ ఈవ్‌లు చేసిన మొదటి పాపం.

తర్వాత ట్రాన్సిస్టర్ ఆన్ చేసి, ఏదో సంగీతం వింటూ, 'లైఫ్' చూస్తూ, కాడ్బరీ చాక్లెట్లు తినే వాళ్లం.

ఆడదాన్ని రహస్యంగా అనుభవించే మగవాడు, ఆడదానికి గర్భం రాకుండా చేస్తే మంచివాడుకాక ఏమవుతాడని ఇప్పుడనిపిస్తోంది.

అప్పుడు—గర్భనిరోధక సాధనాల గురించి ఎంతో గొప్పగా రాసుకున్నాను డైరీలో. ఆ డైరీని రేపోమాపో తగలెయ్యాలి.

దాన్లో నా గతం జీవసమాధి చేసుకుని వుంది. దాన్లో నేనూ, రహీం ఉన్నాం.

'లేడీ చాటర్లీస్ లవర్', 'ట్రోపిక్ ఆఫ్ కాన్సర్' 'మైదానం' ఉన్నాయి.

రహీం, రాత్రులు, నేనూ, గది, మంచం తృప్తి—అన్నీ ఉన్నాయి.

మా ఇద్దరి ప్రేమ పవిత్రమైన ప్రేమ. గర్భనిరోధక సాధనాల్లో పునీతమైన ప్రేమ. నా ఆనందం, నా ధైర్యం, నలుగురి ముందూ అమాయకంగా నటించే అవకాశం వున్న ప్రేమ మాది.

ఇటువంటి ప్రేమ చిన్న ట్విస్ట్‌డాన్స్ చేసింది.

వినాయకచవితి నాడు స్నేహితులతో సినిమాకు వెళ్తున్నానని నాన్నకు చెప్పి రహీం గదికి వెళ్లాను.

గదిలో ఎలక్ట్రిక్ దీపం వెలగడంలేదు. ఏదో చెడిపోయిందన్నాడు రహీం. చిన్న కొవ్వొత్తి టేబుల్ మీద వెలుగుతోంది.

''కొవ్వొత్తి వెలుగులో ఎంతో బాగున్నావు రాణీ!'' అన్నాడు.

నేను నవ్వాను.

అతని ఒళ్లో పడుకున్నాను.

అతని పెదాల మధ్య చార్మినార్ కాలుతోంది.

పొగను నా మొగం మీదికి ఊదాడు. మొగం మీది నుంచి పొగ నా రొమ్ముల మీద మెల్లగా, కొండల మీద తెలిపోయే మేఘాలలాగ తేలిపోయింది.

ఇద్దరం నవ్వుకున్నాం.

బీహైవ్ బ్రాందీ తీశాడు.

ఇద్దరం తాగాం.

సాల్ట్ బిస్కట్లు తిన్నాం.

కొవ్వొత్తి ఆరిపోయింది.

సిగరెట్‌ని గది మూలకు విసిరేశాడు రహీం.

కొవ్వొత్తి వెలిగిస్తా నన్నాడు. వద్దన్నా. అతన్ని దగ్గరకు లాక్కున్నా.

మా ఇద్దరి శరీరాల్లాగ గదిమూల చార్మినార్ ఎర్రటి వెలుగూ, గదిలో చీకటీ ఒరుసుకుంటున్నాయి.

చీకటిలో నగ్నంగా మేము.

ఆడమ్ అండ్ ఈవ్ ఆక్షణంలో తమ దేవుణ్ణి మర్చిపోయారు. గర్భనిరోధక సాధనాల విషయం ఎవ్వరం పట్టించుకోలేదు.

ఆవేశం—

అవకాశం—

నిశ్శబ్దం—

చీకటి—

స్త్రీకణం—

పురుషకణం—

సంయోగం—

ఫలితం: 'పాపం' నాలో వెలిగించిన దీపం.

భయపడ్డాను.

భయం లేదన్నాడు రహీం.

ఏవేవో మాత్రలు ఇచ్చాడు. లాభంలేకపోయింది.

గర్భనిరోధక సాధనాలు చూపించి, రహస్యమైన అక్రమ సంబంధాలకు ఒకరకంగా ప్రోత్సాహాన్నిచ్చిన సైన్స్, తీరా గర్భం వచ్చినప్పుడు దాన్ని సునాయాసంగా విచ్ఛిన్నం చేయడానికి, ఏ జెడదా లేకుండా ఉండడానికి ఎందుకు వీలు కల్పించలేదో!

నిజంగా నాకు సైన్స్ మీద కోపం వచ్చింది.

**రహీం** మీద కోపం వచ్చింది—గర్భనిరోధక సాధనాల్ని వాడనందుకు.

నాన్న మీద కోపం వచ్చింది—నన్ను మందలించకుండా స్వేచ్ఛగా తిరగనిచ్చినందుకు.

ఏం చేయాలో తోచలేదు.

నాన్నకు చెప్పాలనుకున్నా. భయం వేసింది.

ఐదు నిముషాల ప్రమాదంలేని తృప్తిముందు అంతకుముందు ఎన్నో భయాలనీడలు, ఆటంకాల కంటకాలూ మటుమాయమయ్యాయి.

ఇప్పుడు ఐదు నిముషాల తృప్తివల్ల కల్గిన ఫలితం, అప్పుడు మాయమైపోయిన భయాల్ని మళ్లీ ముందు నిలబెట్టింది.

సముద్రంలో లోతుకు మునిగిపోయినట్టున్న నన్ను ఈ భయాలు ఆక్టోపస్‌లాగ చుటుకున్నాయి. ఊపిరాడకుండా చేశాయి.

ఏవేవో సందేహాలు స్కైస్క్రేపర్స్‌లాగ నామీద నిలువుగా పెరిగాయి. తర్వాత. ఒకరోజు హఠాత్తుగా నేను భయాల మాంసంముద్దనైపోయాను. దారిలో లారీ కింద పడ్డాడు రహీం. చచ్చిపోయాడు.

అప్పుడు నాకు మూడోనెల.

చచ్చిపోవాలనుకున్నా.

ఇప్పుడు రవి కోసం కాఫీ కాస్తున్న స్టౌలో అప్పుడు కిరసనాయిలు పోస్తూ, కొంచెం కాళ్ల మీద పోసుకుని, అగ్గిపుల్ల గీసి కాలి దగ్గరపెట్టి చూశాను. ఏం తెలీలేదు. అయినా చావడానికి ధైర్యం చాలలేదు.

అందమైన ప్రపంచంతో అనుబంధం. సహజంగా చచ్చిపోయేంతవరకూ బతకాలనే ఆశ. దాని వెనక భయం.

ధైర్యంచేసి ఎట్లాగో నాన్నకు చెప్పేశాను.

నాన్నకు నోటమాట రాలేదు.

నిశ్శబ్దంగా, గంభీరంగా ఏడ్చాడు నాన్న.

నాకు **రహీం** మీద విపరీతమైన కోపం వచ్చింది.

నాకీ గర్భం రాకుండా వుండి **రహీం** చచ్చిపోయి వుంటే నేను అంతగా బాధపడేదాన్ని కాదేమో.

నాకీ గర్భం వచ్చి రహీం బతికే వున్నాగాని అంతగా బాధపడేదాన్నీకాదు.

చచ్చిపోయిన **రహీం** గురించి నిజంగా నాకే బాధలేదు. ప్రాణంతో వున్న నాగురించే నా బాధ. నా గర్భంలో ప్రాణం పోసుకున్న అండం గురించి బాధ.

నాన్న నన్ను హైదరాబాదు నుంచి విజయవాడ తీసుకువచ్చేశాడు. నన్ను బొట్టు పెట్టుకోవద్దన్నాడు. విధవలా కన్పించాలి నేను. తప్పదుమరి.

తెల్లచీర, తెల్లజాకెట్టులో అందంగానే వుండే దాన్ని నేను.

"మా అల్లుడు లారీ కిందపడి చచ్చిపోయాడు.. అమ్మాయికి నాలుగోనెల. ఏం చేస్తాం...విధి." అని ఇంటికి వచ్చిన ఎవరితోనో నాన్న అంటుంటే ఒకసారి విన్నాను.

నవ్వొచ్చింది.

నాన్న నటిస్తున్నాడు. అందంగా నటిస్తున్నాడు.

తొమ్మిదోనెల రాకముందే నేను ప్రసవించాను.

చచ్చిపోతానని భయంవేసింది. చచ్చిపోయిన పిల్లాడు పుట్టాడు.

చెడిన ఆడదైనా తనుకన్న పిల్లాడిని ఎంతో ప్రేమతో చూస్తుందట. నాకు అటువంటిదేం అన్పించలేదు.

చచ్చిపోయిన పిల్లాడి మొహం చూశా.

నిన్నటి డైలీపేపరు హెడ్డింగుని ఇవాళ చూసి నట్టుంది.

వాడు చచ్చిపుట్టినందుకు నిజంగా నాకెంతో సంతోషం అన్పించింది. వాడు కనక ప్రాణంతో పుట్టి వుంటే నేను చచ్చినంత పని అయ్యేది.

సంఘం ఆమోదించే పద్ధతుల ప్రకారం నాకు పెళ్లిజరిగివుంటే ఇట్లా చచ్చిపోయి పుట్టిన పిల్లాడి గురించి ఏవిధంగా ఆలోచించి ఉండేదాన్నో ఊహించి చూశా. ఏం అనిపించలేదు.

కాఫీ తయారు చేశా. తీసుకువెళ్లి రవికి ఇచ్చాను. తాగాడు.

స్టీలుగ్లాసు లాగ నున్నగా అందంగా ఉన్నాడు రవి. అందమైన ఫేబర్ పేపర్ బ్యాక్ అట్టలాగ అమాయకంగా నవ్వుతున్నాడు, చూస్తున్నాడు.

''ఈ సెప్టెంబరులోనైనా అమ్మాయి గ్రూప్ పూర్తిచేస్తే బి. ఏ డిగ్రీ ఒస్తుంది. తర్వాత ఏదైనా ఉద్యోగం చూసుకుంటుంది. ఈ మార్చికి రాణీ ఇంగ్లీషు పాస్ అయ్యేట్లు చెప్పాలి.'' అన్నాడు నాన్న.

''ఆయన పాస్ అయ్యేట్లు చెప్పినా, పాస్ అయేట్లు నేను రాయొద్దూ!'' అన్నాను.

రవి నవ్వాడు.కొంచెంసేపుపిచ్చాపాటీ మాట్లాడిన తర్వాత మరుసటి రోజు పాఠం చెప్పటానికి వస్తానని చెప్పి వెళ్లిపోయాడు.

అతను వెళ్లిపోయిన తర్వాత నాన్న చిరునవ్వు నవ్వాడు. నాన్న చిరునవ్వు వెనక ఎంతో అర్థంవుంది. అప్పుడప్పుడు నాన్న నాకుచెప్పిన విషయాలన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఆ చిరునవ్వుని చూసిన తర్వాత.

కాపిటలిజం గురించీ, కమ్యూనిజం గురించీ నాన్నకు బాగా తెలుసో తెలియదో నాకు తెలియదు. నా టెక్స్టులలో కమ్యూనిష్టు సిద్ధాంతాల గురించి చదువుకున్న విషయాల చాయలు నాన్న చెప్పేమాటల్లో కనిపించేవి.

సంఘం గురించి, సంఘంలోని వ్యక్తుల గురించి నాన్న ఆలోచనలో అంత మార్పు రావడానికి కారణం నేనేనని నాకు తెలుసు. నాన్న ఇప్పుడు ఎన్నో సమస్యల్ని, వాటివల్ల కలిగే ఫలితాల్ని నాకు అంతకు ముందు జరిగిన ''అన్యాయం''దృష్ట్యానే చూస్తున్నాడు.

''ప్రస్తుతం మన సంఘం డబ్బుకి ఇచ్చే విలువ ఇంక దేనికీ ఇవ్వడంలేదు. డబ్బు సంపాయించే పోటీలో గొప్ప దోపిడీ, దగా ఉన్నాయి. ఇవి చేయడానికి తెలివి కావాలి. తెలివిగా, తేలిగ్గా డబ్బు సంపాయించాలి. డబ్బు పునాదుల మీద నిలబడిన సంఘం ఇది. మనకి డబ్బులేదు. తెలివివున్నా మనం డబ్బు సంపాయించలేం. అవకాశాలు లేవు.''

ఆడపిల్ల తండ్రి అసలు డబ్బు సమస్యను పట్టించుకోవలసిన అవసరం ఎందుకు వచ్చింది? మనది ఫ్రీ సొసైటీ కాకపోవడంవల్ల. అట్లా అయితే ఏమ య్యేది? అబ్బాయిలకి, అమ్మాయిలకీ స్వేచ్ఛ ఉండేది. వాళ్లు ప్రేమించుకోడానికి, పెళ్లి చేసుకోడానికీ అవ కాశాలు ఉండేవి. అట్లా జరిగినప్పుడు భగ్నప్రేమి కులుగాని, అక్రమసంబంధాలవల్ల పుట్టిన పిల్లలు గాని అంతగా ఉండేవాళ్లు కారు. అన్నిటినీ మించి కట్నాల సమస్య ఉండనే ఉండదు. ఎందుకంటే పెళ్లిళ్లు కుటుంబ యాజమాన్యంవున్న పెద్దవాళ్ల నిర్ణయంతో కాకుండా, స్వేచ్ఛగావున్న యువతీ యువకుల స్వచ్ఛంద నిర్ణయంతో జరగడంవల్ల. ఇటు వంటి మార్పు ఎప్పుడు వస్తుందంటే పారిశ్రామిక విప్లవం యొక్క ప్రభావం బాగా విస్తృతమైనప్పుడు. అప్పుడు కుటుంబం వ్యక్తిగత యాజమాన్యం కలదిగా కాక, స్త్రీపురుషుల మధ్య స్వచ్ఛందమైన, సమాన మైన మైత్రిగా మారుతుంది. అప్పుడు ఒకఅమ్మాయి గాని, అబ్బాయిగాని స్వేచ్ఛగా ప్రేమించుకోడానికి అవకాశం ఉంటుంది. ఒకణ్ణి ప్రేమించిన అమ్మాయి వాణ్ణి కాదని మరొకణ్ణి చేసుకోగలదు. ఒకణ్ణి చేసు కున్న అమ్మాయి వాణ్ణి విడిచి మరొకణ్ణి చేసుకో గలదు. అంటే నైతికమైన విషయాల్లో, ఆడదాని శీలం విషయంలో ప్రస్తుతం వున్న దురభిప్రాయాలు మారాలి. పారిశ్రామిక విప్లవంపూర్తిగా జరిగినప్పుడు ఈ మార్పులు వస్తాయి. పారిశ్రామిక విప్లవం రాక

ముందు, ఇప్పుడు పారిశ్రామికంగావృద్ధిపొందిన దేశాలు ఒకప్పుడు ఇటువంటి స్టుపిడ్ సెంటిమెంట్లకీ, ఫాల్స్ ఐడియాస్ అఫ్ చేస్టిటీకి స్థానం ఇచ్చినవే. కాని పారిశ్రామిక విప్లవ ప్రభావం క్రమంగా పెరుగుతూ ఫ్యూడల్ విధానాలూ, ఫ్యూడల్ ఆలోచనలు మాసి పోతుంటే కొన్ని కొత్త విలువలు వచ్చాయి. ఫ్రీ సొసైటీ వచ్చింది. నైతిక విషయాల్లో కొత్త విలువలు వచ్చాయి. ఫ్రీ సొసైటీలో ఆడది ప్రేమి స్తుంది. అది తప్పుకాదు. ప్రేమించిన వాణ్ణి కుల మతాల ప్రసక్తి లేకుండా పెళ్లి చేసుకుంటుంది. అదీ తప్పుకాదు. ఆ ప్రేమికుల మధ్యకానీ, వివా హితుల మధ్యకానీ డబ్బు అడ్డురాదు. కాని వివాహేతర సంబంధాలు వుంటే మాత్రం తప్పే అనాలి. అటు వంటి సంబంధాలకు తెరకాదు పెళ్లి. పరస్పర రక్షణ కోసం, అనురాగం కోసం పెళ్లి. అందువల్ల వివాహ బంధంలో కొన్ని నైతికమైన విలువలు అవసరం.'

"సరే! ఒకమ్మాయి విడాకులు ఇచ్చింది. మళ్లీ పెళ్లి చేసుకునేలోపు ఆ అమ్మాయి ఎవరి నైనా ప్రేమించవచ్చు. ఇంకెవరినో పెళ్లి చేసుకో వచ్చు. అంతమాత్రాన ఆ అమ్మాయి 'చెడిపోయింది' అని, 'పెద్ద చెయ్యి' అని అననవసరంలేదు. అది ఫ్యూడల్ సొసైటీకే చెల్లుతుంది. ఇండస్ట్రియల్ సొసైటీలో ఇట్లా ఉండదు. ఇట్లా కాకుండా వుండి, స్త్రీ పురుషులకు వారి వారి శీలాల విషయంలో సందేహాలుంటే ఎవరికీ పెళ్లికాదు. ఇట్లా అను మానాలవల్ల, శీలం విషయంలో దురభిప్రాయాల వల్ల పెళ్లి కాకపోవడం మన సంఘంలోనే జరుగు తుంది. కారణం—మన కుటుంబాలు వ్యక్తి యాజ మాన్యంక్రింద ఉండడంవల్ల, మనది ఫ్రీ సొసైటీ కాకపోవడంవల్ల. ఇక మామూలుగా సాంప్రదాయ సిద్ధంగా పెళ్లి జరగాలంటే కట్నం కావాలి. కట్నం వెనక ఎంతో బాధ, మోసం, కన్నీళ్లూ. ఇటువంటి సాంఘిక వ్యవస్థలో ఆడది చెడిపోకతప్పదు. కాని, ఆడది చెడిపోకూడదనే అర్థంలేని సాంఘికమైన కట్టుబాట్లు మళ్లీ. ఇటువంటి సాంఘిక వ్యవస్థలో డబ్బులేని ఆడపిల్లతండ్రి ఆడపిల్లకు పెళ్ళి చేయడం కష్టం. అటువంటప్పుడు ధైర్యంతో ఆడపిల్ల ఎవరినైనా ప్రేమించి, ఎక్కడికైనా లేచిపోయి పెళ్లి చేసుకోవాలి. లేదా—ధైర్యమూ, తెలివీ, తెగింపూవుంటే, కూతురి పెళ్లిచేయాలనే కోరిక వుంటే తండ్రి అటువంటి ఏర్పాటుచేయాలి. నేను నీకు అటువంటి అవకాశం కల్పిస్తాను. నువ్వు అంతకుముందు ఎవర్నో ప్రేమించావు. నీకు ఉపయోగపడేది ఏమీ జరగలేదు. ఇప్పుడైనా నీకు నచ్చినవాడు, నిన్ను చేసుకోగలవాడు ఎక్కడైనా కన్పిస్తే ప్రేమించు. అభ్యంతరంలేదు. అయితే నా ప్రయత్నం కూడా నేను చేస్తాను.'' అని అనేవాడు నాన్న.

నాన్నకు ఒకే బిగిని ఉపన్యాసం ఇచ్చినట్లు మాట్లాడ్డం చేతకాదు.

వేరు వేరు చోట్లనుంచి ఎగిరివచ్చి ఒకే చెట్టు మీద కూచున్న నాలుగు పక్షుల్లాంటివి నాన్న చెప్పిన మాటలు. ఎప్పుడైనా తీరిగ్గా కూచుని, నాతో మాట్లాడేటప్పుడు ఇవన్నీ ముక్కలు ముక్కలుగా చెప్పేవాడు. నాన్న చెప్పిన మాటల వెనక సోషలిస్ ఐడియాలజీ ఉందని నాకు తెలుసు.

నలభై ఏళ్లకే సాధారణంగా స్టుపిడిటీ వచ్చే మనుషులున్న దేశంలో, నడి వయస్సులోవున్న నాన్న ఇంత రాడికల్‌గా ఆలోచిస్తాడనీ, తన ఆలోచనల్ని తెలివిగా సమర్థించుకుంటాడని నేను అంతకుముందు అనుకోలేదు.

నాన్న నాకు పెళ్లి చేయాలనుకుంటున్నాడు. ఆ పెళ్లి పందిరికింద, బాజాలమధ్య, బ్రాహ్మణుడి మంత్రాలతో, అగ్నిసాక్షిగా జరగాలనే కోరికా, పట్టుదలా నాన్నకూ లేవూ, నాకూ లేవు. రిజిస్టర్ మ్యారేజు జరిగితే చాలు. అది పదివేలు.

ఈ అభిప్రాయాల్తో నాన్న నా ఉద్యోగంకోసం నన్ను పెళ్లి చేసుకునేట్లు చేయగలవాడికోసం వల వేస్తున్నాడు. ప్రయత్నాలు చేస్తున్నాడు.

నాన్న ప్రయత్నాలవల్ల దొరికిన వ్యక్తి రవి.

మరుసటి రోజు రవి నాకు ట్యూషన్ చెప్ప డానికి వచ్చాడు. ఆ తర్వాత—అతను వచ్చేవేళకి అందంగా ముస్తాబై కూచునే ధాన్ని.

లోనెక్ తెల్లవాయిల్ పొట్టి జాకెట్, ఎర్రంచు తెల్ల చీర — నోకంప్లైంట్ 'బ్రా' లు కంటి చివర్లదాకా కాటుక—కనుబొమ్మలకి పునుగు..... సెక్స్ అప్పీల్.

నాన్న అప్పుడు వచ్చేవాడు కాడు.

రవి ముందు కూచుని పాఠం వింటూ మత్తుగానో, చిలిపిగానో, కవ్వింపుగానో అతనివైపు చూసేదాన్ని. ఒకవైపు రొమ్ము కనిపించేట్టు పమిటను విడిచేసేదాన్ని. చేతులు రెండూ బాగా దగ్గరకు చేర్చి, కాస్త ముందుకువంగి కూచునేదాన్ని. అప్పుడు రొమ్ములు దగ్గరై ఒరుసుకుంటూ, లోనెక్ కింద నుంచి 'బ్రా' ల ఒత్తిడికి అందంగా పైకి ఉబికేవి.

రవి చూసీ చూడనట్టుగానే చూసేవాడు. అతను చెప్పే మాటల్లో తడబాటు కన్పించేది. నేను ఇదేం పట్టించుకోనట్టే కూచుని ఉండేదాన్ని.

నాకు ట్యూషన్ చెప్పడానికి వచ్చిన పది పదిహేను రోజుల తర్వాత రవి స్కూటర్‌మీద వచ్చాడు.

ఇప్పటి ఆడపిల్లలు ముందు అబ్బాయిని కాకుండా, అతను తెచ్చిన స్కూటర్‌నో, కారునో, దాని వెనకవున్న డబ్బునో ప్రేమిస్తారనే విషయం రవికి తెలుసు. నాకూ తెలుసు.

అతనిలో ఇంకా స్పష్టంగా కన్పించనిమార్పు నాలో ఏదో నమ్మకం కల్గిస్తోంది. ఈ విషయం చెప్పినప్పుడు నాన్న నవ్వేవాడు.

"నువు అందమైన దానివమ్మా! రష్యన్ రాకెట్టు నీ చుట్టూ ప్రదక్షిణం చేసినా, చంద్రుడి చుట్టూ ప్రదక్షిణం చేసినా ఒకటే" అనేవాడు నాన్న.

నాకు గర్వం అనిపించేది.

ఎవరూ లేనప్పుడు అద్దం ముందు నగ్నంగా నిలబడేదాన్ని. కాన్పువల్ల బిగి సడలిపోయిందేమో నని రొమ్ములు తడుముకునే దాన్ని.

రహీం జ్ఞాపకం వచ్చేవాడు.

"పిరమిడ్లు ఈజిప్ట్‌లో లేవు, నీ ఛాతీమీద ఉన్నాయి" అని రొమ్ములమీద చూపుడువేలితో రాణీ—రహీం అని రాసేవాడు.

కన్పించని అతని చేతుల స్పర్శ ఇప్పుడు ఒంటిమీద పాకినట్లుంది.

"ద్విపుట కటకంలాంటి నడుం, యాబ్—స్ట్రాక్ట్‌లాంటి కళ్లు" ఇట్లా ఏమి టేమిటో అనే వాడు.

నా 'బ్రా' లని ముద్దు పెట్టుకొని, పచీరను గుండెలకు అదుము కునేవాడు. తానే స్వయంగా నాకు 'బ్రా'లు వేసి, జాకెట్ తొడిగేవాడు. "చీర నాకు కట్టడం రాదు రాణీ" అనేవాడు. చీర నేనే కట్టు కునే దాన్ని.

ఇప్పుడు చీరతీసి నగ్నంగా నిలబడితే పిచ్చెక్కి పోతున్నట్టుంది.

రవి ముందు కూడా నేనిట్లా నిలబడాలి.

కాని రవి ఎందుకో భయపడుతున్నట్టు, తను నన్ను ప్రేమిస్తున్నాడని అంటే నే నేమం టానో అనే జంకు అతనికి ఉన్నట్లు అనిపించింది నాకు.

ఒకరోజువ ఏదోమాటల్లో అడిగాను!.

"మీ పెళ్లెప్పుడు?"

రవి నవ్వాడు.

"నవ్వినప్పుడా?" అన్నాను నవ్వుతూ.

"ఎవరు?"

నిజంగా నేను సిగ్గుపడ్డాను.

"నాపెళ్లి విషయం ఎందుకుగాని, మీ పెళ్లి విషయం చెప్పండి." అన్నాడు.

నేను నవ్వాను. "నన్నెవరుపెళ్లిచేసుకుంటారు?" అన్నాను.

"అదేమిటి! మిమ్మల్ని చూస్తే ఎవడైనా పెళ్ళి చేసుకుంటా నంటాడు."

"నన్ను చూస్తే అంటాడేమోకానీ, నేను నిజంగా వున్న స్థితిని చూస్తే అనడు."

"చేసుకునేవాడు మిమ్మల్నిగాని, మీ స్థితిని కాదుగా."'

"అందరికీ మీలాంటి అభిప్రాయాలే ఉంటా యంటారా?"

అతనేం మాట్లాడలేదు. అతన్ని మాటల్ని బట్టిచూస్తే అతనిమెదడులో నా గురించి ఎటువంటి ఆలోచనలు రేగుతున్నాయో ఊహించుకోగలిగాను. కాని అతను ధైర్యంచేసి ఏదీ నన్ను అడగలేక పోతున్నాడు.

ఇట్లా నెల గడిచి పోయింది.

ఒకరోజు అతను అందమైన సూట్‌లో ఇంటికి వచ్చాడు. నిజంగా అతన్ని ముద్దుపెట్టుకోవా లనిపించింది. చాలా అందంగా కనిపించాడు.

"విశేషమేమిటండీ మాష్టారు?" అన్నాను.

"ఇవాళ నాపుట్టినరోజు."

"ఓ! హ్యాపీ బర్త్‌డే."

"థాంక్యూ.......... ఇవాళ పాఠం......."

"చెప్పరుకదూ......... మరి కబుర్లు చెప్పండి.'

"సినిమాకు వెళ్ళాలని.............."

"నేనూ రానా?"

"మీరా? మీ రెక్కడ వస్తార్లెండి?"

"నేను రాలేననా? నాకదేంలేదు. మీరు తీసుకు వెళ్ళాలేగాని నరకానికైనా వచ్చేస్తాను."

"భలేవారే! నేను నరకానికి కూడా తీసుకు వెళ్తానా మీలాంటి వాళ్ళని!"

"సర్లెండి! ముందు సినిమాకు తీసుకు పదండి." అన్నాను.

రవి, "సరే"అన్నాడు. నేనుబట్టలు మార్చుకు వచ్చాను.

"అరె ! మీరు స్కూటర్ తెచ్చారుగా. దాని మీద పోదామా?" అన్నాను.

"బాబోయ్! రేపు కు॥ రాళ్లు నన్ను కాలేజీలో బతక నివ్వరు......... సిటీ బస్సులో పోదాం."

"సరే! మీఇష్టం."

"మరి మీనాన్నగారికి చెప్పారా?"

"అవసరంలేదు. తాళంవేసి, ఆ కిటికీమూల తాళంచెవి పడేస్తేచాలు. నాన్న తీసుకుంటాడు. సినిమాకు వేళ్లానని చిన్నచీటీరాసి టేబుల్‌మీద పడేస్తే చాలు. నాన్న గాబరాపడడు."

"మీ నాన్నగారు చాలామంచివారండీ. కూతుళ్లని అర్థంచేసుకునే తండ్రులు ఎంతమంది ఉన్నారు మనవాళ్లలో" అన్నాడురవి.

నేనింత చనువుగా ఎందుకు ప్రవర్తిస్తున్నానో అతనికి తెలియదు.

సినిమాకు వెళ్లాం.

శ్రీ 420. అంతకు ముందు చూసిందే. అయినా సర్దాగావుంది. నర్గీస్ ఎంతో అమాయకంగా రాజ్‌కపూర్‌ని ప్రేమించడం చూసినప్పుడు నాకేమిటో అనిపించింది.

రవివైపు చూచాను. అతను తెరవైపు చూస్తున్నాడు.

అల వోకగా నాచేతిని అతని చేతిమీద వేశాను. అతను చేయి లాక్కోబోయాడు. నేను అదిమాను. అట్లాగే ఉంచేశాడు.

నా మోకాలిని అతని మోకాలికి ఆనించాను. ఆవేశం మెల్లమెల్లగా కుతకుత లాడుతోంది. అతని భుజానికి నా భుజం ఆనించాను. అన్నీ ఏమీ గమనించనట్టు చేశాను. అతను ఊరికున్నాడు. నేను ఎక్సైట్ అయ్యాను. సినిమాహాల్లో అది అనుచితం అనుకున్నాను.

అతనికి దూరంగా జరిగాను. సినిమా అయ్యేంత వరకూ అట్లాగే కూచున్నాము. రవి ఇదేం పట్టించుకోనట్టే ఉన్నాడు. అతను అట్లా రబ్బరు బొమ్మలాగ ఉన్నందుకు అతనిమీద కోపం వచ్చిందినాకు.

ఇద్దరం ఒకే రిక్షాలో ఇంటికి వచ్చాం. వేసిన తాళం వేసినట్లేవుంది. నాన్న ఇంకారాలేదేమో!

వెళ్లి తలుపులు తీశా. లైటువేశా. రవి నా వెంటవచ్చాడు.

"మీనాన్నగారు రాలేదేమో!" అన్నాడు.

"వచ్చి బయటకు వెళ్లారేమో! అన్నట్టు మీరు ఇక్కడ భోజనం చేసివెళ్లాలి." అన్నాను.

"వద్దు. వెళ్లిపోతాను." అన్నాడు రవి.

"అదేం కుదరదు. భోజనం చేయాల్సిందే." అన్నాను.

అతను ఎదురు చెప్పలేదు. కారియర్‌లో భోజనం ఉంది.

"ఇదెక్కడిది?" అన్నాడు.

"సినిమాకు వెళ్లేముందు చీటీరాశాగా. నాన్న కారియర్ తెప్పించి వుంచాడు."

"భలేపనిచేశారు.""

ఇద్దరం పక్క పక్కన కూచుని భోజనం చేశాం. అట్లా భోజనంచేయడంలో ఏదో విచిత్రమైన ఆనందంవుంది. అతనితో నాకు పెళ్లిఅయినట్లుగానే ఫీల్ అయ్యాను.

భోజనం అయిపోయింది.

అతను వాలుకుర్చీలో నడుం వాల్చాడు.

ఎదురుగా చీకటి కుప్పల్లాగ ఉన్నాయికొండలు.

ఉడుకుతున్న గుడ్డులాగ చంద్రుడు.

నన్నేదో ఆవేశం కమ్ముతున్నట్టుంది.

అతని కుర్చీపక్కనే నిలబడ్డాను. అతని కళ్లలోకి చూస్తూ "రవిగారూ! ఇప్పుడు మీకేం అనిపిస్తోంది?" అన్నాను.

"ఏంలేదు.......ఏం? మీకేంఅనిపిస్తోందేమిటి? అన్నాడు.

"చాలా హాయనిపిస్తోంది. ఇట్లాగే ఉండిపోవాలనిపిస్తోంది."

ఆవేశం ఆలోచనని చంపివేసింది.

వంగి అతని నుదుటిమీద ముద్దు పెట్టుకున్నా.

అతను టక్కున లేచి నిలబడి కోటువేసుకో కుండానే గబగబా వెళ్లి స్కూటర్ స్టార్ట్ చేసుకు వెళ్లిపోయాడు. నాకు మతిపోయినట్లయింది.అతను ఎందుకు అట్లా వెళ్లిపోయాడో అర్థంకాలేదు.

అతనికి అవకాశం ఇచ్చాను. ఆవేశం చూపాను. ఏం జరగలేదు. ఏం జరగలేదు. అతనువెళ్లిపోయాడు.

రెండురోజులు రాలేదు.అతను. నాకు పిచ్చెక్కి నట్లుగా వుంది.

అతని అడ్రస్ నాకు తెలియదు. నాన్నకు తెలుసు. నాన్నను అడిగితే, "అతనే వస్తాడు చూడు" అన్నాడు.

అతను రాలేదు. అతనిదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

"రాణి గార్కి, మిమ్మల్ని బాధపెట్టి ఉంటాను క్షమించండి.

మీరు నన్ను ప్రేమిస్తున్నారు. నాకు తెలుసు. నాడబ్బుని, నాస్కూటర్ని, కారునీ ప్రేమించిన ఆడపిల్లలు ఉన్నారు. నేను వేసిన ' అందమైన డబ్బువలలోపడి నలుగురైదుగురు అమ్మాయిలు జీవితాలు నాశనం చేసుకున్నారు. నేను ఎంతో తెలివిగా పన్నినవలలో మీరూ అమాయికంగా అడుగు పెట్టారు. మీ అమాయికమైన ప్రేమ నాలో చాలా ఆలస్యంగా ఏదో మార్పును తెచ్చినట్టుంది.

నేను విపరీతంగా తాగుతాను. నా ఊపిరి తిత్తులు కాన్సర్కి అంకితమై పోయాయి.నేను చాలా 'విచ్చలవిడిగా' తిరుగుతాను. మీరు బహుశా, "సుఖవ్యాధులు" అనేమాట వినే వుంటారు. ఆ సుఖవ్యాధుల పాములకి నాశరీరం పుట్ట.

మీరు అందమైనవారు. అమాయకులు. మీ అందాన్ని పాడుచేయడం, మీ ఆరోగ్యాన్ని కలుషితం చేయడం, మీకు ముందున్న మంచి జీవితాన్ని నాశనం చేయడం నాకేమాత్రం ఇష్టం లేదు. క్షమించండి.

"రవి."

ఉత్తరాలో అంతమయ్యే కథలు చదివి నవ్వుకునే దాన్ని.

కాని ఉత్తరంతోనే ఒక మలుపు తిరిగిన జీవితంగురించి ఆలోచించినా నవ్వే వచ్చింది నాకు.

రవి రాసిన ఉత్తరం చదివి నిజంగా నవ్వు కున్నాను.

సముద్రతీరం—

ఇసుకలో అందమైన పేకమేడ—

అందులో నేను—

హోరుగాలిలాగ రహీం

కూలిపోయిన పేక మేడ—

దానిమీదనుంచి పిల్లగాలిలాగ వచ్చి వెళ్లి పోయిన రవి.

నిజంగా నవ్వు వచ్చింది నాకు.

రవి రాసిన ఉత్తరం చించి పారేసి, రేడియో పెట్టుకు కూచున్నా.

---

# అఖిలభారత రచయితల అయిదవ మహాసభ

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

అఖిలభారత రచయితల అయిదవ మహాసభ 1965 డిసెంబరు 24 నుండి డిసెంబరు 30 వరకు కేరళలోని ఎర్నాకుళం సమీపంలో 'ఫర్టిలైజర్ అండ్ కెమికల్, ట్రావన్‌కూర్' (FACT) సంస్థకు పారిశ్రామిక కేంద్రమైన 'ఉద్యోగమండల్' అనుచోట ప్రత్యేకంగా నిర్మింపబడిన 'ఆశాన్‌నగర్' లో, సమావేశం జరుపుకున్నది. ఈ రచయితల మహాసభ ఒక సంస్థకాదు. దీనికి ఏ సంస్థతోగాని పార్టీతోగాని సంబంధంలేదు. భారతీయ భాషలలోని రచయితలందరూ కూడబలుక్కొని ఒకచో సమావేశమై కొన్ని ముఖ్యమైన అంశాలను గూర్చి చర్చించుకుని, నిరాఘాటంగా తమ అభిప్రాయాలను యిచ్చి పుచ్చుకోవడమేతప్ప, తీర్మానాలూ, కార్యక్రమ నిర్వహణా వంటిదేమీ యీ సమావేశం యొక్క లక్ష్యంకాదు. మొదటి సమావేశం ఢిల్లీలో, రెండవది కలకత్తాలో, మూడవదిమద్రాసులో,నాల్గవదిబొంబాయిలో;ఇప్పుడు అయిదవది 'ఉద్యోగమండల్'లో కేరళ రచయితల ఆహ్వానం పురస్కరించుకుని జరిగింది. ఆరవ సమావేశానికి కన్నడ రచయితలు మైసూరు రాష్ట్రంలో ఏర్పాట్లు చేస్తామని మహాసభను ఆహ్వానించి ఉన్నారు.

అయిదవ మహాసభకు ప్రధానకార్యదర్శి మళయాళీ రచయిత శ్రీ శ్రీకంఠన్‌నాయర్. ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ ఎమ్.కె.కె. నాయర్, ఫర్టిలైజర్ పరిశ్రమ మేనేజర్, సంగీతనాటక ఆకాడెమీ సభ్యుడు, కథాకళి వ్యాఖ్యాత, కళాశీలి. సమావేశానికి వలసిన ఏర్పాట్లు చేయడంలోనేమి, ప్రతినిధులకు వసతి సౌకర్యాలను సమకూర్చడంలోనేమి, ప్రతినిధులకు 'కేరళ దర్శనయాత్ర' 25, 26 తేదీలలో ఏర్పాటుచేయడంలోనేమి, అనన్య సమాన్యమైన కార్యదక్షత ప్రదర్శించి అందరి మన్ననలకు పాత్రులయ్యారు. ఫర్టిలైజర్ పరిశ్రమకు సంబంధించిన ఉద్యోగులు, చిన్నాపెద్దా, వలంటీర్లుగా చేసినసేవ, చూపిన ఆదరణ, మరపురానివి. సుమారు 270 మంది ప్రతినిధుల్ని ఒక వారంరోజులు పెళ్లికి వచ్చిన బంధువుల్లాగా విందులతో, మర్యాదతో మన్ననతో సంతృప్తులను చేసిన కేరళ దేశస్థులను దేశం నలుమూలలనుంచీవచ్చిన రచయితలు, మేధావులు, చిత్రకారులు, కళాభిజ్ఞులు మనసారా అభినందించారు.

ఈ అయిదవ సమావేశం ప్రత్యేకత రచయితలనే గాక , విశ్వవిద్యాలయాలల్లో ఆచార్య పదవుల్లో ఉన్న కొందరు మేధావుల్నీ, ప్రఖ్యాతులైన చిత్రకారుల్నీ, సినిమా నాటక కళల్తో సంబంధం ఉన్నవారినీ ఆహ్వానించి, సాహిత్యానికి యితర లలిత కళలకూ గల సాన్నిహిత్యాన్నీ సంబంధాన్నీ చర్చకు తీసుకు రావడం. ఒక చిత్రకళాప్రదర్శనం, పుస్తక ప్రదర్శనం , సమావేశానికి అనుబంధంగా ఏర్పాటయ్యాయి.

మహాసభకు దేశం అన్ని ప్రాంతాలనుంచీ ప్రతినిధులు వచ్చారు. దక్షిణ భారతీయ భాషలకు ఒక్కొక్కదానికి సగటున ఇరవైమందికి పైగా ప్రతినిధులు హాజరయ్యారు. సమావేశంలో పాల్గొన్న తెలుగువారు శ్రీయుతులు కొడవటిగంటి కుటుంబరావు, పాలగుమ్మి పద్మరాజు, రజనీకాంతరావు, ఆర్.ఎస్. సుదర్శనం, పిలకా గణపతిశాస్త్రి, శ్రీవాత్సవ, విద్వాన్ విశ్వం, కొసరాజు శేషయ్య, తుమ్మల

వేంకట్రామయ్య, ఆవుల గోపాలకృష్ణమూర్తి, ఆరిగెపూడి రమేశ్ చౌదరి, దాశరథి, పి. సభాపతి, ఆర్ద్ర దంపతులు, ధవుళిపూడి ఆంజనేయులు దంపతులు. సోవియట్ రష్యానుంచీ, ఇరాన్, వెస్ట్ జర్మనీ, యుగోస్లావియా, అమెరికాదేశాలనుంచీ కూడా ప్రతినిధులు ఈసమావేశానికివచ్చి చర్చలలో పాల్గొనడం మరొక విశేషం.

డిసెంబరు 24, శుక్రవారం సాయంత్రం 5-30: ప్రొఫెసర్ రెగె(మహారాష్ట్ర) ప్రారంభోపన్యాసం చేశారు. శ్రీ వాత్స్యాయన (హిందీ) అధ్యక్షత వహించారు. రచయిత చిత్తశుద్ధితో ఏకాగ్రతతో తను దర్శించిన సత్యాన్ని రచనలో రూపొందించడమే ప్రధానం కాని, తనకు సంఘంలోగల స్థానాన్ని గూర్చి వితర్కించుకోవడం ప్రధానం కాదన్నారు రెగెగారు. రాత్రి మోహిని యాట్టం, కూచిపూడి భరత నాట్యం నృత్య ప్రదర్శనం జరిగింది.

డిసెంబరు 25, 26 తేదీలలో చిత్రకళా ప్రదర్శనం, పుస్తక ప్రదర్శనం, ఫిల్మ్ ఫెస్టివల్, ప్రారంభోత్సవాలు జరిగాయి. ఆరోజుల్లోనే చాలమంది ప్రతినిధులు మూడువర్గాలుగా విడిపోయి కేరళ రాష్ట్రం లోని దర్శనీయమైన ప్రదేశాల్నీ, పట్టణాల్నీ, దేవాలయాల్నీ చూచి వచ్చారు.

డిసెంబరు 27 సోమవారం ఉదయం 10: మహాసభ అధ్యక్షులు శ్రీ వాత్స్యాయన తమప్రధానోపన్యాసాన్ని చదివారు. భారతీయతను పుణికి పుచ్చుకున్న సాహిత్యం భారతీయ భాషలలోనే వికసించగలదన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ, ఆంగ్లంలో సృజనాత్మకమైన రచనలు చేసే భారతీయ రచయిత ఆంగ్లసాహిత్యంలో ఒకపేద చుట్టంగా (Poor-relation) తప్ప గౌరవప్రదమైన స్థానాన్ని పొందటం హుళక్కిఅనీ, రచయితకృషీ, స్వప్నమూ ఫలప్రదం కావాలంటే మాతృభాషలోనే, పరిసరాలతో తాదాత్మ్యం కలిగి, తన ప్రాంతీయతని ప్రతిఫలించే సృజనాత్మక రచన చేయాలనీ, తద్వారానే 'భారతీయత' రచనల్లో రూపొందగలదనీ వ్రాక్కుచ్చారు. రచయిత తను 'స్వేచ్ఛ'ను అనుభవంగా పొందగలిగితేతప్ప ఉత్తమ రచన చేయలేడని అంటూ, వివరణగా, 1930 ప్రాంతాల్లో రచయిత మనస్తత్త్వంలో 'తిరుగుబాటు,' 'విప్లవం' ప్రాధాన్యం వహించాయనీ, ఆనాటి సృజనాత్మకమైన —ఔత్సుక్యం రాజకీయ స్వాతంత్ర్యలబ్ధి తర్వాత రచయితలో కొరవడిందనీ, రచయిత నేటి వ్యవస్థను ఆమోదించి మన్నన మర్యాదలకోసం ఆశిస్తూ వుండటమే దానికి కారణం కాబోలు అంటూ నేటి రచయిత కొంతవరకు తన 'స్వేచ్ఛను' కోల్పోయినట్లు తోస్తున్నదన్నారు శ్రీ వాత్స్యాయన. భారతీయ భాషల్లో వ్రాస్తూ రచయిత తానెరిగిన, తనవంటబట్టిన, నేటి భారతీయతను అభివ్యక్తం చేసే ప్రయత్నం చెయ్యకపోయినట్లయితే నిజమైన భారతీయసాహిత్యం, ఇతర దేశసాహిత్యాలకు సమఉజ్జీగా నిలిచే ఆధునిక భారతీయ సాహిత్యం అనేది ఒకటి రూపొందటమే అసంభవమని నొక్కిచెప్పారాయన. 'భారతీయత' అంటే—జరుగుతున్న చరిత్ర, వస్తున్న మార్పులు, గతానికి ప్రకృతానికీ సంఘర్షణ, రూపొందుతున్న భవిష్యత్తు అన్నీ రచయిత మస్తిష్కంలో, భావనలో, ఒక స్వరూపాన్ని దిద్దుకొని వ్యక్తం కావడమనీ, అది కేవలం గతంవైపో లేక భవిష్యత్తువైపో మరల్చుకున్న చూపు కాదనీ స్పష్టం చేశారు.

అధ్యక్షోపన్యాసం తర్వాత, 12 గంటలకు మొదటి చర్చాసమావేశం (Seminar) జరిగింది. నేటి భారతీయ సాహిత్యపు స్థితిగతులు అన్న విషయంమీద ఒక నివేదికను ప్రొఫెసర్ జి. కుమార పిళ్లె చదివారు. ఆయాభారతీయభాషల్లో నేటి సాహిత్య వికాసాన్ని గూర్చి ప్రతినిధులు పంపిన నివేదికలు ఆధారంగా సాహిత్య ప్రక్రియలూ వాటి తీరు తెన్నులూ పై నివేదికలో వివరించారు. శ్రీగోపాలకృష్ణ అడిగె (కన్నడ) అధ్యక్షత వహిస్తూ నేటి సాహిత్యం అంటే కేవలం ఇవాళ వ్రాయబడుతున్న సాహిత్యం అని అర్థంకాదు. నేటి జీవిత

యాథార్థ్యంతో సంబంధం కలిగిన, సమన్వయం సాధించిన, సజీవమూ సృజనాత్మకమూ అయిన, సాహిత్యం మాత్రమే అని నొక్కి చెప్పారు. తర్వాత మధ్యాహ్నం 3 గంటలకు మహాసభ నాలుగు వర్గాలుగా విడిపోయి వివిధ ప్రక్రియలనూ వాటితీరు తెన్నులనూగూర్చి విపులమైన చర్చలు జరిగాయి. 1. ఆధునిక కవిత్వం (అధ్యక్షుడు బి. కె. భట్టాచార్య) 2. ఆధునిక నవల, కథ (అధ్య: కొడవటిగంటి కుటుంబరావు) 3. ఆధునిక నాటక రచన (అధ్య: మోహన్ రాకేష్) 4. ఆధునిక విమర్శనము (అధ్య: బరీంద్ర నాథ దాస్). ఆ రాత్రి వివిధ భాషల కవులు కవితాగానం చేశారు.

డిసెంబరు 28, మంగళవారం, ఉదయం 9—30: 'లలిత కళల పరస్పర సంబంధాలు' అన్న విషయంపై శ్రీ ప్రభాకర్ మాచ్వే (హిందీ) ప్రసంగ వ్యాసం చదివారు. శ్రీయుతులు గంగాధర గాడ్గిల్, హెబ్బర్, ఎమ్. పి. భాస్కరన్ క్లుప్తంగా కొన్ని అభిప్రాయాలు వెలిబుచ్చారు. అధ్యక్షత వహించిన శ్రీ ఆల్కాజీ లలితకళలను ఆనందించే విషయంలో అభిరుచి ఎవరికివారు సొంతప్రయత్నంమీద అలవర్చుకోవలెనేగాని, శిక్షణద్వారా ఏర్పడే అభిరుచి చాల ప్రాథమికమైనదిగానే వుంటుందని అన్నారు. లలితకళల విషయంలో నేటి భారతీయుడు ఒక్క భారతీయ సంప్రదాయానికేగాదు, అన్నిదేశాల సంప్రదాయాలకూ వారసుడేననీ, వ్యక్తినిబట్టి అతని మనస్తత్వాన్ని బట్టి అతను ఎన్నుకుని రూపొందించే పద్ధతి వుంటుంది అనీ, అదిఒక్క భారతీయ సంప్రదాయానికే పరిమితంకావాలని అనుకోవటం అవాస్తవికమూ సంకుచితమూ అయిన అభిప్రాయమనీ అన్నారు. తర్వాత 11—30 గంటలకు చర్చల నిమిత్తం మహాసభ నాలుగు వర్గాలుగా సమావేశమైంది. 1. సాహిత్యమూ సంగీతమూ (అధ్య: శ్రీమతి కపిల వాత్స్యాయన) 2. సాహిత్యమూ చిత్ర కళా (అధ్య: కె. కె. హెబ్బర్) 3. సాహిత్యమూ సినిమా (అధ్య: ఆద్య రంగాచార్య) 4. సాహిత్యమూ నాటకరంగమూ (అధ్య: లాథర్ లట్స్జ). సాయంకాలము విదేశాల నుండి వచ్చిన ప్రతినిధులు ప్రసంగించారు. శ్రీ కువూర పిళ్లె అధ్యక్షత వహించారు. శ్రీ వాత్స్యాయన విదేశీ ప్రతినిధులకు కృతజ్ఞత తెలిపారు. ఆ రాత్రి శ్రీ జి. శంకరపిళ్లె వ్రాసిన మళయాళీ ఏకాంకిక, శ్రీహబీబ్ తన్వీర్ తయారుచేసిన మరొక ఏకాంకిక, ప్రదర్శించారు.

డిసెంబరు 29, బుధవారం ఉదయం 10: 'భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనములో మేధావి (intellectual) పాత్ర' అనేవిషయాన్ని గురించి శ్రీ ఎమ్. గోవిందన్ ప్రసంగించారు. శ్రీ హర్ బచన్ సింగ్ అధ్యక్షత వహించారు. మన ఊహలూ, ఆలోచనలూ మన యధార్థస్థితిని స్పృశించి విశ్లేషించి పురోగతికి దోహదంచేసే శుభ సమయం యింకా రాలేదనీ, మేధా ప్రవృత్తి మన అస్తిత్వపు యాథార్థ్యాన్ని ఆకళించుకుంటేనే తప్ప మనం, నిరూపింపగోరుతున్న 'భారతీయత' నిరూపణ కాదనీ అన్నారు శ్రీ గోవిందన్. వ్యక్తి తనకూ తన పరిసరాలకూ సమన్వయం సాధించటంద్వారా అతని వాక్కులో రచనలో 'భారతీయత' వ్యక్తమౌతుందనీ, ఇందులో ఆలోచనవేరు, ఆవేశము వేరు అనే పద్ధతిలో చూడటం తనకు వీలుకావటం లేదనీ అన్నారు అధ్యక్షులు. తర్వాత మహాసభ చర్చలు సాగించింది. 1. భారతీయ సంప్రదాయమూ—అధునాతనత్వమూ (అధ్య: గంగాధర్ గాడ్గిల్) 2. మత విశ్వాసము — మార్పు (అధ్య: వసంత దేవతన్) 3. నేటి సంస్కృతి దృష్ట్యా 'భారతీయత'ను నిర్వచించుటెట్లు? (అధ్య: రాజారావు) 4. సాంస్కృతిక స్వాతంత్ర్యమూ — వ్యవస్థ (అధ్య: చునీలాల్ మాదియా). ఆ రాత్రి 10 గంటలకు 'కేరళ కళా మండలము' వారి 'సౌగంధికాపహరణము', 'కురుక్షేత్రము,' కథా కళి నృత్య ప్రదర్శనములు అందరినీ తన్మయుల్ని చేశాయి.

డిసెంబరు 30 వ తేదీ భారతీయ జ్ఞానపీఠం మళయాళంలో మహాకవి శ్రీ శంకరన్‌కురూప్‌కు లక్ష రూపాయల బహుమతి యిస్తున్నట్లు క్రితం రోజు ప్రకటన వెలువడింది. ఇది మహాసభకు ఒక మంచి అవకాశం. ప్రతినిధులు వెళ్లి శ్రీ కురూప్‌ను అభినందించారు. డిసెంబరు 30 వ తేదీ ప్రొద్దున 9 గంటలకు మహాసభ ఆయన్ని సన్మానించింది. శ్రీ గంగాధర్ గాడ్గిల్, శ్రీ మాచ్వె, శ్రీ మనోజ్‌బసు, శ్రీ మహాపాత్రో—శ్రీ కురూప్ కవిత్వాన్ని గూర్చి ఉగ్గడించారు. శ్రీ కురూప్ సమాధాన మిస్తూ తనకు భారతీయ భాష లన్నింటిలోనూ ఏకత్వం గోచరిస్తుందనీ, ఉచ్చారణ భేదాల్నితొలగించి చూస్తే 80 శాతము పదజాలము భారతీయభాష లన్నింటికీ ఒక్కటేననీ, తన కవితా వ్యాసంగం ప్రథమ దశలో రవీంద్రుని కవితా ప్రభావాన్ని పొందిందనీ, తనకు లభించిన గౌరవం ఇది మళయాళభాష పొందు తున్న గౌరవమనీ అన్నారు. ఆరోజు సాయంకాలం ప్రతినిధులకు తేనీటి విందు ఏర్పాటుచేస్తున్నానని ఆయన అందర్నీ ఆహ్వానించారు. అధ్యక్షులు శ్రీ వాత్స్యాయన శ్రీ కురూప్‌ను అభినందించిన తర్వాత సోవియట్ యూనియన్ ప్రతినిధివర్గము అభినందనలు తెలుపుతూ ఒక చిత్ర పటముల ఆల్బమ్‌ని శ్రీ కురూప్‌కి బహూకరించారు.

శ్రీ మనోజ్ బసు సమావేశం చివరి ఉపన్యాసం చేశారు. శ్రీ శ్రీకంఠన్ నాయర్ వందన సమర్పణతో మహాసభ సమావేశం ముగిసింది.

ఆహ్వాన సంఘంవారు ప్రతినిధుల్ని తమ అతిథులుగా సత్కరించడమేగాక ఒక్కొక్కరికీ ఒక చక్కని రెక్సీన్ ఫోల్డరు, ఒక బాల్ పాయింట్ కలం, ఒకచిన్న కంచు దీపపు సెమ్మె అయిదవ మహాసభ స్మృతిచిహ్నాలుగా బహూకరించారు. ప్రసంగవ్యాసాల పైపు ప్రతుల్ని తయారుచేసి పంచిపెట్టడమేకాదు; రైల్వే బుకింగ్, రిజర్వేషన్ వగైరా విషయాల్లో ప్రతినిధుల భారాన్ని తామే వహించారు. శ్రీగోవిందన్ Sight and Vision అనుపేరుతో చిత్రకళను గూర్చిన ఒక పుస్తకాన్ని అచ్చొత్తించి పంచిపెట్టారు. శ్రీ గోవిందన్ నడుపుతున్న మళయాళ పత్రిక 'సమీక్ష' ఇంగ్లీషులో భారతీయ సాహిత్యసంచిక నొకదానిని మహాసభకోసం ప్రత్యేకంగా ప్రచురించింది. ఈసంచికలో భారతీయ భాషల్లోని రచనల ఇంగ్లీషుఅనువాదాలు ముద్రించి ప్రతుల్ని ప్రతినిధులందరికీ పంచిపెట్టారు. కేరళ రచయితలూ, పత్రికాధిపతులూ, కేరళ దేశస్థులూ చూపిన సౌజన్యం, ఔదార్యం, అభిమానం అందరి మనస్సుల్లోనూ చెరగనిముద్రగా నిలిచిపోయిందంటే, ఈ మహాసభ సాధించిన ఉత్తమ ప్రయోజనం 'భారత సమైక్యత' అని వేరుగా చెప్పనక్కరలేదు.

---



లేఖలు :

# అస్తిత్వవాదం

ఆర్యా !

అక్టోబరు (1965) నెల భారతిలో ఆంధ్ర వాఙ్మయంలో స్తబ్ధతను గురించి హా. శి. గారి లేఖపై నేను వ్రాసిన లేఖ డిశంబరు (1965) భారతిలోవచ్చినది. దానిలో Existentialism ను గురించి వ్రాస్తూ దాన్ని 'అస్తిత్వవాద' మనడం కంటే "సర్వాస్తి స్వభావ వైశేషిక వాద'మని చెప్పడం సమంజసంగా వుంటుందని నేను ప్రాసంగికంగా వ్రాసిన మాటలపైనా,—శాస్త్రజ్ఞులై శాస్త్ర వృత్తికి విముఖులై సాహిత్య వ్యాసంగం చేస్తున్న వారిని గురించి వ్రాసిన దానిపైనా—"ఆర్. ఎస్. సుదర్శనం"గారు జనవరి (1966) భారతికి వ్రాసిన లేఖను చూచాను. దానికి సమాధానంగా నాల్గు మాటలు వ్రాస్తున్నాను.

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు, సంక్షేపంగా శ్రీ R.S.S అంటాను, వ్రాసిన లేఖలో దురుసుతనము మొదలైన కొన్ని అవలక్షణాలు ఉన్నాయి. ప్రకరణ శుద్ధి లేకుండా నేను వ్రాసిన వాక్యాలు ఉదహరించడం గూడా ఆయన చేసారు.

ఆయన భారతికి వ్రాసిన లేఖలో ఒకచోట నన్ను గురించి ఇట్లా వ్రాశారు : "ఇలాంటి పిరికి వ్రాతలు అసూయను కుళ్ళును వెళ్ళగక్కే మాటలు సాహిత్య వ్యాసంగానికి పనికిరావు.....పై శాస్త్రజ్ఞులు చేసిన సాహిత్య వ్యాసంగాన్ని చేతనైతే విమర్శించాలి. లేకపోతే పూరుకోవాలి. ముసుగుపేరుతో ఏవో రెండు మాటలు విసిరితే ఏమి సాధించినట్లు"—

పై మాటలు అనుచితంగాను పారుష్యకశ్మలం గాను ఉన్నాయి అని అనడంతప్ప, వేరే చెప్పదలచుకో లేదు.

శాస్త్ర వ్యాసంగం ఎప్పుడూ సాహిత్య వ్యాసంగం కంటే పై అంతస్థులోదే. "శాస్త్రేషు హీనాః కవయోభవంతి" అన్నారు. అది అప్పుడు ఎప్పుడో కాదు. ఇప్పుడు కూడా యదార్థమే. ఈమధ్య తూర్పు జర్మన్ శాస్త్రజ్ఞుడు ఒకరు మన దేశానికి వచ్చి ఇక్కడ శాస్త్రజ్ఞులు Academic Posts లో ఉండటానికి ఆశ్చర్యం ప్రకటించారు. "శాస్త్రజ్ఞులు రీసెర్చి డిగ్రీలు సంపాదించడంతో తృప్తితో శాస్త్ర వ్యాసంగం మానివేస్తే ఎట్లా?" అని ప్రశ్నించారు. ఇటువంటి అభిప్రాయాలతోనే తెలుగు శాస్త్రజ్ఞులు కూడా శాస్త్ర వ్యాసంగం పరిత్యజించరాదని నేను వ్రాశాను. దానికి ఎవ్వరూ ఆగ్రహ పడనక్కరలేదు.

ముసుగుపేరును గురించి : ఇక్కడ పేరులతో ఏమి నిమిత్తమో తెలియదు. ఒక విషయమును ఒకరు వ్రాసినప్పుడది ఏ పేరుతో వెలువడిన దన్నది ప్రధానముకాదు. విషయము ప్రధానము. ఈ విషయము తెలిసినవారు పేరులు, ముసుగులు సంగతిని ప్రస్తావించరు. ప్రస్తావించుట—వస్తువును వదిలి నీడను పట్టుకొని వ్రేలాడటమువంటిది. కాగా 'శ్రీ పాదుక' అన్న రహస్య నామమునుంచగా, దాని అర్థమేమో సంప్రదాయజ్ఞు లందరికిని తెలియును. పేరు చెప్పడానికి కూడా నాకు భయం లేదు. చెబుతాను. నాపేరు తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు.

ఇక అసలు విషయం—

నేను "Existentialism" అన్న మాటకు 'సర్వాస్తి స్వభావ వైశేషిక వాదం' అని తర్జుమా చెయ్యడం సమంజసంగా ఉంటుందని వ్రాశాను. కాని ఆ మాటల్లో "స్వభావ" "వైశేషిక" అనే మాటలు కత్తిరించి శ్రీ R. S. S. "సర్వాస్తివాదం"

అని మాత్రమే నేను వ్రాసినట్లు ఉటంకించారు. "అస్తిత్వవాదాన్ని సర్వాస్తివాదంతో ముడిపెట్టడం; అస్తిత్వవాదం బౌద్ధ దర్శనములలో ఒకటి; నేటి అస్తిత్వవాదము ఆదర్శనములలో నొక శాఖతప్ప మరేమీ కాదని"—ఇట్లా ఉన్నవి—శ్రీ R. S. S. వ్రాతలు, ఉటంకింపులు. ఇవి కత్తిరింపులు; దబాయింపులు. నేను వ్రాసింది సర్వాస్తి స్వభావ వైశేషిక వాదమంటే సమంజసంగా ఉంటుందని. అందులో అస్తిత్వవాదం తప్పని కూడా లేదు. ఎక్కువ సామంజస్యం మాటే నేను వ్రాసింది. బౌద్ధదర్శనంమాట నేను ఎత్తలేదు. నేను వ్రాసిన మాటలు సగానికి సగం కత్తిరించి నేను వెలిబుచ్చని అభిప్రాయాలు నాకు అంటగట్టి నన్ను నిందిస్తూ శ్రీ R. S. S. తమ 'కుళ్ళు' వెళ్ల బోసుకున్నారు. ఆ 'కుళ్లు' ఆయన ఆస్తి. దానితో నాకు సంబంధంలేదు.

"అస్తిత్వవాదమని తెలుగు విజ్ఞాన సర్వస్వంలో ఉన్నది గనుక—దీన్ని మార్చవలసిన అగత్యం గాని, అధికారంగాని ఎవళ్లకీ లేవు" అని శ్రీ R. S. S. గద్దిస్తున్నారు. తప్పులు విజ్ఞాన సర్వస్వంలో ఉన్నా దిద్దుకోవలసిందే. అసలు విజ్ఞానసర్వస్వంలో తప్పులు ఉండకూడదు గనుక మార్చి తీరాలి.

'అస్తిత్వం' అన్న పదం ఆస్తికత, ఆస్తికత్వం మొదలైన మాటలకు సన్నిహితంగావుండి ఈశ్వరుడు ఉన్నాడనే రూఢ్యర్థ ద్యోతకంగా ఉంటున్నది. మళ్లీ ఇంకో అర్థంతో అటువంటి పదజాలాన్ని వాడటం న్యాయంకాదు. వాడితే విస్పష్టమైన అర్థ ప్రతీతి కల్గదు. అందుచేత "Existentialism" అన్న శబ్దానికి అస్తిత్వవాదమన్న అనువాదాన్ని మార్చవలసిన అవసరం వుంది. తాత్త్విక సిద్ధాంతాలలో Deism (belief in god without accepting any perticular religion) అనే సిద్ధాంతం వున్నది. ఆ సిద్ధాంతానికి ఏనాడో "కేవలఅస్తిత్వవాద"మని తెలుగులో అనువాదం జరిగిపోయివుంది. ఆస్తికతతో పెనవేసుకున్న అస్తిత్వం, కేవలఅస్తిత్వవాదంలో అస్తిత్వం; ఇప్పుడు మూడోసారి అదే మాటను "Existentialism" అన్న దానికి అనువాదంగాఉపయోగిస్తే తికమకకాక మరేమిటి? మనకు శబ్ద దారిద్ర్యంలేదు కాబట్టి Existentialism అన్న యీ నూత్న వాదానికి ఇంకో అనువాదం చెయ్యవలసివుంది. అందుకు నేను ఒక ప్రయత్నం చేశాను.

నాకు యీ విజ్ఞాన సర్వస్వం గురించి గ్రంథంకాదు. ఈ తెలుగు విజ్ఞాన సర్వస్వంలో తప్పులు కోరు కున్నన్ని ఉన్నాయి. అది ప్రామాణిక గ్రంథం ఏమీ కాదు.

Existentialism ను గురించి వ్రాస్తూ నేను "నిత్యము, సార్వజనికము అయిన దానిని అనుభవములద్వారా వెల్లడించుట; జగద్రహస్యములను గ్రహించుట" అనే మాటలు వ్రాశాను. శ్రీ R. S. S. ఇవి సరికాదు అంటున్నారు. ఇంగ్లీషులో ఒక మాటవుంది. Caring for the shadow of words and ignoring the substance of the reality అని. శ్రీ R. S. S. ధోరణి అట్లా వుంది.

Philosophy అంటేనే a means of answering the big questions about life and universe అయిరి; దీనికోసం Dictionaries దాకా గాని En. బ్రిటానికా దాకాగాని పోనక్కరలేదు. Philosophy ని Ludwig మహాశయుడు "Philosophy is to show the fly the way out of the fly-bottle" అన్నాడు. కనుక నిత్యము, సార్వజనికము, జగద్రహస్యము—అనేవి అనధిగమ్యంగా ఉన్నాయి Philosophy లో. పాశ్చాత్య తాత్త్విక విజ్ఞాన పరిచయం ఉన్నవాళ్లకు Epistemology తెలిసిన వాళ్లకు నేను Existentialism కు చేసిన నిర్వచనంలో వున్న సామంజస్యం బోధపడుతుంది.

శ్రీ R. S. S. ఇచ్చిన రెండు ఆధారాలవల్లనే నా అనువాదం సమంజసంగా ఉన్నదని చూపిస్తాను. శ్రీ R. S. S. తమ భారతి లేఖలో ఈ ఇంగ్లీషు వాక్యాలు ఒకచోట ఉదహరించారు.

"An introspective humanism or theory of man which expresses the individual's

intense awareness of his contingeney (that is existence, manaced by death and dependent on oneself for shaping the cause and quality of his life) and freedom, a theory which states the existence of the individual precedes his essence.'' ఇందులో చూడండి existence menaced by death and quality of life - జీవితంయొక్క అస్తిత్వం దానిపైనవున్న మృత్యువు యొక్కయు, ఇతర వైయక్తిక విషయ సంపుటీకరణములయొక్కయు ముద్రతో సహా—ఈ భావాన్ని చెప్పడానికి 'అస్తిత్వం' అన్న ఒక్క మాట చాలుతుందా? చాలదనుకొని నేను ''సర్వాస్తి'' అన్నాను. మళ్లీ మానవ వైయక్తిక స్వభావం కూడా కలపాలి గనుక ''సర్వాస్తి స్వభావం'' అన్నాను. ఇది కూడా చాలక there is that presense of essence which is, of course, preceded by existence. ఈభావాన్నికూడా తీసుకురావాలిగనుక 'వైశేషిక' అన్న పదంకలిగి పూర్తి స్వరూపంగా''సర్వాస్తిస్వభావ వైశేషిక వాదం''అన్నాను.అస్తిత్వం అంటే existenceమాత్రమే అవుతుంది_menaced by death and dependence. ఇవివ్యక్తంకావు.వైయక్తిక లక్షణమూ బయటపడదు. Life (existence) with all its contingencies —సర్వాస్తి and quality of one's life స్వభావ— together with the essence etc. that fallow వైశేషిక. నిజస్థితులు ఇట్లా ఉన్నాయి. ఇక్కడ శ్రీ R. S. S. గారి, తెలుగు భాషాసమితి విజ్ఞాన సర్వస్వం వారి ''అస్తిత్వాలు'' చాలవు.

శ్రీ R. S. S. ఇచ్చిన ఇంకో ఇంగ్లీషు ఉట్టంకింపు ఇట్లా ఉంది :

''There is no question here of finding again an abstract behind the concrete, the impulse to-ward God is no less concrete than the impulse toward a perticular woman. This inpulse can be only purelty individual and unique. God, value and supreme end of transcendence, represents the permanent limit in terms of which man makes known to himself what he is.''

ఇందులో చూడండి ;

"There is no question of finding again an abstact behind the concrete, the impulse towards God is no less concrete..'' దీని భావం ఏమిటి? సాధారణంగా abstract అనుకునే దైవభక్తిలాంటివి concrete అనే కదా?

'God, value and supreme end of transcendence represents the permanent limit in terms of which man makes known to himself what he is—దీని భావం ఏమిటి ? నిత్యము, సార్వజనికము అయిన జగద్రహస్యాన్ని తెలుసుగుని తనకు తాను వెల్లడించుకొనడంకాదా? కాకపోతే ఇంగ్లీషు భాషలోవున్న తాత్విక పారిభాషిక పదజాలం ఉపయోగించారు. నేను అనువాదంలో మన తాత్విక పారిభాషిక పదజాలంతో ఆ భావాన్ని ప్రతిబింబింపచేయడానికి ప్రయత్నించాను. కనుక ఇందులో నిత్యము, సార్వజనికము అయిన దానిని అనుభవాల ద్వారా వెల్లడించుట (ఆ వెల్లడించుట తనకోసమే కావచ్చు) ఉండనేఉన్నది.

ఇందులో ఇంత ఉంది. ఇది తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వం ఏదో మాట వేస్తేనూ, దాన్నిశ్రీ R. S. S.సమర్థిస్తేనూచెల్లిపోయేవిషయం కాదు. నేను చేసిన అనువాదంలో దోషం ఉండవచ్చు. కాని అందులో జిజ్ఞాస వుంది. పుస్తకం ముడిచి వెయ్యడంలేదు.

శ్రీ R. S. S. గారి లేఖలో మరికొన్ని విషయాలు కూడా ఉన్నాయి. వాటికి అన్నింటికి జవాబు ఇస్తూ కూర్చుంటే — అది బుద్ధియాపన. కొన్నింటిని వదిలేందుకులేదు. వానిలో ''అస్తిత్వవాదాన్ని'' నిరూపించడానికైనా తెలుగులో రచనలు రాలేదని నేనువ్రాశాను.దానికి సమాధానంగా శ్రీ R·S·S ఇట్లా వ్రాశారు : ''ఏ ధైర్యంతో చెబుతున్నా డీ లేఖకుడు? గోపీచంద్ వ్రాసిన ''మెరుపులు మరకలు'' నవలలో ఉషారాణి అస్తిత్వవాదానికి ఉదాహరణంగా ఉన్నదని నేను ''నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు'' అనే వ్యాసాల్లో భారతిలో వ్రాశాను. అందుకు భిన్నాభిప్రాయం ఉన్నట్లయితే ఈ లేఖ

కుడు సోకపత్తికంగా స్పష్టంగా నా వ్యాసాన్ని ఖండిస్తూ వ్రాయవచ్చునే!"—ఈ వాక్యాల్లో "మల్ల విద్యా ప్రియత్వం" గోచరిస్తున్నది. ప్రతిఒక్కరు వ్రాసిన దాన్ని ఖండిస్తూ కూర్చునే విద్య అందరికి అబ్బదు. అ సాహిత్యంవేరు. అదీకాక గోపీచంద్ "ఉషారాణి" లో'అస్తిత్వవాద' లక్షణం నాకు ఎక్కడా గోచరించలేదు. శ్రీ R. S. S. లేఖ చూచిన తర్వాత, ఏమైనా ఉన్నదేమోనని మళ్లీ చూచాను. నా పూర్వపు అభిప్రాయాన్ని మార్చుకోవలసిన అవసరం కన్పడ లేదు. దీనిపై శ్రీ R. S. S. తో తగాదా పడవలసిన అవసరం అంతకన్నా కన్పడలేదు.

శ్రీ R. S. S. ఇంకో ఉటంకింపు ఇట్లా ఉన్నది: "సార్త్రే సిద్ధాంతాన్ని పాఠకలోకానికి తెలియజెయ్యడం ముఖ్యం అనుకుంటే, లేఖకుడే ఆ పని చేయ వచ్చునుకదా! లేఖకునిలో ఆచరణకున ఆదర్శానికిగల దూరమేమిటో తెలుస్తూనే ఉంది." ఈ వాక్యంలో కూడా అహంకారం ఉంది. నేను సార్త్రే సిద్ధాంతాన్ని గురించి వ్రాసిన దానిమీదనేకదా శ్రీ R.S.S. ఇంత హోముధూములు చేసింది. 'వ్రాయవచ్చును కదా!' అని ఇంకా ఎందుకు? చేస్తున్న పనిఏమిటో తెలియనప్పుడు ఇతరులు చెయ్యగలిగింది ఏముంటుంది?

అసలు నాటకంలోని, నవలలోని పాత్రలద్వారా ఉపన్యాసాలిప్పించడం శాస్త్రి నిర్వచనం కాదు. వివరణ కాదు. నవల చర్చా వేదిక కాదు. కారాదు. అందుకనే శాస్త్రజ్ఞులు కేవలం శాస్త్రచర్చ చేయాలన్నాను.

శ్రీ R. S. S. ఇంకా ఇట్లావ్రాశారు: "సార్త్రేకు భక్తుడవడం తోటే ఆ వ్యక్తి అస్తిత్వవాది అనే పేరుకు తగనివాడవుతాడు. అస్తిత్వవాదానికీ అను కరణకు చుక్కెదురు."—ఈ మాటలనుబట్టి భక్తి అంటే అనుకరణం అని శ్రీ R. S. S. కు అర్థం అయిం దన్నమాట. భక్తి అనే పదాన్ని అనుకరణ అని అర్థం చేసుకునే తెలుగురచయితఉన్నాడంటేనే నాకు ఆశ్చర్యంగా ఉన్నది. ఇట్టి వానికి వాదనలో ఉండే సౌకుమా ర్యాలు పెరుమాళ్లు కూడా పట్టి ఇవ్వలేడు.

హెగెల్ యొక్క ప్రభావం కూడా Existentialismమీద ఉన్నదని నేనువ్రాశాను.ఆ సంద ర్భంలో హెగెల్ యొక్క వాదంలో మూలరాయి Real is the Rational అనిన్నీ వ్రాశాను. దీనికి శ్రీ R. S. S. విపరీతార్థాలుతీశారు.నా అభిప్రాయాన్ని వివరిస్తాను.

"The birth and growth of philosophical concepts (philosophical scholastic thea-ries and attitudes included) owe as much to social environment as to the ideas of pre-vious thinkers. There is an intimate relationship between civilization and philosophy each determining the other. Epistomol-ogy and mataphysics are important for philosophy. Equally important for philosophy are religious factors"

కాబట్టి హెగెల్ తరువాత వచ్చిన తాత్వికుల పైన హెగెల్ ప్రభావం ఉండి తీరుతుంది. ఆ ప్రభావం ద్వివిధంగా ఉంటుంది. ఉన్ముఖంగానో పరాఙ్ముఖంగానో. అంటే Positive గాగాని, Negative గా గాని ఉంటుంది. కాల సంబంధంగా హెగెల్ తర్వాత వచ్చిన వాళ్లమీద ఆయన తాత్విక భావాలు పని చెయ్య లేదనడం కాలభావానికే విరుద్ధం. ఆ పనిచెయ్యడం ఎట్లా జరిగింది అన్నది వేరే ప్రశ్న.

ఇంతకూ మనవిచేసేదేమంటే ఏదోవిధంగా అనుకూలంగానో—ప్రతికూలంగానో తాత్వికరంగంలో హెగెల్ ప్రభావం, ఆతని తరువాత వచ్చిన వాళ్లమీద తప్పదు. నేను చెప్పింది ఇంతవరకే. హెగెల్ సిద్ధాం తాలకు మూలసూత్రం Real is the Rational అని వ్రాశాను. అది విషయాంతరం.

శ్రీ R. S. S. లేఖకు యీమాత్రం చాలును.

—'శ్రీపాదుక'

# కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ నాయకత్వం వ్యవహారం

శ్రీ "పరిశీలక్"

నెహ్రూ అనంతరం పద్దెనిమిది నెలలలో రెండుసార్లు కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వానికి ఎన్నిక జరగవలసి వచ్చింది. అయితే ఇందులో మొదటిసారి, అనగా శ్రీ నెహ్రూ మరణించిన అనంతరం ఏర్పడిన పరిస్థితిలో ఈ నాయకత్వపు ఎన్నిక తేలిగ్గా, అందరు మెచ్చుకునే విధంగా జరిగిపోయింది. శ్రీ లాల్‌బహదూర్ మరణానంతరం అప్పటికన్నా తేలిగ్గా తేలిపోవలసిన యీ నాయకత్వపు వ్యవహారం జటిలమై, దేశంలో కొన్ని విపరీత పరిణామాలకు, దారితీసేదిగాను, ప్రజాస్వామ్య ధర్మ విరుద్ధమైన సంప్రదాయాలను నెలకొల్పేదిగాను తయారైంది. ఇది ఎట్లా ఎందుకు జరిగింది పరిశీలన చేయడం భారత దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య ధర్మ సక్రమ నిర్వహణకు అవసరం అవుతున్నది.

శ్రీ నెహ్రూ చనిపోయినప్పుడు 'శ్రీ నెహ్రూగారి అనంతరం ఎవరు?' అన్న ప్రశ్న ఉంది. ఆ ప్రశ్న ఎంతోకాలంగా ప్రచలితం అవుతూ వచ్చింది. శ్రీ నెహ్రూ మహామహులని, ఆయన అనంతరం అంతటివాడు మళ్లీ దొరకడం కష్టం గనుక, దేశం అల్లకల్లోలం అయిపోతుందనే ఒక రకమైన భావం ప్రచారంలోనికి తీసుకొని రాబడింది. శ్రీ నెహ్రూ కూడా, ఏ కారణం చేతనన్నా అనండి ఆ రకమైన అభిప్రాయాలను అప్పటికి అప్పుడు త్రుంచి వేయకుండా ప్రచారం కానిచ్చారు. ఒకసారో, ఆరసారో, ప్రజాస్వామ్యంలో నాయకత్వపు వారసత్వపు సమస్య అంటూ ఉండదని, కాంగ్రెస్ పార్టీ తన అనంతరం తన నాయకుణ్ణి నిర్ణయించుకోగలదని అన్నా, అసలు మార్గాన్ని ఆయన సుగమం చేయలేదు.

కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వపు వ్యవహారం శ్రీ నెహ్రూ దేశాన్ని పాలించిన పదిహేడు, పద్దెనిమిది ఏళ్లలో ఒక మార్గంలోపడి, అందుకు ఒక పద్ధతి అంటూ ఏర్పడలేదంటే అందుకు ఇదే కారణం. సర్దార్ పటేల్ బ్రతికివున్న కాలంలో ఆయన కాంగ్రెస్‌పార్టీ డిప్యూటీ నాయకుడుగాను, ఉప ప్రధానిగాను ఉండేవారు. ఆయన అనంతరం శ్రీ నెహ్రూ ఉప ప్రధాని పదవిని పీకివేశారు. పండిత పంత్ కేంద్రంలో చేరినప్పుడు కూడా ఉపనాయకత్వ పదవి సుష్ఠుగా నిర్వహిల్లింది. ఉప ప్రధాని పదవిని ఎత్తివేసినా, ఉపనాయకత్వపు పద్ధతివలన పరిస్థితి కొంత విశదంగా ఉంటూ వచ్చింది. పండిత పంత్ మరణానంతరం శ్రీ నెహ్రూ ఆ ఉపనాయకత్వపు పద్ధతిని కూడా రద్దు చేశారు. అనగా, ఆయన అనంతరం పార్లమెంటులో కాంగ్రెస్ పార్టీ నాయకత్వం చేపట్టగల వ్యక్తులను సిద్ధం చేయడంగాని, ఆ నాయకత్వపు వ్యవహారం మామూలుగా, తేలిగ్గా, జరిగిపోగల పద్ధతి ఏర్పాటు చేయడంగాని ఆయన చేయలేదు. ఈ కారణాలచేత శ్రీ నెహ్రూ అనంతరం కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ నాయకత్వపు పదవి వారసత్వపు యుద్ధాలకు తావలంగా తయారు కాగల పరిస్థితి ఏర్పడిపోయింది. కాని కాంగ్రెస్ నాయకులు ఆ సమయంలో విచక్షణను ఉపయోగించి వ్యవహరించడంమూలంగా ఆ 'యుద్ధం' అప్పటికి ఆగిపోయింది. ఇందువల్ల ఇంకో విషయం కూడా స్పష్టపడింది. అంతవరకు యీ భారతదేశంలో ఐకమత్యం అంటూ ఉన్నదంటే, అది నెహ్రూ అన్న ఒక్క వ్యక్తి అంటూ ఉన్నందువల్లనే సాధ్యం అవుతున్నదని, లేకపోతే దేశం ఛిన్నాభిన్నంఅయిపోయిఉండేదని ప్రచారం జరుగుతూవుండేది. కాంగ్రెస్ సంస్థ విషయంలో కూడా ఇటువంటిమాటలే అంటూ వచ్చారు. శ్రీ నెహ్రూ అనంతరం కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ నాయకత్వం సమస్య సుగమంగా తేలిపోవడంతో, అప్పుడు కాంగ్రెస్ నాయకులు విచక్షణతో వ్యవహరించి వారసత్వపు సంఘర్షణలకు తలపడక తమలో తాము అన్ని విషయాలను సర్దుబాటు చేసుకొనగల్గడంతో ఈ ఐకమత్యం శ్రీ నెహ్రూ 'తల భారతం' మాత్రమే కాదని, కాంగ్రెస్‌వారియొక్క విచక్షణమీద కాంగ్రెస్ నాయకులమీద ఆధారపడివున్నదని విదితం అయిపోయింది. ఇప్పుడు శ్రీ శాస్త్రి అనంతరం నాయకత్వపు ఎన్నిక సందర్భంలో వారసత్వపు లక్షణాలు తలఎత్తి, కాంగ్రెస్ నాయకులలో ఒక సంఘర్షణను లేవదీశాయి. ఎవరికి వారు తమ బలా బలాలను ప్రదర్శించుకోవాలని పెట్టుకొని వ్యవహరించారు. నెహ్రూ అనంతరం అందరి అభిప్రాయం తెలుసుకొని ఆ ప్రకారం నడుచుకొనడం జరిగింది. ఇప్పుడు ఆ పద్ధతి సాధ్యంకాక కాంగ్రెస్ నాయకులు బహిరంగంగా గోదాలోకి దిగారు. కాంగ్రెసులో వారసత్వపు సంఘర్షణ ఆరంభమైంది.

ఈ 'వారసత్వం'—ఇంగ్లీషులో Succession—అన్న మాటకు ఇక్కడ నిజానికి అర్థం లేదు. అయినా ఈ మాట

# కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ నాయకత్వం వ్యవహారం

కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వపు నిర్ణయం సందర్భంలో తరచు వినవస్తూ వచ్చింది. నిజంగా మనకు రిపబ్లిక్ అంటే అర్థం అయినా, రిపబ్లికన్ సంప్రదాయాలు, ప్రజాస్వామ్య ధర్మాలు అర్థం అయినా, ఇటువంటి మాటలు ప్రచారంలోకి వచ్చివుండేవికావు. కాని వచ్చాయి. అనగా మన ఆలోచనలు, ఆ ఆలోచనలను వ్యక్తం చేసేమాటలు దేశాన్ని కాలాన్నిబట్టిగాక, భూతకాలమర్యాదలకు ఒదిగి,గతకాలపువాసనలనువదలకకాంగ్రెస్‌లో ఒక వర్గం (కూటం) నాయకత్వం లక్షణం ఏవిధంగా ఉన్నదీ విదితం చేస్తున్నాయి. ప్రజాస్వామ్యంలో పార్టీలు ఉంటాయి. ఆ పార్టీలు బయట, పార్లమెంటులోను కూడా పని చేస్తూ వుంటాయి.పార్లమెంటుకు ఆ పార్టీల సభ్యులు ప్రజలచేతఎన్నకొనబడతారు. ఆ ఎన్నిక అయిన సభ్యులు పార్లమెంటరీ పార్టీలుగా వ్యవస్థితం కావడం జరుగుతుంది. అట్లా ఏర్పడిన పార్టీలు తమకు ఒక నాయకుణ్ణి ఉప నాయకుణ్ణి ఎన్నుకుంటాయి. బలమైన ప్రతిపక్షాలువుండి, అవి అధికారంలోకి రాగల అవకాశాలు ఏర్పడివున్న పరిస్థితి ఉన్నప్పుడు తక్షణం అధికారాన్ని చేపట్టగలందులకు ఆ పార్టీలు''ఛాయా మంత్రి మండలా''లను కూడా ఏర్పాటు చేసుకుంటాయి. ఈ పద్ధతిలో నాయకత్వానికి ఎన్నికే జరుగుతుందిగాని, వారసత్వం అన్న ప్రశ్నేలేదు. అది జరగదు. కాని పార్లమెంటరీ ప్రజాస్వామ్యం యొక్క లక్షణం ఇంకా బాగా అవగతం కాని మనదేశంలో పార్లమెంటరీ పార్టీలు, సంస్థలకు బంటుతనాన్ని నెరపుతున్నదేశంలో పోటీ అన్నది ఆనుషంగికము, 'వారసత్వం' అన్నది ప్రధానము అవుతున్నది. శ్రీ నెహ్రూ అనంతరము, శ్రీ శాస్త్రి అనంతరము యీ నాయకత్వపు నిర్ణయం వ్యవహారంలో నడిచిన కథను పరిశీలిస్తే, ఇది వ్యక్తం అవుతుంది.

## 2

శ్రీ నెహ్రూ అనంతరము, యీ నాయకత్వపు వ్యవహారంలో కొంత సామ్యము వైషమ్యము వుంది. ఉన్నా శ్రీ నెహ్రూ చనిపోయిన అనంతరము, ఇప్పుడు శ్రీ శాస్త్రి మరణానంతరము కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వపు వ్యవహారంలో కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ అన్నదాని ప్రసక్తే ఎక్కడా రాలేదు. వట్టి కాంగ్రెస్ ప్రసక్తి మాత్రమే వచ్చింది. ఆ కాంగ్రెస్‌లో కూడా ఒక కూటం ప్రసక్తి అధికంగా వచ్చింది. ఈ కూటాన్ని ''సిండికేట్'' అన్న సాంకేతిక నామంతో దేశంలో వ్యవహరిస్తున్నారు. దానికి శ్రీ కామరాజు శిష్టాది గురువు. శ్రీయుతులు ఎస్. కే. పాటిల్, నిజలింగప్ప, అతుల్యఘోషు, సంజీవ రెడ్డి ఇందులో సభ్యులు. వీరు దక్షిణ రాష్ట్రాలను తమ చెప్పు చేతల్లో పెట్టుకొని, కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వాన్ని వారసత్వ పద్ధతికి దిగజార్చారు. శ్రీ నెహ్రూ అనంతరం—పరిస్థితులు అట్లా ఉండి, ఇతర నాయకులు కూడా దేశాన్ని కాలాన్ని గమనించి వ్యవహరించినందువల్లను, శ్రీ శాస్త్రి అందరికీ ఆమోదయోగ్యుడైన అభ్యర్థి అవడం చేతను, అప్పటికి ఆ వ్యవహారం సుగమంగా తేలిపోయింది. శ్రీ శాస్త్రి అనంతరం కూడా ''సిండికేట్'' వారు యీ నాయకత్వం వ్యవహారం ఇట్లానే తేలిపోవచ్చు ననుకున్నారు. కాని తేలిపోలేదు. నెహ్రూ అనంతరం, శ్రీ శాస్త్రి అనంతరం నడిచిన వ్యవహారంలో సామ్యము వైషమ్యము ఇక్కడే ఉన్నాయి. సామ్యం పార్లమెంటరీ పార్టీని వట్టి 'అగస్త్య భ్రాత'ను చేయడం; వైషమ్యం ''సిండికేట్'' ఆట అనుకున్నది అనుకున్నట్లు సాగకపోవడం.

శ్రీ నెహ్రూ అనంతరం కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీకి పోటీ లేకుండా నాయకుని ఎన్నిక జరిగినప్పుడు, ''సిండికేట్'' వారు అది తమ చాకచక్యము, తమ రాజనీతి అనుకున్నారు. అంతేగాక శ్రీ నెహ్రూ, శ్రీ శాస్త్రిని దగ్గరకు తీసి, తన తర్వాత ఆయనయే పార్టీకి నాయకత్వం వహించాలని చేతలచేతను, మాటలచేతను సూచించి ఉన్నందువల్లనూ, 'సిండికేట్' పని తేలిక అయిపోయింది. ఇందులో 'సిండికేట్' ఈ 'సిండికేట్' అధినేత—ఆయనే కాంగ్రెస్ అధ్యక్షుడు కూడాను—చాకచక్యంకాక, అప్పటి పరిస్థితి, అప్పుడు తక్కిన కాంగ్రెస్ నాయకులు చూపినవిచక్షణ వ్యవహారం ఒడుదుడుకులకు లోనుకాకుండా చక్కబెట్ట గల్గాయి. కాని ఇది 'సిండికేట్'లో భ్రాంతికి కారణమైంది. తామే అధిష్ఠాన స్థానంలో ఉన్నట్లు, ఇటు కాంగ్రెస్ సంస్థను అటు పార్లమెంటరీ పార్టీని హస్తగతం చేసుకున్నట్లు వారు భావించారు. శ్రీ శాస్త్రి మెత్తనివాడని, తాము ఆడించినట్లు ఆడవలయు మనిషి అని కూడా యీ 'సిండికేట్' వారు అనుకున్నారు. మరి తమ అండవలన కదా ఆయన పార్టీ నాయకుడైనది? అయితే వారిలో యీ భ్రాంతి ఎంతో కాలం నిల్వలేదు. శ్రీ శాస్త్రి వామనుడే కావచ్చు. కాని చేతలలో త్రివిక్రముడై వారి ఆశావకాశాలను అన్నింటిని ఆక్రమిస్తూ వచ్చాడు. అందువల్ల శాస్త్రి అనంతరం వారిలో వారికే ''ఎవరు అభ్యర్థి'' అన్న విషయంలో ఏకార్థమతిత్వం కుదరలేదు. మరి 'సిండికేట్'లో పార్టీ నాయకత్వం వహించగల దక్షుడు లేడు. ఒకవేళ ఉన్నా, పార్టీని మరీ బలవంతపెట్టకుండా ఆ పార్టీని ఆ అభిప్రాయానికి ఒప్పించగల శక్తి సంపన్నుడు లేడు. అందుకే ఆ 'సిండికేట్'లో ఒకరు ఆ 'సిండికేట్' అధినేతనే పార్టీ నాయకత్వానికి నిలబడవలసిందిగా సూచించడం జరిగింది. మరి ఒకరు శ్రీ నందానే పార్టీ నాయకుడుగా, ప్రధానిగా ఉంచి కొంతకాలం కొనసాగదీయడంమంచిదని సూచించినట్లు కూడా వదంతులు వ్యాపించాయి. ఈ 'సిండికేట్'లో ఈ తగాదాకు రెండు కారణాలు ఉన్నాయి. ఒకటి వారిలో పార్టీ నాయకత్వానికి దక్షుడైనవాడు లేకపోవడం: రెండు తమ అభ్యర్థి ఎవరు అన్న విషయంలో వారిలో వారికే ఏకీభావం లేకపోవడం.

అయితే శ్రీ శాస్త్రి మరణించిన వెంటనే దేశంలోనూ, విదేశాలలోను కూడా శ్రీ చవాన్ పార్టీ నాయకుడు, ప్రధాని కావడం దాదాపు తథ్యం అనుకున్నారు. అందుకు కారణాలను వివరించవలసిన పనిలేదు. కాని 'సిండికేట్'కు శ్రీ చవాన్ నాయకత్వం వహించడంగాని, ప్రధానిగా అధికారంలోనికి రావడంగాని యిష్టం వున్నట్లులేదు. పైగా ఇక్కడ గోవా వ్యవహారం ఒకటి

అడ్డువచ్చింది. ఆ సమస్యను పురస్కరించుకొని మైసూరువారు ఆయన అభ్యర్థిత్వాన్ని వ్యతిరేకించారు.

ముందు 'సిండికేట్' దృష్టికి శ్రీమతి గాంధి కూడా వచ్చినట్లులేదు. వారిలో కూడా ఆమెను అభ్యర్థిగా నిల్పడం ఇష్టంలేని వాళ్ళు ఉన్నారని, అందుచేతనే పోటీ తప్పదని వారు అనుకున్నారని, తర్వాత తమ సంగతి ఆలోచించుకొని శ్రీమతి ఇందిరా గాంధిని అభ్యర్థిగా బలపరచడానికి నిశ్చయించుకున్నారని చెప్పడానికి తగు ఉపపత్తులు ఉన్నాయి.

(1) శాస్త్రి అనంతరం ఎవరు? వారిని ఎన్నికచేసే పద్ధతి ఏమిటి? అని ఆలోచించడానికి కాంగ్రెస్ కార్యవర్గం సమావేశం అయినప్పుడు (జనవరి 14) ఆ సమావేశంలో అభ్యర్థి అన్నది ఎవరో తేలలేదు. సరిగదా, బహుళసభ్యాభిప్రాయ సేకరణం పద్ధతి కూడా కార్యవర్గంలో అందరి అంగీకారానికి రాలేదని తెలుతున్నది. ఎందుచేతనంటే, కాంగ్రెస్‌వర్గం కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీలో నాయకుని ఎన్నిక సందర్భంలో అనుసరించదగు పద్ధతిని మాత్రమే సూచించిందిగాని, మరి ఇంకో మాట ఏమీ చెప్పలేదు.

(2) కార్యవర్గం తీర్మానంలో వివరించబడిన ఎన్నిక పద్ధతిని పరిశీలించినట్లయితే, ఒకరుకాదు, ఇద్దరుకాదు—అంతకన్నా ఎక్కువమందే కాంగ్రెస్‌పార్లమెంటరీపార్టీ నాయకత్వపు ఎన్నికకు నిలబడే ఎత్తు కన్పించింది. ఆ స్థితికి ఒక్క కార్యవర్గమే గాక, 'సిండికేట్' వారు కూడా అప్పటికి తమ్ము తాము సర్దుబాటు చేసుకున్నట్లు అర్థం అవుతుంది.

(3) ఆ రోజుల్లో ఢిల్లీనుంచి పత్రికలకు వచ్చిన వార్తలలో కూడా ఏ ఒక రిద్దరి పేర్లో కాక నల్గురు ఐదుగురిపేర్లు ఈ నాయకత్వానికి పోటీ చేయుగలరని వినవచ్చాయి. అట్టి పేర్లలో శ్రీయుతులు చవాన్, నందా, మొరార్జీదేశాయ్, ఇందిరా గాంధి, సంజీవరెడ్డిగార పేర్లు ఉన్నాయి.

(4) కాంగ్రెస్ కార్యవర్గంగాని, పార్లమెంటు సభ్యులు గాని తాము ఫలానావారిని పార్టీ నాయకత్వానికి అభ్యర్థిగా అనుకుంటున్నామని ప్రకటించక పోవడంవలన కూడా, అప్పటికి ఈ నాయకత్వపు అభ్యర్థిత్వానికి ఫలానావారు అంటూ ఎవరూ నిర్ణయం కాలేదని, పోటీద్వారా, ఎన్నిక ద్వారా నాయకత్వపు వ్యవహారం నిర్ణయం కావడమే యోగ్యమని కాంగ్రెస్ పెద్దలంతా నిశ్చయించుకున్నట్లు విదితం అవుతున్నది.

(5) శ్రీ మొరార్జీదేశాయ్ తాము కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వానికి పోటీ చేస్తామని ప్రకటించారు. అంటే కాంగ్రెస్ కార్యవర్గంగాని, పార్లమెంటరీ పార్టీ కార్యవర్గం గాని, కాంగ్రెస్ కార్యవర్గం సమావేశానికి హాజరైన ముఖ్య మంత్రులుగాని పోటీ లేకుండా యీ వ్యవహారం తేలదని, కాబట్టి ఈ నాయకత్వ సమస్యను పోటీ ద్వారానే పరిష్కరించుకొనడం మంచిదని అన్న అభిప్రాయానికి వచ్చినట్లు అర్థం చేసుకొనక తప్పడంలేదు. అట్లాగాక ఏకగ్రీవమైన అభ్యర్థిని ఎంచి, ఆ అభ్యర్థిని పార్లమెంటరీ పార్టీ ముందు వుంచాలన్న అభిప్రాయమే యీ అందరిలో వున్నట్లయితే, ఆ ప్రకారంగా వారు యీ వ్యవహారాన్ని తేల్చాలని అనుకున్నట్లయితే, శ్రీ మొరార్జీదేశాయ్ తమ అభ్యర్థిత్వాన్ని ప్రకటించి వుండేవారేకాదు.

ఇన్ని కారణాలవలన కాంగ్రెస్ కార్యవర్గం ఏమి, ఇంకా ఇతరులేమి ఈసారి కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వం పూర్తిగా ప్రజాస్వామ్య పద్ధతిని అనుసరించి పార్లమెంటరీపార్టీ ఇష్టానుసారమే నిర్ణయం కావాలని అనుకున్నట్లు విశదం అవుతున్నది. అంతేగాక ఇక్కడ కాంగ్రెస్ కార్యవర్గం, పార్లమెంటరీ పార్టీ నాయకత్వ అభ్యర్థిత్వ నిర్ణయం వ్యవహారంలో కాంగ్రెస్ అధ్యక్షునకు ఏ రకమైన అధికారాన్ని ఇవ్వకపోవడం కూడా గమనించదగివుంది. ఈ పై ఉదంతాన్నిబట్టి రెండు సంగతులు స్పష్టంగా వ్యక్తం అవుతున్నాయి. (1) కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వానికి ఒకరుకాదు, ఇద్దరుకాదు, 'పదిమంది అయినా పోటీ చేయువచ్చునని ముందు అనుకున్నారు. (2) ఇందులో కాంగ్రెస్ కార్యవర్గం కాంగ్రెస్ అధ్యక్షుని ప్రమేయాన్ని తప్పించింది. అంటే ఆయనకు ఎటువంటి అధికారము ఇవ్వలేదు.

## 3

పరిస్థితి ఇంతవరకు వచ్చిన వేళకు తేలిన విషయం ఒక్కటే. కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వానికి పోటీ చేస్తానని బహిరంగంగా చెప్పి నిలబడిన మనిషి ఒక్కడే కనబడినాడు. ఆయన శ్రీ మొరార్జీదేశాయ్. అందువల్ల ఈ వ్యవహారంలో ఏమి ప్రయత్నం జరిగినా అది ఒక అందుకు జరిగినట్లు మాత్రం అర్థం చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడిపోయింది. కాంగ్రెస్ నాయకులలో కొందరికి పార్టీ నాయకుడుగా, అనగా ప్రధానమంత్రిగా శ్రీ మొరార్జీ రావడం ఇష్టంలేదు. ఆయన్ని ఆ పదవికి రాకుండా చేయడానికి కార్యవర్గం అనుమతి లేకుండా, అభ్యనుజ్ఞ లేకుండా శ్రీ కామరాజు జరిపిన ప్రయత్నాలుచూస్తే ఆయనకు ముఖ్యంగా శ్రీ మొరార్జీ పార్టీ నాయకుడు, తద్వారా భారత ప్రధాని కావడం ఇష్టంలేని విషయమని వ్యక్తమవుతున్నది. అనగా 'సిండికేట్'కు ఇష్టంలేదని అర్థం. ఈ 'సిండికేట్' సభ్యులు ఏ విషయాలలో కలిసినా, కలియకపోయినా శ్రీ మొరార్జీ అభ్యర్థిత్వాన్ని వ్యతిరేకించడం విషయంలో మాత్రం వారిలో ఏకార్థమతిత్వం కుదిరింది. అయితే ఇది కుదిరినా 'ఎవరు అభ్యర్థి' అన్న విషయంలో వారి మనస్సులు ఇంకా ఒక్కటైనట్లులేదు. అప్పటికే శ్రీ కామరాజు మనస్సు శ్రీమతి ఇందిరాగాంధిమీదకు ప్రాకి వుండిఉండవచ్చు. ఈ విషయాన్ని తేల్చి చెప్పేందుకు తగిన ఆధారాలు కన్పించవు. కాని శ్రీమొరార్జీని పైకిరానీయరాదన్న విషయంలో శ్రీ కామరాజుకు ఆదినుంచీ పట్టుదల ఉండిఉంటుంది.

అయితే ఈ నాయకత్వానికి అభ్యర్థిని నిర్ణయించే వ్యవహారంలోకాంగ్రెస్ కార్యవర్గం శ్రీకామరాజుకు ఎటువంటి అధికారమున్నూ ఇవ్వలేదు. అందుచేత ఆయన ఆ అభ్యర్థిని నిర్ణయించ

# కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ నాయకత్వం వ్యవహారం

డానికి స్వయంగా పూనుకున్నారు. ఆయనకు ఇక్కడ ఒక్కటే ఆలోచన. ఆ అభ్యర్థి తన అభ్యర్థిగా మాత్రం చలామణీ కాకూడదు. అందుచేత ఆయన ఒకఎత్తు ఎత్తారు. ఈ ఎత్తును ఎత్తేవేళకే తన అభ్యర్థి విషయంలో 'సిండికేట్' లో ఏకాభి ప్రాయాన్ని సాధించిఉంటారు. ముందు ఆయన అనుకున్న అభ్యర్థిని కాదనినవాళ్లు కూడా, ఇప్పుడు యీ పరిస్థితిలో ఆయన్ను—ఇష్టంఉన్నా లేకపోయినా—బలపరిచి ఉంటారు. ముందు ఈ ఏకాభిప్రాయాన్ని సాధించి ఆ అనంతరం శ్రీ కామ రాజు తన అభ్యర్థిని నెమ్మదిగా రంగంలోనికి దింపడం ఆరంభం చేశారు. ఇది అంతా ఆయనకు ఏమీ సంబంధం లేదన్న విధంగా జరిగింది. ఆ కథ నడిచిన పద్ధతి ఇది.

ఒకరోజున హఠాత్తుగా కొందరు ముఖ్యమంత్రులు సమా వేశం అయినారు. సమావేశం మధ్యప్రదేశ్ భవనంలో జరిగింది. అంటే మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ డి. పి. మిశ్రాను ఇక్కడ శ్రీ కామరాజు ఉపయోగించుకున్నారని అర్థం. నెహ్రూ కుటుం బంతో పూర్వం శ్రీ మిశ్రా సంబంధాలు ఎట్లా ఉన్నా, ఇప్పుడు అత్యంతముసన్నిహితంగా ఉన్నాయని అంటారు. శ్రీనెహ్రూ మరణం అనంతరమే శ్రీమతి ఇందిరాగాంధికి పార్టీనాయకత్వం సమ కూర్చడంకోసం ఆయన కృషి చేశారన్న వదంతులు గూడా ఉన్నాయి. ఇప్పుడు ఆయనకు బ్రహ్మాండమైన అవకాశం చిక్కింది. అయితే ఈ ముఖ్యమంత్రుల సమావేశాలు ఒకటి కాదు, రెండు జరిగాయి అంటారు. మొదటి సమావేశానికి నల్గురో ఐదుగురో హాజరైనారనీ, అప్పుడు వారు ఇతమిత్థమైన అభిప్రాయానికి రాలేకపోయినారని కొందరు చెబుతారు. ఇది నిజం కావచ్చు. కాకపోవచ్చు. మధ్యప్రదేశ్ భవనంలో జరిగిన ముఖ్యమంత్రుల సమావేశంలో శ్రీమతి ఇందిరాగాంధి అభ్య ర్థిత్వం అంతవరకు అవ్యక్తంగా ఉంచబడింది, ఇప్పుడు వ్యక్త స్థితికి వచ్చింది. ఒక 7—8 రాష్ట్రాల ముఖ్య మంత్రులు ఒక నిర్ణయం చేసుకొని, మేము ఇట్లా నిర్ణయం చేసుకున్నామని కాంగ్రెసు అధ్యక్షునకు విన్నవించుకున్నారు. ఆ తర్వాత కాంగ్రెస్ అధ్యక్షుడు వెళ్లి శ్రీమతి గాంధికి విన్నవించారు. అది అంతా వట్టి పొత్తుగాంగావుంది. కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ అంటూ ఉండగా యీ ముఖ్యమంత్రులు ఎవ్వరు—పార్టీ నాయ కత్వానికి అభ్యర్థిని నిర్ణయించడానికి—అన్న ప్రశ్న ఉదయించింది. ఈ ప్రశ్నకు అప్పుడు చెప్పబడిన సమాధా నము, చూపించబడిన ఉక్తి ఎంతమాత్రము సహేతుకంగాలేవు.

ఇక్కడ శ్రీ కామరాజు ఒక పనిచేసివుంటే ఎంతో ఉచితంగా వుండేది. ఈ వ్యవహారాన్నిగూర్చి మీరు పార్లమెంటరీ పార్టీతో మాట్లాడితే బాగుంటుంది— అని ముఖ్యమంత్రులతో చెప్పి వుండవలసింది. అట్లా చెప్పని కారణంచేతనే ఇందులో ఆయనకు సంబంధం వున్నదని అర్థం అయిపోతున్నది.

ఇది ఇట్లా జరుగుతూ ఉండటం చూచే ప్రతిపక్షాలకు చెందిన నాయకులు కొందరు యీ సర్వ ప్రయత్నాన్ని నిరసిం చారు. కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ ఏ హక్కులను వినియో గించవలసి వున్నదో దానిని ముఖ్యమంత్రులు భుక్తం చేసుకుం టున్నారని, ఇది పార్లమెంటరీ ప్రజాస్వామ్య ధర్మ విరుద్ధమని విశదం చేశారు. ప్రతిపక్షాలకు చెందిన నాయకులు చేసిన ప్రకటనలు మొత్తం రెండు ఉన్నాయి. రెండో ప్రకటనలో వీరు ఈ పార్టీ నాయకత్వపు నిర్ణయ వ్యవహారాన్ని చాలా చక్కగా వ్యాఖ్యానించారు. వెనుక ఢిల్లీ పాదుషాలకాలంలో పాదుషాలు బలంగా ఉన్నప్పుడు వారు తమ సుబేదార్లను నియమించేవారని, పాదు షాలు బలహీనులైనప్పుడు సుబేదార్లు పాదుషాలను నియ మిస్తూ వచ్చారని, ఇప్పుడు కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వ సమస్యలో సుబేదార్లు పాదుషాను నిర్ణయించే పరిస్థితి దాపురించిందనీ, ఇది ఉన్నతికిగాక, అధోగతికి లక్షణం అని స్పష్టం చేశారు.

ఒక్క ప్రతిపక్షాలవారేకాదు. కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ సభ్యులు కూడా కొందరు ముఖ్యమంత్రుల యీ పద్ధతిని నిరసించారు. ఇది ఏమీ శ్రీ కామరాజునకుగాని, ఆయన వెనుక చేరిన ఇతరులకుగాని పట్టలేదు. విచిత్రం ఏమంటే కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీకే పట్టలేదు. ఆ పట్టినవారు ఒకరో ఇద్దరో లేక అంతకంటే ఎక్కువమందో ఉన్నా వారిలో శ్రీ హనుమంతయ్య వంటివారు మాత్రమే బహిరంగంగా ఇది మంచి పద్ధతి కాదని చెప్పారు. ఈ పార్టీలో 510 మంది సభ్యులు ఉన్నారు. అధిక సంఖ్యాకులు ఈ వ్యవహారంలో మౌనం వహించారు. అనగా, పార్లమెంటరీపార్టీ ఇక్కడ తాను అంటూ ఒకటి ఉన్నట్లు మరిచిపోయింది. కాంగ్రెస్ కార్యవర్గం అభ్యనుజ్ఞ అంటూ లేకుండా కాంగ్రెస్ అధ్యక్షుడుగాని, ముఖ్యమంత్రులుగాని ఇటువంటి యత్నం చేయవచ్చునా? అని అడిగినవారు అట్టేమంది కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీలోగాని, కాంగ్రెస్ సంస్థలోగాని లేకపోయినారు.

ఇప్పుడు 'సిండికేట్'', ముఖ్యమంత్రులు కలిసి, ఒక్క అబలను ముందు పెట్టుకొని, శ్రీ మొరార్జీ తలవంచడానికి బ్రహ్మ ప్రయత్నం ఆరంభం చేసినట్లు ప్రజలలో ఒక భావం ఏర్పడిపోయింది. శ్రీమతి గాంధి అంటే వైమనస్యం ఎవ్వరికీలేదు. కాని ఆమె అభ్యర్థిత్వాన్ని ముఖ్యమంత్రులు వ్యక్తపరచిన పద్ధతి, ఆ తర్వాత ఏకగ్రీవాభిప్రాయసాధనపేర జరిగిన తంతు ఎంతమాత్రం సమంజసంగాలేవు.

నిజంగా ఏకగ్రీవాభిప్రాయమే ఈ నాయకత్వంవ్యవహారంలో అవసరమనుకుంటే, ఆ అభిప్రాయాన్ని శ్రీ మొరార్జీ అభ్యర్థిత్వం కోపమే సాధించవచ్చుగదా! ఆయనా కాంగ్రెస్‌వాడే. ఆయనా దేశసేవ చేసినవాడే. దేశసేవలో ఢక్కా మొక్కీలు తిన్నవాడే. ఈ అన్నింటికీమించి పరిపాలనా నిర్వహణలో అనుభవం కలవాడు. అటువంటి పరిస్థితిలో శ్రీమతి గాంధీ అభ్యర్థిత్వాన్ని ఆమోదిస్తేనే అది ఏకాభిప్రాయాన్ని సాధించినట్లు అవుతుంది, లేకపోతే కాదు అని అర్థం చెప్పుకోవలసిన పద్ధతిని తెచ్చిపెట్ట డాన్ని ఏమనాలి?

ఈ ఏకాభిప్రాయ సాధనకోసం జరిగిన ప్రయత్నం కూడా, అది నడిపించబడిన ధోరణినిబట్టి ఒక విధమైన నటనగా కన్పిస్తుంది. ఏలననగాముఖ్యమంత్రులు శ్రీమతిగాంధీని పార్టీనాయ కత్వానికి అభ్యర్థిగా నిర్ణయించినప్పుడు వారు ఇటు కాంగ్రెస్ సంస్థ అగ్ర నాయకులనుగాని, అటు కాంగ్రెస్ పార్లమెంటరీ

పార్టీలోనివారినిగాని సంప్రదించలేదు. అవతల ముందుగా తన అభ్యర్థిత్వాన్ని ప్రకటించిన శ్రీ మొరార్జీ దేశాయిని కలుసుకొని మాట్లాడలేదు. హఠాత్తుగా సమావేశమై, హఠాత్తుగా నిర్ణయం చేశారు. ఆ అభ్యర్థిని శ్రీ కామరాజు తన అభ్యర్థి అని ఎన్నిక ఆవశ్యకమైన సందర్భంలో కూడా అనలేదు. కాని దేశం అంతటా అందరికీ అసలు విషయం ఏమిటో అర్థం అయిపోయింది. ప్రజాస్వామ్య మార్గమో, అప్రజాస్వామ్యమార్గమో, ఏవిధంగానైనాసరే శ్రీ మొరార్జీని నాయకత్వ స్థానంలోనికి రానీయకూడదు. అందుకోసం ఏమి చేసినా తప్పులేదు. ఆవిధంగా ఇది అంతా జరిగింది.

## 4

కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వ స్థానానికి ముఖ్యమంత్రుల అభ్యర్థిగా శ్రీమతి ఇందిరాగాంధిని నిర్ణయించిన అనంతరం జరిగిన సంగతులు సంఘటనలు పరిశీలిస్తే శ్రీ మొరార్జీని వోడించడానికి 'సిండికేట్' నాయకుడు ఎంత హంగామా చేయవలసి వచ్చింది అర్థం అవుతుంది. శ్రీ మొరార్జీ యేమో తాను పోటీనుంచి వైదొలగడం జరగదని స్పష్టంగా చెప్పివేశారు. ఆయన అభ్యర్థిత్వాన్ని పురస్కరించుకొని తగు ప్రయత్నాలు కూడా ఆరంభం అయినాయి. ఆయనను బలపరుస్తున్న వాళ్లను, బలపరుస్తున్నామని చెబుతున్నవాళ్లను ఇవతలికి లాగాలి. అందుకోసం ఇవతలివారు ప్రయత్నాలు ఆరంభం చేశారు. ఏ ప్రయత్నం లేకుండా శ్రీమతి ఇందిరాగాంధి నెగ్గే ఎత్తులేదని వారికి అర్థం అయిపోయింది. అందు నిమిత్తం ఎన్నిక రేపనగా వివిధ రాష్ట్రాల ముఖ్యమంత్రులు తమ తమ రాష్ట్రాలనుండి వచ్చిన పార్లమెంటు సభ్యులను [కాంగ్రెస్‌వారిని] సమావేశపరచి, వారికి ఏమి చెప్పాలో ఆ మాటలు చెప్పారు. ఆ పార్లమెంటుసభ్యులు శ్రీమతి గాంధికిఅనుకూలంగావోటుచేయనున్నట్లు ప్రకటనలు వెలువరించబడినాయి. ఈలోగా శ్రీ కామరాజు ఏకాభిప్రాయ సాధన కోసం, "ఏకగ్రీవంగా నాయకుని ఎన్నిక" జరిగేందుకోసం ప్రయత్నాలు ఆరంభించారు. శ్రీ అతుల్యఘోష్‌ను శ్రీ మొరార్జీవద్దకు పంపారు. ఇది శ్రీమతి గాంధిని ముఖ్యమంత్రులు అభ్యర్థిగా నిర్ణయించారు అని చెప్పడానికి జరిగిందట. ఆయన చెప్పారు. శ్రీ మొరార్జీ ఆ అనంతరం పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ "తాను. పోటీనుంచి విరమించడం అన్న ప్రశ్న లేద'ని విశదం చేశారు. ఈ సందర్భంలో ఆయన ఇంకో మాట అన్నారు. తాను పార్లమెంటు సభ్యుల అభ్యర్థిని అన్నారు. ముఖ్యమంత్రులు ఓటర్లు కాదన్నారు. ఈ ఒక్కమాటలో అప్పుడు ఢిల్లీలోనడిచిన సర్వ వ్యవహారము, ఢిల్లీలో ఏర్పడిన సర్వమైన పరిస్థితి వ్యాఖ్యానం అయిపోయినాయి. ఇంకోసందర్భంలో శ్రీ దేశాయ్, పార్లమెంటు సభ్యులపై ఒత్తిడులు మొదలైనవి జరుగుతున్నట్లు తెల్పి, అది మంచి పని కాదని హెచ్చరించారు. శ్రీమతి ఇందిరాగాంధిని బలపరుస్తున్నవారు ఈ "ఒత్తిడులు మొదలైనవి జరగలేద"ని అన్నా, ముఖ్యమంత్రులు పార్లమెంటు సభ్యులను సమావేశపరచడం, వారివలన వాగ్దానాలను మూక ఉమ్మడి పద్ధతిలో ప్రకటింపచేయడం—దీనిని ఏమనవలసి ఉంటుందో ఎవరికీ అర్థంకాలేదు. పార్లమెంటరీపార్టీ అంటూ ఒకటి ఉండగా, కాంగ్రెస్ కార్యవర్గం అంటూగూడా ఒకటిఉండగా, తామెవరము ఇంత పనిచేయడానికని ఈముఖ్యమంత్రులు ప్రశ్నించుకోలేదు. ఇక్కడ సంఘటన పడిన విషయాన్ని పర్యాలోచనచేస్తే యీ ముఖ్యమంత్రులు అటు కాంగ్రెస్ సంస్థయొక్క ఉన్నత కార్య నిర్వాహకవర్గాన్ని, ఇటు కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ ఉనికిని గూడా గుర్తించక తామే స్వయంభువులమైనట్లు వ్యవహరించారనిపిస్తుంది

నిజంగా అంతేనా? ఈ ముఖ్యమంత్రులను ఇట్లా త్రిప్పిన కీలకం అంటూ వెనుక ఏమీలేదా? ఈవిషయాన్ని శ్రీమతి గాంధి తెలిసిగాని, తెలియకగాని అన్న ఒక్క మాటలో చెప్పివేశారు. "శ్రీ కామరాజు నన్ను మాట్లాడవద్దన్నారు. నన్ను ఎక్కడికి కదలవద్దన్నారు. ఇంట్లో కూర్చోమన్నారు. శ్రీ కామరాజు ఎట్లా చెబితే అట్లా చేయగలదానను". ఈ మాటలతో శ్రీ కామరాజు తాను దాస్తున్నానని అనుకున్న రహస్యం కాస్తా బయటకు వచ్చేసింది.

కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ నాయకత్వం వ్యవహారంలో నడిచిన రాజకీయంయొక్క స్వరూపం ఇట్లా ఉంది. ఇందులో ఒక వ్యక్తితో తమ బలాలను చూచుకోడానికి 'సిండికేట్' వారు ఇంత పని చేశారు. ఇది ధైర్యంతో, ఆత్మ విశ్వాసంతో చేసిన పనికాదు. చివరిదాకా యీ 'సిండికేట్' నాయకునకు తాను వేసిన ఎత్తు ఏమవుతుంది అన్న భయం లేకపోలేదు. ఆ భయమే లేనిపక్షంలో ముందుగానే ఆయన శ్రీ మొరార్జీని కలుసుకొని వున్నవిషయం ఉన్నట్లు చెప్పివేసేవారు. "నీవు గెలవవు తగ్గు" అని హెచ్చరించి వచ్చేవారు. అట్లా చేయలేదు. పైన చెప్పబడిన కార్యక్రమం అంతా నడుస్తూ ఉండగా శ్రీ కామరాజు శ్రీ మొరార్జీవద్దకు శ్రీ జగ్జీవనరామ్‌ను దూతగా పంపారు. ఆ దౌత్యం జరిగే అంతవరకు శ్రీ జగ్జీవనరామ్ ఎటు ఉన్నదీ తెలిసిన జాడ కన్పించదు. ఆ దౌత్యంతో విషయం తేలిపోయింది. నిజంగా అప్పుడు శ్రీ మొరార్జీ శ్రీ జగ్జీవనరామ్‌ను సంబోధించి "ఎట్యుబ్రూట్" అని అనివుండవలసింది. అనలేదు. శ్రీ మొరార్జీది జూలియన్ సీజర్ తత్వంకాదు. శ్రీ మొరార్జీ ఒక సందర్భంలో అన్నట్లు కాంగ్రెస్ అధ్యక్షుని అభ్యర్థి శ్రీమతి గాంధి అని ఇక్కడ తేలిపోయింది. శ్రీ మొరార్జీమీద ఆమెను పోటీకి నిలిపారు. అంతే. అందువల్ల ఇక్కడ పోటీ అభ్యర్థి శ్రీమతి ఇందిరాగాంధిగాని, శ్రీ మొరార్జీ కాదన్నది విశదమైన అంశం.

ఈ పోటీ ఎట్లా నడిచింది? తాము చేసిన ప్రయత్నం అంతటిఫలితంగా శ్రీ మొరార్జీకి అట్టే వోట్లుపడవని, శ్రీమతి ఇందిరాగాంధి విజయం నల్లేరుమీద బండి నడకవతుగా సాగిపోతుందని అనుకున్నారు. ఈ విషయాన్ని వ్యంగ్యంగా నిరూ

పిస్తూ హిందూస్తాన్ టైమ్సు పత్రిక ఒక కార్టూన్‌ను కూడా అచ్చువేసింది. శ్రీ మొరార్జీకి మొత్తం పార్లమెంటరీ పార్టీలోని వోట్లలో 32 శాతం దాకా పడ్డాయి. ఇక్కడ శ్రీమతి గాంధీకి ఎన్ని వోట్లు పడ్డాయన్నది ప్రశ్న కాదు. శ్రీ మొరార్జీకి ఎన్ని వచ్చాయన్నదే ప్రశ్న. ఈ ప్రశ్నను పరిశీలించి దానికి జవాబు వెదికితే, శ్రీమతి ఇందిరాగాంధీని నిలిపి 'సిండికేట్' నాయకుడు సాధించిన విజయం ఆయన ఆశించినంతగా లేదని తేలిపోతుంది. మొత్తం వోట్లలో సంఖ్య వల్లనేగాక, రాష్ట్రాలవారిగా ఆ వోట్లను గురించి ఆరాను గణించినా శ్రీ మొరార్జీ అపజయం అపజయంకాదని, ఒక విధంగా విజయమేనని స్పష్టపడుతుంది. ఎందుచేతనంటే శ్రీ మొరార్జీకి ఒక్క వోటు కూడా పడరాదన్న బ్రహ్మ ప్రయత్నం జరిగిన సందర్భంలో ఆయనకు 169 వోట్లదాకా వచ్చాయి అంటే, దానిని ఏమనాలి? పరిశీలకులు వేసిన అంచనాలనుబట్టి ఆ వోట్ల వివరాలు ఇట్లా ఉన్నాయి.

| రాష్ట్రం | మొరార్జీకి పడినవి. |
|---|---|
| ఉత్తరప్రదేశ్ (84) | 35 |
| బీహార్ (60) | 24 |
| పంజాబ్ (21) | 11 |
| గుజరాత్ (26) | 24 |
| మైసూరు (37) | 5 |
| మహారాష్ట్ర (57) | 15 |
| రాజస్థాన్ (22) | 6 |
| కాశ్మీర్ (10) | 6 |
| ఒరిస్సా (22) | 7 |
| అస్సాం (17) | 5 |
| ఆంధ్రప్రదేశ్ (45) | 9 |
| కేరళ (10) | 3 |
| బెంగాల్ (34) | 7 |
| తమిళనాడు (44) | 3 |
| మధ్యప్రదేశ్ (37) | 9 |

ఇట్లా మొత్తం 169 వోట్లు శ్రీ మొరార్జీకి వచ్చాయి. శ్రీమతి గాంధికి 355 వోట్లు వచ్చాయి. ఇది ఆమెకు లభించిన గొప్ప విజయంగా చెప్పుకోవచ్చు. కాని తత్కాలపరిస్థితినిబట్టి, అప్పుడు జరిగినప్రయత్నము, హంగామాలనుబట్టి ఇది గొప్ప విజయము అనలేము. ఇక్కడ శ్రీ మొరార్జీ అపజయాన్ని పొందినా, నైతికంగా అది ఆయనకు విజయంగా పరిణమించినట్లే చెప్పవచ్చు.

## 5

శ్రీ మొరార్జీ అపజయానికి కారణం 'సిండికేట్'తోసహా కాంగ్రెస్‌అధ్యక్షుడు,ముఖ్యమంత్రులుచేసినబ్రహ్మప్రయత్నమేనని పై ఉదంతం అంతటివల్లను విదితం అవుతున్నది.

అయితే ఒకదేశంలో కేంద్రము, రాష్ట్రాలుఅన్న విభాగంవున్నప్పుడు, కేంద్రం అధికారాలు, రాష్ట్రాల అధికారాలు స్పష్టంగా చెప్ప బడినప్పుడు, కేంద్రానికి సంబంధించిన వ్యవహారాలలో రాష్ట్ర ముఖ్యమంత్రులు ప్రమేయం పెట్టుకోవచ్చునా అన్నది ఇక్కడ ప్రశ్న అయిపోయింది. ముఖ్యమంత్రులు ప్రమేయం పెట్టు కొనడం సబబేనని వాదించేవారిలో కొందరు—అమెరికాలో జరిగే పద్ధతులను ఇక్కడ ఉపపత్తులుగా ప్రదర్శించడం జరుగుతున్నది. అయితే వీరు ఒక్క విషయాన్ని విస్మరిస్తున్నారు. అమెరికాలో అమలులో ఉన్న రాజ్యాంగ పద్ధతికిన్నీ, మనదేశంలో అమలులోవున్న రాజ్యాంగ పద్ధతికిన్నీ అసలే సంబంధంలేదు. మనదేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అమలు జరుగుతున్నది. అమెరికాలో అట్లాకాదు. అక్కడ అధ్యక్ష పద్ధతి రాజ్యాంగ ధర్మం చెల్లుతున్నది. ఈ రెంటికి పోలిక పెట్టడం విషయం తెలిసి చేస్తున్న పనికాదు. కాగా ఈ ముఖ్యమంత్రులు పూర్వం ఎప్పుడూలేనిది ఇప్పుడే ఎందుకు యీ ప్రమేయం పెట్టుకొనవలసి వచ్చింది? అన్న ప్రశ్న కూడా వుంది. ఇందుకు "వెనుక కీలక" సమాధానం వినా వేరే సమాధానం కుదరదు.

భారతదేశం ఫెడరల్ పద్ధతి రాజ్యాంగం గనుక, కేంద్రానికి సంబంధించిన ముఖ్య వ్యవహారంలో ముఖ్య మంత్రుల ప్రమేయం కూడా అవశ్యకం అని వాదించే పక్షంలో, ఆ పద్ధతి ఇప్పుడే ముఖ్యమా, ఇక ముందు కూడా ముఖ్యమే అవుతుందా? అన్న ప్రశ్న ఉదయిస్తుంది. ఇప్పుడు దేశంలో సర్వేసర్వత్రా కాంగ్రెస్ పార్టీ ఏలుబడి సాగుతున్నదిగనుక సరిపోయింది. అట్లాకాక కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెస్, కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసేతర పక్షాలు అధికారంలోవున్న సందర్భాన్ని వూహించుకొని ఆలోచిస్తే అప్పుడు కూడా ఇదే పద్ధతి అనుసరింపబడుతుందా అన్న ప్రశ్నకుసమాధానంకుదరవలసివుంది.ఇప్పుడు శ్రీమతి ఇందిరా గాంధీ—మొరార్జీ దేశాయి వ్యవహారంలో యీ ముఖ్యమంత్రులు కాంగ్రెస్ నాయకులహోదాలలోగాక ముఖ్యమంత్రులహోదాలలో వ్యవహరించారు. ముఖ్యమంత్రి అయినవాడు ఇటువంటి పని చేయవచ్చునని రాజ్యాంగంలో ఎక్కడగాని వ్రాయబడి ఉండలేదు. మనది లిఖిత రాజ్యాంగం అన్న విషయం ఇక్కడ మరిచి పోకూడదు.ఇట్లా చూస్తే ఇప్పుడు ముఖ్యమంత్రులు చేసిన పని—అది కాంగ్రెస్ పార్లమెంటరీ నాయకుని ఎన్నిక విషయంలోనే అయినా—రాజ్యాంగ విరుద్ధము—అనుచిత సంప్రదాయ పరికల్పనము అవుతున్నది. రాష్ట్రస్థాయి మనస్తత్వాలతో ఉన్నత రాజకీయాలలో వ్యవహారాలు చేయబూనుకున్న సందర్భాలలో ఇటువంటి ఎగుడుదిగుడుపరిస్థితులే సంభవం అవుతూ ఉంటాయి.

భారతదేశంలో ప్రజాస్వామ్యం ఇంకా బాల్యావస్థలో వుంది. దానిని పరిరక్షించుకొనడం, పటిష్ఠం చేసుకొనడం రాజకీయపక్షాలయొక్కయేగాక ప్రజల అందరి బాధ్యతా అయి

వుంది. ఇప్పుడు దేశంలో ప్రజలలో 42 శాతం వోట్లతో మాత్రమే అధిక సంఖ్యాకస్థానాలను సముపార్జించి అధికారాన్ని నెరపుతున్న కాంగ్రెస్‌పార్టీ మరీ జాగ్రత్తగా, మరీ సత్సంప్రదాయనిష్ఠంగా వ్యవహరించ వలసివుంది. ఒక పార్టీ అంటూ ఉన్నప్పుడు, ఆ పార్టీకి ఒక కార్యక్రమం అంటూ ఉన్నప్పుడు దానిని ఆ పార్టీకి చెందిన ఎవరు అధికారంలోనికి వచ్చినా అమలు జరపవలసే ఉంటుంది. పైగా మనదేశంలో ఇట్లా పార్టీల కార్యక్రమంకన్నా ప్రణాళికా సంఘంవారి కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి. ఆ ప్రణాళికలను పార్లమెంటు ఆమోదించిన అనంతరమే అమలు చేస్తున్నారు. అందువల్ల అది ఏ ఒక్క పార్టీ కార్యక్రమంకాక, దేశం అంతా ఆమోదించిన కార్యక్రమం అవుతున్నది. ఆ కార్యక్రమాన్ని వ్యతిరేకించిన వారు, వ్యతిరేకిస్తున్నవారు ఉండవచ్చు. అది సహజం. పైగా వేరు విషయం. అయితే కాంగ్రెస్ పార్టీ ఆ కార్యక్రమాన్ని తనదిగా ఆమోదించి అమలు పరుస్తున్నది గనుక, కాంగ్రెస్ వాదులై, అధికారంలోనికి వచ్చినవారు ఎవ్వరూ దాన్ని తప్పి నడిచే ఆస్కారంలేదు. అందువల్ల ఇక్కడ నిజానికి వ్యక్తుల ప్రసక్తికన్నా, అనుభవము, దక్షత ప్రధానం అవుతున్నాయి. కనుక ఫలానా వ్యక్తి అధికారంలోనికి వస్తే కొంప మునిగి పోతుందని, ఫలానా వ్యక్తి అధికారంలోనికివస్తే కాంగ్రెస్‌కు, దేశానికి శ్రేయస్సు ఒనకూడుతుందని వాదించడంలో అర్థం లేదు. అట్లా వాదించడం బలహీనతకు గుర్తు. ఇప్పుడు కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ నాయకత్వం ఎన్నిక వ్యవహారంలో ముఖ్య మంత్రులు కల్పించుకున్నారన్నా, ఫలానా వ్యక్తి నాయకత్వాన్ని చేబట్టితేనే వచ్చే ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ విజయానికి ఉపస్కారం ఏర్పడుతుందని వాదించినా, అది కాంగ్రెస్ సంస్థలో ప్రబలమై పుట్టుకువస్తున్న బలహీనతకు, దౌర్బల్యానికి, నిస్సహాయస్థితికి ఉపపత్తులుగా ప్రతిభాసం చెందుతున్నాయి. ఈ విషయాన్ని కాంగ్రెస్‌వారు గుర్తించక పోవచ్చు. దేశంమాత్రం గుర్తించింది.

---



# గ్రంథ విమర్శలు

## మధుమాసము

[కృష్ణపక్షము—శుక్లపక్షము]

(కర్త:—విద్వాన్ బీర్నీడి ప్రసన్న. వినుకొండ; వెల:—రూ.1—75; ప్రాప్తిస్థానము:—శ్రీ మండా ఆంజనేయులు, వాణీ ప్రెస్, నరసరావుపేట.)

పరమ పదమ్ము కోసము
ప్రపంచము రోసి యెడారి దారులం
బెరిగిన యోగులీ చిలిపి
వెన్నెలలో మదన జ్వరమ్ము మ
మ్మరమయి గింగిరాల్ దిరిగి
మౌనముగా దిగజారి, రింక నె
వ్వరు తల్రకిందుగారు? రసవన్మధు
మాసము చేయుమాయలన్.

మధుమాసమను ఈ కావ్యమునందు నాల్గవ పద్య మిది. కావ్యార్థసూచన మిందున్నది. శాంతి దాంతి సంపన్నులగు యోగులే మధుమాసములో గింగిరాలు దిరుగగా, పడుచుదనము పరవళ్లుచేయు కోడెగాడు తట్టుకొనునా? తట్టుకొనలేడు. కామమోహితుడై యేపని చేయుట కయిన తెగించును. ఇది యీ కావ్యమునందలి నీతి.

అలిబాబు హర్షమాంబ కుమారుఁడు. కడుపెడు కండలతో కని పెంచి పెద్ద చేసినది తన కుమారుని ఆ యిల్లాలు. తండ్రి లేని యాతనికి, కండలు కరిగించి చాకిరిచేసి చందా లెత్తి చదువు చెప్పించినది. మాతృ భాషారాధనా తత్పరుడయిన యాతఁడు గతి లేక కాలానుకూలముగా ఇంగ్లీషు చదువు చదివి మెట్రిక్ పరీక్ష వ్రాసి యోగ్యతా పత్రమందుకొనును. ఇంతలో అలిబాబునకు హృద్రోగము వచ్చినది. ఉన్న యిల్లమ్మి సొమ్ము చేసికొని హర్షమాంబ కుమారునకు వైద్యము చేయించినది. తన నెత్తురు ధారవోసి కన్నబిడ్డని మృత్యుముఖమునుండి యీవలకులాగి,తుదకు దక్కించుకొన్నది. అలిబాబు కళాశాలలో ప్రవేశించును. అవి జాతీయోద్యమము ఉప్పెనవలె ఉరవళ్లు త్రొక్కుచున్న రోజులు. అలిబాబు ఆ యుద్యమమున భాగస్వామి యగును. పోలీసు లింటిని చుట్టుముట్టిరి. వీరిలో నొకడు తుపాకి ప్రేల్చెను. హర్షమాంబకు గుండు దెబ్బ తగిలినది. ఆమె నేల వ్రాలినది. కాని చావలేదు. పోలీసులు అలిబాబును చెఱసాల కీడ్చిరి. బొమికల గూడై అలిబాబు చెఱసాల వెలువడి, ఎదురు తెన్నులు చూచు తల్లి కడ కేగును. కుమారుడు సేమముగా తిరిగి వచ్చుటకై హర్షమాంబ శ్రీగిరిభ్రమరాంబా మల్లిఖార్జునులకు ముడుపు కట్టినది. ఆ యాది దంపతుల దర్శనముచేసి తనువు చాలింతునని హర్షమాంబ యనుకొన్నది. శ్రీశైలసానుప్రదేశముననే అలిబాబు తల్లి కుత్తుకకోయును. కోయుటకు హేతు విది :

అలిబాబు సుమదేవిని ప్రేమించును. ఆంధ్ర సంస్కృతియనిన పరవశించిపోవు అలిబాబు సుమదేవికి చెప్పకయే, మిత్రులతోపాటు తెలుగు మాగాణమున విజ్ఞాన యాత్రచేసి తిరిగివచ్చును.

అలిబాబు విజ్ఞానయాత్రకు పిదప తొలి సారిగా వా రిరువురు పట్టణోద్యానవనమున కూడుదురు. సుమదేవి ప్రణయ కోపము వహించును. స్త్రీ స్వాతంత్ర్యమును గూర్చి యొక యుపన్యాసమిచ్చును. అలిబాబు ఆమె యలుక తీర్చి యేమి కావలయునో కోరుకొనుమనును. ఆమె "సంహరింపుము నీవు నిస్సంశయముగ, కన్నతల్లిని మనపానమున "బుడక" యని కోరును. అలిబాబు గుండె బ్రద్దలయినది. అతఁడు "ప్రియా రూప మృత్యు"వయిన సుమదేవికి తన పూర్వగాథ యంతయు పూస గ్రుచ్చినట్లుగా చెప్పును.

"రాక్షసిక మయిన నీ మనోరథము దీర్ప పాతుకొనిలేదు నాలోన రాతి గుండె" యని యాత డామె కోర్కిని కూలద్రోయును. ఇది యీ కావ్యములో కృష్ణపక్ష మను ఖండము నందలి కథ.

ద్వితీయ ఖండము శుక్లపక్షము. మాసమా! మధుమాసము. పక్షమా! శుక్ల పక్షము. చిలిపి వెన్నె లలు, పిసాళి చలిగాడ్పులు అలిబాబు అంతరంగములో కామవాంఛలను ప్రకోపింపజేసినవి. తల్లియుసురు దీయగా నొల్లని యాతని కన్నుల యెదుట సత్య వాక్య పరిపాలనమును సమస్య సాక్షాత్కరించినది. కోర్కి చెల్లింతునని యనిన వా డాతడే. తెలిసి చెల్లింపలేనివాడు నాతడే. అలిబాబులో సత్య జిజ్ఞాస యేసరేగినది. ఈ జిజ్ఞాసకు పునాది కామోద్రేకము. చివరకు అలిబాబు సుమదేవి కోర్కి తీర్చుట కంగీక రించును. నాయికా నాయకులు హర్షమాంబను కారులో శ్రీశైలము చేర్చిరి. అలిబాబు హర్షమాంబను ముందు పొమ్మనును.కల్ల లెఱుగని ఆ యిల్లాలు దైవ దర్శన సంభ్రమముతో ముందు వెళ్లుచుండును. సుమ దేవి బ్రాంది సీసా, కత్తియు నిచ్చి, తల్లి తల తెచ్చి చూపిన పిదప, మధుర ప్రణయ వారాన్నిధిలో నోల లాడింతునని, యతనిని సాగనంపును. అతడుపోయి తల్లి కుత్తుక కోయును. అలిబాబు చేసిన బోయ పని చూడజాలక యేమో సూర్యుడస్తమించెను. ముదురు చీకట్లు చెలఱేగినవి. పెనుగాలి కసరి విసరినది. కాల్మొయిళ్లు క్రమ్మి యుఱుములను పుక్కిలించి యుమిసినవి. అలిబాబు తల్లి తల చేపట్టి వలపు కత్తె కడకు వచ్చుచుండెను. ఇంతలో తల్లి తల మాటలాడి నట్లయినది. "ఈ కొండపై మిట్టపల్లముల జాడ లెఱిగి జాగరూకతగా నడవుము. ఇట మిత్తవ పెద్ద పులియై తారాడును. నెత్తురులు కాఱు నీకాళ్లు చక్కజేసి నిన్నెత్తుకొనలేకపోయెనే" యని తల్లి హెచ్చరించుచు దీనముగా పలికినట్లనిపించినది. అలి బాబు తలక్రిందై, పశ్చాత్తాప తప్తుడై మాతృ ప్రేమకు జోహారు లర్పించును. ఏడ్చును. క్రుంగి కూలి పోవును.ఇంతలో సుమదేవివచ్చును. తల్లితల తెగగోయబోవు అలిబాబును నిలుపనెంచు సుమదేవిని ఒక అడవి దున్న ప్రేగులు బయట పడునట్లుగా పొడుచును.కొన యూపిరితో వచ్చిన సుమదేవి, తల్లితల హాస్యార్థ మర్థించితిననియు, సాహసిక్య పరీక్షకే యింత చేసితిననియు,నిజముగా తల్లిని చంపించుట తన తలపు గాదనియు అలిబాబుతో అనును. "నేను కుమతినై నీ తల్లి ప్రాణములను, వట్టి యన్యా యముగఁ బొట్టబెట్టినందు కీ పాటు బడితిఁ, గర్మాను భవము ద్రోసివుచ్చనౌనే చతుర్భుజునకైన" నని వాపోవును. "నిక్కచ్చి తెలుఁగు దనము" కాపాడుచు, పేదల కూడిగము చేయుచు, దేశ సౌభాగ్యమునకై శ్రమింపుమని సుమదేవి ప్రబోధ గానము చేయును. అలిబాబు తల్లియు వలపుకత్తెయు పీనుగుల నొక యేటిలో పాఱవైచి, "కారులో ధీరతన్" ఇంటికి వచ్చును. "అతఁడా యింతి ప్రబోధలక్ష్మికి వశుండై నట్టి వానిన్ బలెన్" ఈ పని చేసెను. "వితగాఁ బోవునె! యార్ద్రచిత్తుల యశోవీర ప్రబోధార్థముల్" అని బీర్నీడి ప్రసన్న గారీ కావ్యమునకు స్వస్తి చెప్పిరి. సుమదేవి ప్రబోధమేగాక, కవిగారి ప్రబోధము సైతము వ్యర్థము గాదని తుదకు చెప్పినట్లయినది.

ఈ కావ్యవస్తువు విలక్షణమయినది. "ఈ మధుమాసము—నా యనుభవావేశములఁ బెనవైచికొని యావిర్భవించిన శృంగార కరుణాత్మక కావ్యము" అని ఈ కవిగారు చెప్పిరి. వారియనుభవ మెట్టిది? ఈ కవికి, వీరి తండ్రికి ఏవో రవరవలు పొడమి నవి. అందుచే వీ రిల్లువీడి నేరొకచో నుండిరి. ఇంతలో వీరి తల్లి జబ్బు పాలైనది. తండ్రిమీఁది కినుకతో వీరు తల్లి కడకు వెళ్లలేదు. ఆ యిల్లాలు మృత్యు ముఖమున నున్నది. "అమ్మకై" ఈ కవి గారు తండ్రి యింటి కేగిరి. ఆ తల్లియుసురు నిల్పుటకై ఉన్నదంతయు వెచ్చించిరి. కాని తల్లి దక్కలేదు. నెల ముందుగా వచ్చినచో మీ తల్లి దక్కెడి దని వైద్యులు చెప్పిరి. ఈ కవి మాట లివి. "అందుకు నా తల్లిని నేనే చంపుకొన్నట్లైనది. దుర్భర భీకర దుఃఖ ధ్వాంతము గాఢముగా నన్నలము కొన్నది. వెక్కి వెక్కి యేడ్చి నా యేడ్చిన కన్నీరేమున్నీ

రయినది. ఆ ముస్సోరే పరిణామశీల కాలపరిణామమున కరుడు గట్టుకపోయి విషాద కావ్యమైనది.—అదే యీ మధుమాసము". ఇందు మాతృవధ యున్నది. ఇది తగినదా? ఎపుడో పరశురాముడు తల్లిని జంపెను. అట్టిది యీనాడు జరిగినట్లు వర్ణించుట యుచితమా? యనునది యొక ప్రశ్న. ఆ ప్రశ్నకు బీర్నీడి వారి సమాధాన మిది. "ప్రియురాలి సరసం దల్లి చేదయ్యె నన్న లోకోక్తి కీ హత్యా సన్నివేశము ప్రాణము వోసినట్లయినది. ప్రియావ్యామోహముననో, స్వార్థపరతా ప్రేరణాధిక్యముననో నాయీ కథానాయకుని వలె మాతృ మారణ కారణులైన కొందఱు వ్యక్తులు, కొన్ని వాస్తవిక సంఘటనలు నా దృక్పథమునం దిరుగ నేనిట్టి కల్పన మొనర్చితిని". కథా నాయకునకు తల్లి మాటలాడినట్లనిపించినది. ఈ కల్పనకు మూలము కవిగారి యనుభవమే. ఇంటికి దవ్వుగా నున్న వీరి కొక నాటిరేయి తల్లి కనుపట్టి యింటికి పొమ్మని పంచినది. ఈయన యిల్లు చేరుసరికి కన్నబిడ్డడు పుట్టెడు జబ్బులో నున్నాడు. వీరు కొడుకునకు జబ్బు నయము చేయించిరి. తల్లి పిలుపే యంతకు హేతువని వీరు నమ్మిరి. ఇది యంతయు వ్రాయుట యేల? ఈ కావ్యావిర్భావమునకు కవిగారి జీవితమున సంభవించిన సన్నివేశములు వారి లోకానుభవము మూలకారణములని స్పష్టముగా చెప్పుటకే. ఈ కథలో ఒక యంతరార్థముండవలయునని కవిగారు సంకల్పింపనులేదు. అట్లు వ్రాయనులేదు. మరులెత్తిన వాని పోకడ చెప్పుకొని పోవుటయే కవిగారి యిచ్ఛ. ఇచ్ఛ యిదియే యని కవిగారు తెల్లము చేయుచుండగా, దీనిలో ఒకానొక పరమ వ్యంగ్యము భాషా రూపమయినట్టిది భాసించుచున్నదని "పరిచయము" వ్రాసిన విశ్వనాథ సత్యనారాయణగారు వెల్లడించిరి. రవీంద్రుడిట్టి కథనొక దానిని వ్రాసెను. దానిని చూచి యీ కవిగారీ కావ్యము వ్రాయనిమాట నిజము. కవిగారి లోకానుభూతియే యీ కావ్యమును పుట్టించినది. మన మీ మాట మఱవరాదు.

విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన పరిచయము వారి రాగద్వేషములను చూపుచున్నంతగా కావ్యసత్యమును చాటుటలేదు. రవీంద్రనాథ ఠాగూరు కంటె నేనే గొప్పవాడనని విశ్వనాథవారు విశ్వసింతురు. దానికి తగినట్లుగా వారికి ఆంగ్లభాషయనిన పరమ ద్వేషము గలదు. వారి యీ రెండు తత్త్వము లర్థమయినగాని వారు వ్రాసిన పరిచయము అర్థముగాదు. మధుమాసము కథలోని ప్రధానార్థము "మాతృభాష నాశనమగు చున్నదని దుఃఖ"మట! ఈ కావ్యములో రవీంద్రుని కథ కంటె అధికమయిన అర్థమున్నదట! నాయకుడాంధ్ర యువకుఁడట! తల్లి యాంధ్రభాష యట! నాయిక ఇంగ్లీషు భాషయట! నాయకుడు నాయక మీది వలపుతో తల్లి గొంతుకోయుట యనగా ఇంగ్లీషు భాష మీది తీపితో ఆంధ్రభాష మెడకాయ కోయుటయట! చచ్చిన తల్లి మాట్లాడి నట్లనిపించుట మాతృభాష వదలి పెట్టకుండుటయట! నాయికకు నాయకుడుతల్లిని చంపునేమోయనుభయము కల్గుట "మాతృభాషలు చచ్చిపోవునేమో యన్న భీతి ఆంగ్లేయ భాషా విశారదుల కుండుటయట." "ఈ కావ్యమునందింకొక్క యర్థమున్నది. వాఁడు తల్లిని జంపిన తరువాత భార్యయు మిగులదు. మాతృభాష చనిపోయినచో నాంగ్లేయభాష వీరి కక్కఱకు రాదు. ఇది సూక్ష్మవిచారణచేతగాని నిర్ణయింపబడెడి విషయముకాదు" అనియు వారు వ్రాసిరి. విశ్వనాథవారి విమర్శయంతయు కావ్యప్రకరణమును విడచి చేసిన సాము. భాషా సంబంధమయిన యంతరార్థముతో తానుగ ఈ కావ్యము వ్రాసినట్లు గ్రంథకర్త యెక్కడను చెప్పలేదు. కవి యుద్దేశింపని దానిని అతని కావ్యమునందు విమర్శకుడు ఆరోపించుట

వ్యాఖ్యాతృమేధా విలసనము తప్ప మఱేమియుగాదు. తెనుగు పోకడ కట్టుబొట్టులలో, బాసలో సమసి పోవు చున్నదని నాయికానాయకులు లొండు రెండు చోట్ల పల్కుదురు. అంతమాత్రమున ఈ కథలో భాషా సంబంధమయిన యంతరార్థము కలదని చెప్పుట తగునా? అంతరార్థము కల కావ్యరచనా రీతి తెలిసి చేసిన విమర్శకాదిది. కావ్యమునందలి ప్రత్యంగము, నాయికా నాయకుల వాక్కులు, చేష్టలు సర్వము అంతరార్థమున కభిముఖముగానుండవలయును. బనియన్ వ్రాసిన పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్ ఇట్టిది.

ఈ కావ్య మటువంటిదిగాదు. తనయందు పరమాభిమానము గలవారి కావ్యములలో, తాను ద్వేషించు వారి కావ్యములను మించిన పరమార్థ మున్నదని చాటుట సాహితీ వంచనము తప్ప మఱొకటి గాదు. సుమదేవి స్త్రీ స్వాతంత్ర్యమును గూర్చి, గాంధిని గూర్చి, హిట్లరును గూర్చి, దేశమునందలి యధర్మ మును గూర్చి మాట్లాడును. ఈ మాటలను భాషా సంబంధమయిన అంతరార్థముతో ముడిపెట్టుట యెట్లు? మాతృభాషాభిమానము లేకపోవుట అనర్థక హేతువాయేమి?

అంతేకాదు. మఱియు ఈవిచిత్రము చూడుడు. ''ఇచట మాసశబ్దము ఋతుపర్యాయముగాఁ దీసి కొన్నచో చైత్రవైశాఖములు వసంతుర్తువై చైత్ర మాసాంతము కృష్ణపక్షము, వైశాఖమాసాది శుక్ల పక్షము కలిసిన నెలయగును. చైత్రము యొక్క శుక్లపక్షము హూణభాష మనదేశము నాక్రమింపని కాలము. వైశాఖ కృష్ణపక్షము మాతృభాషను మనము చంపివేసికొనిన తరువాత ననుభవించెడి దుష్కాలము. ఇది యీ నడిమి కథ'' యని విశ్వనాథ వారు తెగ లాగి లాగి వ్యంగ్యమును బయట కీడ్చిరి. మాసమును ఋతు పర్యాయముగా స్వీకరించుట యప్రామాణికము. మధుశబ్దమునకు వసంతర్తువు, చైత్రమాసమును నర్థములు కలవు. ఆ యర్థములే యుట తగును. అప్రామాణికమైన యర్థముతో ఊహలు పెంచినవారగుటచే వారుగారు కథ ''వట్టి బొమ్మిక''గా, యీ కవిగారి కథ వసామాంసాసృఙ్మ్నాడీ రమణీయమయిన జీవకళిక''గా సాక్షాత్కరించినది. కథాకాల మొక మాసము. అందుచేతనే కావ్యము కృష్ణ శుక్ల పక్షములుగా ద్విధా విభక్తమయినది. కావ్యాంతమున నాయిక పలికిన యీ పలుకు వారూ హించిన వ్యంగ్యమెట్టిదో బట్టబయలు చేయును. సుమదేవి మాటలివి.

''మడసిన తల్లియే తెనుఁగుమాతగ,
నీచురకత్తి వ్రేటె యీ
నడచెడు ధూర్తకాలముగ,
నాయెడ ప్రేమయె 'ఘోరదీక్షగా,
గడచినదెల్ల నొక్క కలగా గ్రహియించి
యశః ప్రియుండవై
కడఁగుము దేశసేవకు సఖా!
పెలువారికిఁ గన్నుగుట్టగన్.''

సుమదేవి విశ్వనాథవారి ప్రకారము ఇంగ్లీషుభాష గదా! ఆమె యందలి ప్రేమ ఆంగ్లభాషా మమకారము గదా! ఆ మమకారము ఘోరదీక్షయై దేశసేవోద్దీపన మగునా? ఉద్దీపనమయినచో విశ్వనాథ వారనుచున్న వ్యంగ్యము లేదన్నమాట. ప్రకరణమును ప్రక్కకు నెట్టిన వ్యాఖ్యాతృమేధా విలసనమునకు విశ్వనాథవారు వ్రాసిన పరిచయము మంచి మచ్చుతునుక. ''ఈకథనే నచ్చుముగా కల్పించితిని. ఇది నా జీవిత చరిత్రలోని భాగము'' అనియు, ''నేను దీనిని నా జీవితములోని పరిస్థితుల ననుసంధించి నిర్మించుకొన్నాను'' అనియు కవిగారు చెప్పు చుండగా నడుమ ఈ వ్యంగ్యమేమిటి? ఆ వ్యంగ్యస్ఫోరకముగా గ్రంథకర్త రచన సాగించిరా? లేదు. వైయక్తిక రాగద్వేషములతో, పురస్సిద్ధాంత ములతో విమర్శ చేసినచో, అది వెఱ్ఱితలలు వేయుట తప్పదు.

''వాణి నా రాణి'' యనిన పినవీరభద్రుని మాది రిగా ''కవిత్వము మేమే వ్రాయవలయును. మరె వ్వరు వ్రాయగలరు'' అని యీకవిగారందురు. వీరి తండ్రి మోషే కవిగారు ''హరిజనాంధ్రలోకమున

కాదికవి నన్నయ్య". వీరిది "విద్వత్కవి కుటుంబము." అట్టి కుదురు వాడైన యీకవి రచించిన యీ కావ్యమేతీరుగా నున్నది ? అనునది ప్రప్రధాన ప్రశ్న. పరిశీలింతము. మధుమాసము కథాకావ్యము. "శృంగార కరుణాత్మకకావ్య"మని కవిగారు ఏర్పడ జెప్పిరి. ఖండకావ్య విమర్శవేఱు. కథా కావ్య విమర్శ వేఱు. ఏ కథకయిన యొక లక్ష్యముండును. అది యొక నీతిని కాంతాసమ్మితముగా చెప్పవచ్చు. లేక యొక దురాచారమును యథాతథముగా నీతి ప్రస్తావనము లేకుండ వర్ణింపవచ్చు. చదువరి కావ్యము సొంతము పఠించి ప్రకరణోచితమయిన నీతిని తేల్చుకొనును. మధుమాసము ఇప్పటి పోకిరి పడుచువాండ్ర పిసాళి పోకడ నున్నదున్నట్లుగా అందముగా చెప్పు నవీనకావ్యము. కావ్యకర్త నీతిని నేర్పవలయునని కథ చెప్పడు. చెప్పుటయు పాడిగాదు. కావ్యము యొక్క లక్ష్యము ఆనందము. నీతిబోధగాదు. నీతి బోధ చేయుటకు గ్రంథము లీదేశమున కావలసిన వానికంటె నెక్కువగనే యున్నవి. కావ్యాంతమునందు సుమదేవి పలికిన పలుకులు నాయకుని కర్తవ్యోన్ముఖుని జేయునట్టివి. మఱి కథాకావ్య మనగనే ఆయా ప్రకరణములకు తగిన వర్ణనములు, సన్నివేశముల కల్పనము, పాత్రల చిత్తోన్మీలనము మున్నగునవి ప్రధానాంగములై భాసించును. ఇవి యీకావ్యము నందెట్లున్నవో ఔచిత్యమనునదెంత వఱకు పాటింపబడినదో క్రమక్రమముగా పరిశీలింపవలయును. అంతకు ముందొకమాట. "కావ్యోదయము" అను తొలి పలుకును కవిగారు వ్రాసిరి. ఆ తొలిపలుకును బట్టి ఈ కవిగారెట్టి యావేశపరులో, ఎంత అచ్చ తెలుగు తీరుతెన్నుల వలపుగలవారో, ఎటువంటి దేశాభిమానియో, మానవతావాదియో చదువరులకు తెలియును. ఈ కవిగారి రాగద్వేషములే యీకావ్యమున ప్రతిఫలించినవి. ఆ ప్రతిఫలించుట యౌచిత్య సహితమా? ప్రకరణోచితమా? యని యడిగినచో, కొన్నిచోట్ల ఔచిత్యము దెబ్బతిన్నదనియే చెప్పవలసి యున్నది.

ఈ కవిగారు ప్రకరణోచితమయిన ప్రకృతి వర్ణనము చేయగలవారు. కావ్యము వసంత వర్ణనముతో మొదలగును. ఎందరో యెన్నో తీరులుగా పూలకారును వర్ణించుట చదివితిమి. ఐనను ఈ కవి చేసిన వర్ణనములో ఎంతో వైచిత్రి యున్నది. గడుసైన యూహలున్నవి. నాయికానాయకుల చిత్తము లుల్లాసమయములై వారు పెడ్రకంతలు పట్టుటకు నిదానమయినది వసంతకాలము. ఈ గుట్టు గుర్తించియే ప్రసన్నగారు వర్ణనము చేసిరి.

ద్వితీయఖండము శుక్లపక్ష వర్ణనము. తల్లి తల తెగకోయ తల్లడిల్లిన నాయకుని ఆపని చేయుటకు రెచ్చగొట్టిన దీ పక్షము. భావప్రౌఢత, ఉక్తివైచిత్రి ఈ వర్ణనమున ముఖ్య లక్షణములు. ఈ వెన్నెలల దాడికి తట్టుకొనలేని నాయకుఁడు ప్రబంధనాయికవలె మన్మథోపాలంభనము చేయును. నాయకుఁడు తల్లి యుసురు దీయకమున్నె, తీసినపుడు సూర్యాస్తమయ వర్ణనము, అంధకారవర్ణనము, ఝంఝావర్ణనము కలవు. ఇవి యా గంభీర సన్నివేశమున నాయకుని చిత్తవృత్తికి విస్పష్టరూపము చేకూర్చుటకు తోడ్పడినవి. ప్రకృతి పాత్రల యంతఃకరణమునకు అద్దమై యున్నది. ఇది యొక మహాశిల్పము.

ఇందలి పాత్రలు మూడు. అడుగడుగున హర్షమాంబ అనుభవించిన దైన్యము చదువరుల గుండె కదలించును. తల్లిపడ్డ పాటులు నాయకుడు వర్ణించినపుడు అతని శీలమేకాక, హర్షమాంబ శీలము సైతము తేటతెల్లమగును. ఈ కావ్యము శృంగార కరుణాత్మకమన్నారు కవిగారు. కావ్యమున రెండు అంగిరసము లుండవు. ఒకటి గౌణము కాకతప్పదు. ఈ మధుమాస కావ్యమున కరుణము అంగిరసమనియు శృంగారము అంగరసమనియు చెప్పవచ్చును. హర్షమాంబ కథ కరుణరసమయము. రెండుభాగముల యందును హర్షమాంబ దైన్యజీవనము చూపిన బలము ఇంతంతగాదు. నాయకుని చిత్తప్రవృత్తి వర్ణనము సొగసుగా దిది తీర్చబడినది. సుమదేవి

కోరిన కోర్కి యాతని మాతృభక్తిని వెలికిడ్చినది. అతని విచారధారా వర్ణనము (19వ పుటనుండి 32 పుట దాక) అద్భుతముగా నున్నది. శుక్లపక్షము నందు నాయకుని పాత్రపోషణమున యొక్క పరమ రహస్యమును కవిగారు వ్యంగ్యముగా చెప్పిరి. తల్లి కుత్తుక నుత్తరించుటకు మొదట ఒప్పుకొనని నాయకుని గుండె ముదురువెన్నెలలయొత్తిడి కాగలేక అదవదలయినది. అతనిలో కామము విరాడ్రూపము ధరించినది. ఆ పట్టున అతడు సత్యపదవీ ప్రమాణ తత్పరుని వలె మాటాడును. శిబి బలి కర్ణ క్రీస్తు గాంధీల త్యాగవీరమును ప్రశంసించును. "అప్పరశు రామున కైనది నాకు నయ్యెడున్" అని తృప్తిపడును. అతని మాటలన్నియు కామమోహితుని సత్యపరా యణమును చాటునవి.ఆడితప్పగూడదను అతనిమాటలో చిత్తశుద్ధిలేదు. కామ వికారములను కప్పిపుచ్చు కొనుటకై యతడు సత్యవాక్పరిపాలనమును నొక వజ్రకవచము సృష్టించుకొనును. మనసులో నున్నది క్షుద్రాలోచనము. మాటలలో కనుపట్టునది ఆ క్షుద్రాలోచనమును కానరానీని సత్యతత్పరత. నవీన నాగరికత మానవునకు నేర్పిన కనుకట్టు విద్యలలో నిది యొకటి. ఇట్టిచో మానవుడు తన యంత రాత్మను ధర్మగానము చేసి జోకొట్టి నిద్రపుచ్చుటకు పడరానిపాటులు పడును. పనికిమాలిన యుపపత్తులను చూపును. ఈనాటి మానవుని పరాత్మవంచనములను పరమ రమణీయముగా వ్యంగ్యముగా కవిగారు వర్ణించిరి.

---



కవిగారు నాయకుని చిత్తోన్మీలనమునందు చూపిన శ్రద్ధ నాయిక చిత్తప్రవృత్తి పట్ల చూపలేదు. ఆదినుండియు ఆమె మాటాడు మాటలయందు నాయకుడొక కొన్ని పట్టుల పలికిన తీరునందు — సందర్భశుద్ధి తక్కువ. కవిగారు తన యావేశము, తన అభిమాన దురభిమానములు పాత్రల కెక్కించి, వానిని మాటాడించిరి. ఆ మాటలు ప్రకరణోచిత ములా? కావా? యను సమీక్ష వారు చేయలేదు. ఏడాది పాటు విజ్ఞానయాత్ర చేసిన నాయకుడు పట్టణోద్యానవనమున నాయికను కూడును. ఆమె యలుక వహించును. నాయకుఁడు బ్రతిమాలును. అట్టిచో నాయిక స్త్రీ స్వాతంత్ర్యమును గూర్చి యుపన్యసించును. పురుషుల యధికారమునకే ఆమోద ముద్ర వేయు శ్రుతిస్మృతులను విమర్శించును. "మేమొక కామయంత్రములమే యయినా" మని వాపోవును. చారిత్రక యుగములలో స్త్రీలు గావించిన వీరకృత్యములను వర్ణించును. ఆమె యీమాట లన్నియు శృంగారరస భంజకములై, అది యీ కావ్య మున పరిపుష్టమగుటకు ప్రతిబంధకములైనవి. అట్లే నాయకు డైనదానికికానిదానికి తెలుగు బాస పరభాషా సంపర్కమున మైలపడినదని యనుటయు నుచితముగా లేదు. నీ తల్లి పానకమున పుడక వలె నున్న దనియు, ఆమె తలగొట్టుమనియు (సలోమి యీరీతిగా నొక క్రైస్తవ మతప్రవక్త శిరము తీయుమనగా హెరోద్ చక్రవర్తి యామె కోర్కి తీర్చెను) మొట్ట మొదట ఆజ్ఞాపించినది నాయికయే. శ్రీశైలమున నాయకునకు కత్తి బ్రాందిసీసా యిచ్చిన దామెయే. ఇంతచేసి పని ముగిసిన తర్వాత ఆమె పడిన పశ్చాత్తా పము చూడగా కృత్రిమమయి నట్లనిపించుచున్నది.

> చంపనే చంప, వంతకుఁ జంపఁబోవు
> నపుడు వారింపగా వచ్చునంచుఁ దలఁచి
> నిను మిగిలి పోవనిచ్చి నీ కనుల గప్పి
> పుచ్చి నేను నీ వెనుకనే వచ్చుచుంటి?

యని యామె సహృదయులగు వారి కనులు గప్పు టకు యత్నించినది. తల్లి తలను "హాస్యార్థ మర్థించి"న

దట! ''ఆకు జిదిమి యతుకఁజాలనట్టి నరుఁడు హత్యసేయుట కెవ్వఁడే? హక్కుగలదు'' అని యనును.

ప్రేమసత్యమహాయజ్ఞవేది మీఁద
నాత్మ సర్వస్వ మర్పించినట్టి నీకు
నాలిఁ దెగనమ్మి యక్కఱ నార్చుకొన్న
ఆ హరిశ్చంద్రుఁ డేమాత్ర మార్యపుత్ర !

యని నాయకుని ప్రశంసించును. ''ఎంత తవుసెత్తిన చచ్చినవారు వత్తురే'' యని నాయకునకు కర్తవ్యోపదేశము చేయును. నాయిక చేసిన యీ నటనమున కర్థమేమి? ''క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్'' ''ఔర యెుక్కకతఁతిం బువుఁబోండ్లు కటారి కత్తియల్'' యని ప్రాచీనకవులు పల్కిరి. కవి స్త్రీ చపల ప్రవృత్తిని వర్ణింపదలచెనా? అట్లయిన నాయిక కావ్యాంతమున ప్రబోధము చేయుట యసహజము. నాయిక నిజముగా పరిహాస పాత్రము గనే తల్లి తలఁకోరెనా? కోర్కి వెల్లడించినది మొదలు కన్నుమూయుదాక ఆమె యాడినతీరు తదను కూలముగాలేదు. పరిహాసము మానవుని జీవనములో ఎట్టి ప్రళయము పుట్టించునో కవిగారు చెప్పదలచిరా? నవయుగాంగనల చిత్తచాంచల్యమును బాహిరము చేయనెంచిరా? ఎన్ని విధములుగా చూచినను, నాయిక, కావ్యముయెుక్క ఆద్యంతముల చేసిన చేష్టలకు, ఆడిన మాటలకు పొత్తుపొందిక లున్నట్లు కానరాదు. ఇది కథ నెన్నుకొనుట యందలి లోటు. అట్లే నాయకుడు పీనుగులను రెంటిని ఏటిలో వైచి, చేతులు దులుపుకొని వచ్చుట కథాప్రణాళిక యందలి వికారమునకు గుర్తు. ఘోరహత్య గావించిన నాయకుడు సాధించిన సిద్ధులేవి? నాయిక మరణమునకు వాపోవువారు లేరా? ఇది యింతయు లోకమునకు తెలియక జరిగినదందురా? అట్టి తార్కాణము లున్నవందురా? కథా ప్రణాళిక శంకాస్పదమై, కృత్రిమముగా నుండరాదు. నాయికానాయకుల నోట భాషా దేశాభిమాన వాక్యములు నాలుగు పలికించినంత మాత్రాన కథ స్వయం సంపూర్ణముగాదు. కార్యకారణ భావము కలిగియున్నది గాదు.

కథ మాట యట్లుండనిండు. కవిగారి రచనాశక్తి, వర్ణనా నిపుణత్వము పాఠకులను పరవశింప జేయును. ధారాళమయిన శయ్య, చక్కని చిక్కని తెలుగు మాటల కూర్పు, ప్రతి పద్యమున గోచరించును. పద్యము మొదలిడి ముగించుటలో, తలపులను వెల్లడించుటలో, కావలసినంత తెనుగుదనము కలదు. అచ్చమయిన తెనుగు కబ్బము గడుసుదనమునకు ఈ మధుమాసమంతయు తార్కాణము. తెలుగు వారి నోళ్లలో నలగిన మాటలనెత్తి యందముగా పొదుగుట, సందర్భోచితముగా అర్థాంతరన్యాసాలంకారాదులను హత్తుట ఈకావ్యమున కనుపట్టు మేలి చిన్నెలు. కథ వర్తమాన సంబంధి. పదజాలము కూడ అంతే. వర్తమానకాలనాగరకతాచిహ్నావర్ణనము సహజముగా నున్నది. వేళపాళ, సెకలుసాగించు, చిల్లాపల్లా, ఫక్తు, కంగారెత్తు, గప్పొల్‌గొట్టు, ఆపసోపాలు, సయామము తమ్ములగు, జిమ్మ, ఆఘమేఘాలు, అంతుపంతు, పురుగేరు,పడిచచ్చు-మున్నగు మాటలు, పదబంధములు ఎల్లెడల తీయతీయగా జాలువారును. ఒక్కొక్కచోట యీ వ్యావహారిక పదము ఉదాత్త భావ వ్యక్తీకరణమునకు తగినవిగాలేవు. భావము గట్టిగా నుండును. భాషయో సడలిపోయినట్లగపడును. ఒక్కొక్కసారి కవి పాత్రల నోట పలికించిన మాటలు అంతగా తగినట్లు కానరావు. ఏడాది తరువాత కానబడిన వలపుకానిని చూచి నాయిక ప్రణయకోపము చూపును. నాయకుడు ప్రణయపరితప్తజీవియై మాటాడును. ఆరాటపడుచు, ఆలస్యమునకు తాళజాలడు. తాళజాలక ''ఇప్పటికి స్తనశల్య పరీక్ష చాలు'' అని నాయికతో అనును. నాయికయు ఒకచో ''కుదరదిఁకమీద ముసుగులో గ్రుద్దులాట'' అని నాయకునితో ననును. ఇట్టి మాటలుచితములై యుండవు. ఆంగ్ల ప్రభుత్వాజ్ఞలను పాటించు భారతీయ రక్షకభటులను ''బేడా డబ్బుల కోసమై పరులతో బేరమ్ము సాగించు''వారని,''గులాము'' లని నాయకుడు వర్ణించుట కవిగారి ''దేశభక్తి''ని చాటునేమో! పరమబ్రహ్మమును సగుణమనియో, నిర్గుణ

మనియో వర్ణించుట యున్నది. కాని యీ కవిగారు, "గాంధివీరరాజర్షి" "జీవిత మహాప్రస్థానము"ను తీర్చిదిద్దిన "సుగుణబ్రహ్మము సత్యతేజమునకున్ జోహారు! గావించెదన్" అని నాయకుని నోట పలికించిరి. సుగుణబ్రహ్మమనున దొక డున్నదా? పూవుండోలల నూగుకొంద" మనుట యేమి? డోగుదము, ఊగుకొందము—ఈ రెంట నిటయేది సొగసుగా నుండును. ఉయ్యాలలూగు, ఉయ్యాలలనూగు (తూగు)వంటి పలుకుబడులుకలవు. "పూఁ దీఁగెల తూగు టుయ్యేలల బంతాలాడుచున్ తూగు" అని సూరన. "చింతిలుకొనుచు" "విధి దూఱుకొనుచు" వంటి పూర్వకవి ప్రయోగములు కలవు. పూవుండోలల నూగుకొందమనుట విచిత్రముగా నున్నది. క్రియా ఫలము కర్తృగామి యయిన రూపము కాబోలు! "కన్నతల్లి తలదరిగెడి యీ తలబిరుసు పనికిఁ దిగుటయు" నని యొకచో కవిగారు వర్ణించిరి. తల దఱుగుట తలబిరుసు పని కానేరదు. తలబిరుసు తనము కామాంధత్వమును వ్యక్తీకరింపదు. "అర్ధరాత్రి" దయావాచకమగు కరుణ శబ్దముతో కూడిన "కరుణమయముల" సాధువు లగునా? "త్రావ గూడని బ్రాందిఁ ద్రాపినాను" "త్రాగు" ప్రేరణార్థకములు "త్రాగించు, త్రావించు" అను రూపములు గలవు. "త్రాపు" అనునది అపూర్వముగా నున్నది. "పురముపైఁ బడు తెల్లదొరల తోమ్ములు గ్రుద్ది, నిలువరించినది బొబ్బిలివధూటి" ఈమె యెవరో? "అలఘుకీర్తిపతులై జగంబులనె యూటాడింపఁగాఁజాలునా, బలియేడీ! శిబియేడి? ధర్మజుఁడు పాపారాయుఁడున్ గృష్ణరాయలు నేరీ?......" యని నాయిక కర్తవ్యోపదేశము చేయుపట్టున నాయకునితో అనును. పాపారాయని తదితరుల సరసచేర్చుట యుచితముగా లేదు. ఆంధ్రచరిత్రలో పాపారాయఁడు వీరుఁడై వెలుగొందిన మాట నిజమే. అట్టివారీ భారత దేశమున నెందఱోయున్నారు. ఎక్కడి బలి శిబి ధర్మరాజాదులు? ఎక్కడి శ్రీకృష్ణదేవరాయలు? ఎక్కడి పాపారాయడు? ఈ కాశ్యపీఖండమునందే పాపారాయని మించిన దొడ్డ తేజ్దేందఱో యున్నారు. మఱి యేతత్త్వమునకు ప్రతీకగా పాపారాయడు ధర్మరాజాదుల చెంత చేరెను? చదువరులే యూహించికొనవలె.

ఈ కవి యతి నియతిపట్ల స్వైరవిహారము చేసిరి. యతిప్రాస లాంధ్రభాషకు సహజసుందరములై యున్నవి. అప్రయత్నముగా అవి వచ్చిపడినచో ఎంతో సొగసుండును. ఎన్నో రకముల యతులున్నవి. సావర్ణ్యమును బట్టి ధ్వని సామ్యమునుబట్టి యతులలో పలురకములు బయలుదేరినవి. ఈ కవిగారు ఈ లఘుకావ్యమున అఖండయతులను విచ్చలవిడిగా వాడిరి. వాడుట తప్పుకాని మాట నిజమే. కవిత్రయము నందే అఖండ యతులున్నవి. అప్రయత్న సిద్ధములయి నట్లనిపించు అఖండయతులు సైతము సొగసుగనే యుండును. ఈ కావ్యములో అన్నిచోట్ల అవి ఆ రీతిగనే యున్నవని చెప్పజాలము. ఎన్నోచోట్ల తెచ్చి పెట్టినట్లుగా నున్నవి. ప్రాచీన కావ్యములలో క్వాచిత్కముగా నుండు వానిని బహుళముగా ప్రయోగించుట అప్రామాణికముగాదు గాని అనుచితమగును. "రంగురంగుల చీరల్ ధరియించి తెన్గు దొరసానుల్" అన్నచోట యతికి గతి యున్నదా? చువర్ణకము పరమగునపుడు అన్వాదులకు ఉత్వలోపము వ్యాకర్తలు చెప్పిరి. దానికి తగినట్లుగా కవులు యతులు వేసిరి. "రంగు" అనుదానిని "రన్గు" అని యనుకొన్నగాని యిట యతికి గతిలేదు. "ఒక్కొకరుం గాంధీలై శివమూర్తు లుగ్ర నరసింహ స్వాములై" అనుచో యతి దప్పినది. ఇది బిందుయతి గాదు. అనుస్వార సంబంధయతి గాదు. అనునాసికాక్షర యతిగాదు. మవర్ణ యతిగాదు. "నవయుగ కవీశ్వరుల ప్రబంధాంతరముల" ఇట బిందఖండ యతు లేకమయినవి.

సంవాదములు లేని రచన యుండదు. "నీకల హాస కౌముదులు నిండిన నానయనాంచలాలలో" అనుచోట వేదులవారు, జంధ్యాలవారు చూపట్టుదురు. "తుమ్మెద కోడెగాని" "ఏ సుఖసౌరభమ్ము విరియించునొ" యనుపద్యములలో ఉమర్‌ఖయ్యాముతత్త్వమునకు ప్రతిబింబాకార సంవాదమున్నది. "ముచ్చుఁ

దుమ్మెద తొలుపుల కచ్చటచట'' యనుచోట కాళిదాస భావచ్ఛాయ కలదు. భావకవిత్వము నవీన సాహిత్యమున నొక ప్రబలాంగముగదా! దాని రూపరేఖలు ఈ కవి చేసిన వర్ణనములలో నాయికానాయకుల సంభాషణ ములలో గోచరించును.

ఇది యీ కావ్యతత్త్వము. బీర్నీడి ప్రసన్న గారు కవియో మహాకవియో చదువరు లెవరికి వారే నిర్ణయించికొనవలయును. బహుజనపల్లివారి వలె కవులకు తరగతులు అంటగట్టుట అనుచితము. ఒకడు కవియో, మహాకవియో కాలము చక్కగా నిర్ణయించును. విశ్వనాథవారు ''ఇతడు మహాకవి యనుట నిస్సందేహము'' అని యనుట వారి సాహస మును మాత్రమే చూపును. ''ఇతని రచనా సౌకు మార్యము వంటి సౌకుమార్యము కల కవులు నేడు లేరనియే యనవలయును. ఒకటిద్దరు ఉన్నారేమో అందులో నొకడు చనిపోయెను.(వారిలో అని అనవలె). ''అతనియందు తక్కినయితని గుణములులేవు''అనుట వారు వ్రాసినంత సేపు తమ్ముమరచిపోయి వ్రాసి నట్లున్నది. ''మహాకవి బిరుదము పెట్టికొనుచున్న నేటి పలుమంది కవులలో నిన్ని లక్షణములు లేవనియే చెప్పవలయును'' అని యనుట కూడ నట్లే యున్నది. ఇది నిజమే. ప్రసన్నగారికి కనకాభిషేకము చేయవలయునని, వారిని ఏనుగెక్కింపవలయునని సత్యనారాయణగారు సిఫారసు చేయుచున్నారు. కాని యేమి లాభము? ప్రసన్నగారి కులము ధనవంతమయి నది గాదు. కులాభిమానము ముదిరిన కులముగాదు. ఈ మాటలు కూడ విశ్వనాథవారే వ్రాసిరి. ఒక ధనవంతమయిన కులాభిమానము ముదిరిన కులమునకు చెందిన వాడయినచో, అతనికి కనకాభిషేకాదులు జరుగు నన్నమాట! విశ్వనాథవారు ఒక చిదంబర రహస్యమును చెప్పిరి. ఈ రోజులలో సన్మానములు జరుగుటకు కులము ప్రతిబంధకము కానేకాదు. ఏకవి యయిన మంత్రులనో, రాజకీయ నాయకులనో ఆశ్ర యింపగలవాడైనచో, తంత్రములు పన్ను నేర్పుగల వాడైనచో, అతనికి తప్పక బహుధా సన్మానములు జరుగును. ప్రసన్నగారిది సరళమయిన, సుకుమార మయిన మనస్తత్త్వమని ఈ కావ్యమును, దీని తొలి పలుకును చదివిన వారికెల్లరకు తెలియును. అట్టి తత్త్వము గలవారు ముూకను ప్రోగు చేసి చెక్కభజనలు చేయించికొనలేరు. రాజకీయ నాయకుల నాశ్రయించి సాహిత్యపరిషత్తుల అధ్యక్షస్థానము ఆక్రమింపలేరు. ప్రభుత్వ బహుమానములు పొందలేరు. గ్రంథములు వ్రాసి యితరుల పేరుపెట్టి విశ్వవిద్యాలయ బహు మానములు పొందలేరు. తనవారికి ధన సహాయము చేయలేరు. ఈ లోక రహస్యములు కవిసామ్రాట్టులకు తెలియనివిగావు. తెలిసియే విస్మరించిరా? ప్రసన్న గారి వంటి కవులు సాహిత్యమునందే గాక, నిజప్రవర్తన మందును ధర్మసత్యశౌచప్రీతిని చూపుదురు. కీర్తి ధనములు ప్రాప్తింపకుండుటకు, కులాభిమానము లేని కులము కారణమయినచో లవి ప్రాప్తించుటకు కులాభిమానము సోడుముట్టిన కులము, ఇతర వర్ణ ముల యభివృద్ధిని సహింపలేని కులము కారణము కావచ్చును. సనాతనధర్మ ప్రీతియున్నచో తుచ్ఛము లయిన అశాశ్వతములైన కీర్తిధనములేల?

చలిది కైతలతో బట్టు సరణితోడ
గజ్జెకట్టెడి కవులునుం గలరు మనకు
నెంత మొగమోటయున్న, సాహిత్యమర్మ
రసికు లీసీమ వారొట రక్తిసెడదు.

—''శాక్యసింహ''

## ఆత్మరామాయణము

[రచయిత : లలిత కవి. ములుగూరు టి. గురు మూర్తిగారు. మూల్యము : అయిదు రూపాయలు. పుటలు 307. ప్రతులకు : రచయిత, హిందూ పురము అం. ప్ర.]

యుద్ధకాండముగాగల రామకథ ఇతివృత్తముగా రచింపబడిన గ్రంథమిది. ''యుద్ధోత్తర చరిత్ర'' మని యున్నదిగాని అది ఉత్తరకాండముకాదు. శ్రీరామ పట్టాభిషేకాదికము మాత్రమే. ఇదంతయు అవతారి

కాదికముగాక 2344 గద్య పద్యములు. కథ ప్రసిద్ధము గనుక దానిని రేఖామాత్రముగాజేసి ఆత్మ తత్త్వ ప్రపంచనముచేత శ్రీ గురుమూర్తిగారు మాంసలమును బొనరించి ఈ తమ కృతికి ఆత్మరామాయణము అని పేరు పెట్టిరి. ఈ పేరు కొంత క్రొత్తగా నున్నది. సంస్కృతమునను, తెలుగునను అధ్యాత్మ రామాయణ మింతకు మునుపే ప్రసిద్ధముగాగలదు. అధ్యాత్మ రామాయణమునే ఆత్మ రామాయణముగా నిపుడీ శ్రీ గురుమూర్తిగా రాంధ్రమున నెలకొల్పిరని చెప్పుటకును వాతావరణ మంత అనుకూలము గాలేదు. ఏల లేదనగా తమ యీ రచనమునకు మూల గ్రంథమును శ్రీ గురుమూర్తిగారు పేర్కొనిరి. అది "ఆత్మ రామాయణ మను నొక చిన్న వచన గ్రంథము". అయినచో నిక అధ్యాత్మ రామాయణమున కిచట ప్రసక్తి యేమన వచ్చును. ఏమనగా ఈ గ్రంథముమీాద నభిప్రాయ మిచ్చిన శ్రీమాన్ శ్రీనివాసాచార్యగారు "అధ్యాత్మ రామాయణ మును (కూడ) కొందరు తెనుగున వ్రాసిరి. అట్టి వారిలో నా మిత్రులు......గురుమూర్తిగారు" ఒక రనిరి. ఆ యభిప్రాయమును శ్రీ గురుమూర్తిగా రీ గ్రంథముఖమున ముద్రింపించిరి. అందువలన నీ ఆత్మ రామాయణమునకు అధ్యాత్మ రామాయణ సంబంధ మనుమానింపవలసి వచ్చుచున్నది. మరియు నిందుకు తోడుగా నిందలి కొన్ని పద్యములు అధ్యాత్మ రామాయణ శ్లోకములకు ననువాద రూపమున నున్నవి. మరియు అధ్యాత్మ రామాయణము వలెనే ఇదియు పార్వతీ పరమేశ్వర సంవాదాత్మకమనియే చెప్పబడినది. అయినచో అధ్యాత్మ రామాయణమున కిది తెనుగు సేత యనవచ్చును గదా అనవచ్చును. అట్లనుటకును వీలు పడుటలేదు. ఏమనగా అధ్యాత్మ రామాయణమున సాగిన విషయ విన్యాస ఫక్కికిని, ఈ ఆత్మ రామాయణమందలి ఫక్కికిని సాదృశ్యము లేదు. మరియు వాల్మీకి మహర్షియే తన శిష్యుల కీ ఆత్మ రామాయణమును వినిపించినట్లుగా నిందు గలదు. అధ్యాత్మ రామాయణమున నీ ప్రసక్తి కాన రాదు. పైపెచ్చది వ్యాస ప్రోక్తముగా వినబడు చున్నది. అదియునుగాక శ్రీ గురుమూర్తిగారు "ఆధ్యాత్మిక విషయములను వివరించుటలో వాసిష్ఠ రామాయణము, విచిత్ర రామాయణము తోడ్పడె" నని మాత్రమే పేర్కొనిరిగాని అధ్యాత్మ రామాయణము పేరెత్తలేదు. ఈ ఆత్మ రామాయణ మునకు మూల మనబడెడి ఆ వచన గ్రంథము నెవరు ఎప్పుడు రచించిరో—అది యెప్పు డెక్కడ ప్రకటింపబడినదో గూడ శ్రీ గురుమూర్తిగారు తెలిపి యుండలేదు. బహుశః వారికిని ఆ వివరములు తెలియ వచ్చు స్థితిలో నా వచన గ్రంథ ముండి యుండక పోవచ్చును—పరిస్థితు లిట్లున్నవి గనుకనే అధ్యాత్మ రామాయణమునుబట్టి ఆత్మ రామాయణము వ్రాయ బడినదని చెప్పుటకును వాతావరణ మంత అనుకూలము లేదనుట.

"మూలగ్రంథ మనిపించుకొన్న ఆత్మ రామాయణమునందలి పాత్రలకు వాడబడిన యాధ్యాత్మిక సంబంధమగు సాంకేతిక నామములనే నేను గూడ యున్నవి యున్నట్లు వాడితిని.....మూలగ్రంథములోని విషయములకు, నా స్వంత భావములును, అనుభవమును జత చేసి వ్రాసితిని. రామకథయందు తెలిపిన దగుటచే, కథను బెంచక, యాధ్యాత్మిక విషయములకే ఎక్కువ ప్రాధాన్య మొసగుచు, రచన నంతయును స్వతంత్రముగనే నడిపితిని. నేను కవినని చెప్పుకొను సాహసము నా కడలేదు." అను ఈ మొదలైన శ్రీ గురుమూర్తిగారి "మనవి మాట"లను జాగ్రత్తగా విన్నచో ఆయన నిజాయితీ లక్షణము తెలియును. పరతాత్త్వభిముఖమ్మైన రామ భక్త్యాత్మక చిత్తవృత్తి కలిమిని వ్రాయబడిన ఈ ఆత్మరామాయణ మొక వేదాంత కావ్యము. ఇంకను అనినచో మర్మ వేదాంత కావ్యమనవచ్చును. ఇట్లనుటవలన సాహిత్య విమర్శనాధ్వములోని రసము—ప్రౌఢము—పాత్ర చిత్రణము—భావ గాంభీర్యము—శైలి—వర్ణన—ఇత్యాది శబ్దముల నుపయోగించి ఈ

గ్రంథమును ప్రశంసించుటగాని నిరసించుటగాని పద్ధతి కాదని చెప్పుట యగుచున్నది.

ఇందు పాత్రలకు వాడబడిన ఆధ్యాత్మిక సాంకేతిక నామము లిట్లున్నవి.—రాముడు విజ్ఞానరూపుడు; లక్ష్మణుడు వివేకరూపుడు; శత్రుఘ్నుడు విచారపరుడు; భరతుడు వైరాగ్యరూపుడు; కౌసల్య నివృత్తి; కైకేయి ప్రవృత్తి; సుమిత్ర భక్తి; దశరథుడు మనోరూపుడు; విశ్వామిత్రుడు విశ్వాసరూపుడు; రావణుడు అజ్ఞాన స్వరూపుడు; మారీచుడు కామరూపుడు; తాటక భ్రాంతి; రాముడు తాటకమీద ప్రయోగించిన బాణము పేరు నిర్వాణము; సీత శాంతి; హరకార్ముకము అహంకారము; పరశురాముడు ప్రేమరూపుడు; కుశధ్వజుడు కైవల్యరూపుడు; వూర్మిళ నమ్రరూపిణి; మాండలి విరతి; శ్రుతకీర్తి సమత; ఈవిధముగా నిందు ప్రతి పాత్రమునకును సాంకేతిక నామ మొకటి యున్నది. అత్రి అకర్మ స్వరూపుడు. అనసూయ ధృతి రూపిణి. అగస్త్యుడు అద్వైత రూపుడు. శూర్పణఖ తృష్ణా స్వరూపిణి. ఆంజనేయుడు సత్సంగ రూపుడు. తార తితిక్ష—ఇట్లంతటను చూచుకొనవచ్చును.

రామాయణ కథ ఆధారముగా ఆత్మ తత్త్వమును సాధకులకుపాదేయమగునట్లుగా నిందు పొందుపరచు ప్రయత్నము పుష్కలముగా చేయబడినది. ఆత్మ తత్త్వమనగా పరబ్రహ్మ తత్వము. అది అద్వైత రూపమనియు తదావాప్తికి భక్తి మార్గమనియు నిందు బహు విధముల ప్రతిపా
పబడినది. పరతత్త్వము నిర్గుణాత్మకమను అచ్చ
లివి కలిమికి సగుణోపాసనము సాధన మార్గ
్వైత వేదాంత మిందు బహుముఖముల
ుల బహు పాత్రములవలన సరళ
చూపబడినది. ఇందు కనుగుణముగా
గారు శ్రీ రామాయణ పాత్ర
ఉపయోగించిరి. ఇందు తామెవరో
గా తెలిసిన పాత్రములే ఎక్కువ.
లిసిన వారిచేత తెలియజెప్పబడినవి. శ్రీ గురుమూర్తిగారు వేదాంతమును గహనము చేయక పోవుటయేగాక ఒలిచిన అరటి పండునుగా చేసి అందించిరి. ఆత్మతత్త్వము నెరిగినవారిలో శ్రీరాముడు ముఖ్యుడు. అసలు కథలో ఆయన శోక విహ్వలు డగుట యున్నది. ఆ విహ్వలత్వమును సూచించుచు అందు కాయన మాయను గ్రహించుట హేతువని శ్రీ గురుమూర్తిగా రెచ్చటి కచ్చట చెప్పుచు కథను నడిపించిరి. ఆత్మ స్వరూపుడైన శ్రీరాముని నిజ తత్త్వమును విశదీకరించిన వారిలో అనసూయాదేవి, అగస్త్యుడు, లక్ష్మణుడు ముఖ్యులు. శ్రీ రాముడే స్వయముగా తన స్వరూప లక్షణమును భరతునకు, లక్ష్మణునకు, శబరికి, వాలికి, రావణునకు, హనుమానునకు నుపన్యసించినాడు. ఈయన్నింటి యందును మోక్షార్థియైన జీవునకు వివేకమును కలిగించుట పరమ ప్రయోజనముగా నిరూపింపబడియున్నది. నారదుడు శ్రీరాముని సమక్షమున నామ జప మహాత్మ్యమును గూర్చి చెప్పినది సాధకోపదేశము లన్నింటిలోను శ్రేష్ఠమైనదిగా కనిపించుచున్నది.

వేదాంత కావ్యములయందు పునరుక్తి గుణము. తద్గుణ గరిష్ఠమైన కావ్యమిది. ఉపదేశ మెప్పుడును దృష్టాంత పూర్వకముగను, ఉపమాన సహితముగను నుండును. ఆ రెండు అలంకారములును ఈ కావ్యమున నెంతవరకుపయోగపడునో అంతవరకు కుపయోగింపబడినవి. లోక మెంత బాగుగా తెలిసిన ఆ యలంకారములనంతగా వినియోగ పరచుకొనవచ్చును. శ్రీ గురుమూర్తిగారి లోకజ్ఞత్వము సిద్ధిని పొందియున్నట్లగపడుచున్నది. వేదాంత విషయ పరిజ్ఞానవశమున పరిణతమైన శ్రీ గురుమూర్తిగారి మనః ప్రపంచముయొక్క వైచిత్రిని కిష్కింధా కాండమునందలి వర్షర్తు వర్ణనమునుబట్టి భావింపవచ్చును. మరియు శ్రీ గురుమూర్తిగారు చేసిన దశరథుడు, గౌతముడు, జనకుడు, అయోధ్య, మంధర, చిత్రకూటము, పంచవటి మొదలైన నామ నిర్వచనముల విషయము కూడ పైవైచిత్రి కుపస్కార

కములుగనే ఉన్నవి. అయినను ఈ విషయమును నిదానించి చూచుకొనవలయును. బాలకాండమున 14, 15, 384 పద్యముల యందును, అయోధ్య కాండమున 6, 7 పద్యముల యందును దశరథ, అయోధ్య నామముల సంకేత లక్షణము చెప్పబడినది. దేహము రథము—దేహమే అయోధ్య, ఇంద్రియములశ్వములు—ఇంద్రియములు స్యందనములు. బాలకాండము 133 వ పద్యమున గౌతమ నామ నిర్వచనమున్నది. "దమము వీడగ దాను గౌతముడు నయ్యె". మొదటి పాదమున "యుద్ధత మతి" అని యున్న దానికి "దమము వీడగ" అనుకూలముగా నున్నట్లే యున్నది. కాక "తమము వీడగ" అగుచో గౌతమ శబ్దమున కట్టి అర్థ మెట్లు సంపాదింపనగునో చూచుకొనవలయును. అయోధ్య కాండమునందలి 77 వ పద్యమునందలి 'మంథర' విషయము గూడ పై దానివంటిదే. 419, 420 పద్యములందున్న చిత్ర కూట విషయము రమణీయముగా నున్నది. అట్లే అరణ్య కాండమున 85 వ పద్యమున "పంచవటి" వివరింపబడినది.

ఈ రామాయణ కథకుడు వాల్మీకియే గనుక సీతారాములు వాల్మీకి ఆశ్రమమునకు వచ్చిన కథను చెప్పుచో ఉత్తమ పురుష అయిన ఇంకను రమ్యముగా నుండెడిది. కాండాంత పద్యములు వ్రాయుచో మొదటి రెండు కాండములయందువలెనే అన్ని కాండముల యంతమునను లలితాంబాస్తుతి రూపకమైన పద్య మొకటి యున్న బాగుండెడిది. ఈ గ్రంథకర్త ఆధునికుడైనందున సీతారాముల వివాహ సందర్భమున "బాణాసంచుల"ను కాల్పించుటను అంగీకరించినను, సంపాతి తన తమ్ముడైన జటాయువున "కాత్మ శాంతి గల్గ బ్రార్థించి" నాడనుట అంగీకారముకాదు. అది మన సంప్రదాయముకాదు. అందును నిట్టి గ్రంథమున సంప్రదాయాతిరిక్తత పనికిరాదు. యుద్ధకాండమున 203 వ పద్యము నాల్గవ పాదమున యతి తప్పినది.

అధ్యాత్మ రామాయణ శ్లోకముల కనువాదము లిందున్న వంటిని. ఉదాహరణార్థ మొక్కటి. "రామేణ విష్ణు నా దృష్టా హరయో దివిజాంశజాః, బభూవు ర్బలినో హృష్టా స్తదా పీతావృతా ఇవ" (యుద్ధ కాండ 5 వ సర్గ) "విష్ణువైన రామ వీక్షణంబున, దేవతాంశమందు జనన మందియున్న, కపివరేణ్యులైన కారణ జన్ములు, సుధను గ్రోలియుంట సొక్కరైరి." (యుద్ధకాండ 93) మరియు శ్రీమద్భగవద్గీతాగత విషయమును ఛాయామాత్రముగ నిందున్నది. మొత్తము మీద సాధకోపదేశ లక్ష్య బుద్ధితో భక్తి యోగాభిముఖముగా ఆత్మరామతత్వమును విశద పరచుచు శ్రీ గురుమూర్తిగారు రచించిన ఈ వేదాంత కావ్యము ముముక్షు జన సంసేవ్యముగా నున్నది.

—క్షేమేంద్ర.

## సమకాలిక భారతీయ సాహిత్యము

[ప్రచురణ : సాహిత్య అకాదెమీ, రవీంద్రభవన్, న్యూఢిల్లీ—1. అనువాదం: శ్రీ తల్లావజ్ఝుల కృత్తివాస తీర్థులు, వెల : రూ. 8.]

' భారతదేశంలోని ముఖ్య భాషలలో ఆదికాలం నుంచీ నేటి కాలం వరకూ సాహిత్యం ఏయేధోరణులలో ప్రవర్ధమానమవుతూ వచ్చిందీ తెలుసుకోవడానికి దేశీయులకూ, విదేశీయులకూ అవకాశం కలిగించే ఉద్దేశంతో సాహిత్య అకాడెమీవారు విద్వత్‌గోష్ఠి వంటి ఈ గ్రంథాన్ని మొదట 1957 లో ఆంగ్లంలో ప్రచురించారు. 1959 లో దీని రెండవ ముద్రణ పునర్విమర్శతో మరికొన్ని చేర్పులతో వెలు వడింది. దాని ఈ తెలుగు అనువాదం 196
ప్రకటితమైంది. అసలులేని దానికన్న
వచ్చినా కొంత మేలే అన్న లోకోక్తి
పాఠకలోకం దీన్ని స్వీకరించవలసి
ఆ యా భాషల సాహిత్యాలు వాటి రచ
మిట్లున్నది. అస్సామీ సాహిత్యం:
బారువా ;ఒరియా: మాయాధర్ వ
ఖాజా అహ్మద్ ఫారూఖీ; కన్న

కాశ్మీరీ : వి. యస్. పుష్ప్; గుజరాతీ: మన్సుఖ్‌లాల్ ఝవేరి; తమిళం: టి. పి. మీనాక్షిసుందరం; తెలుగు: కోలవెన్ను రామకోటేశ్వరరావు; పంజాబీ: ఖుష్వంత్ సింగ్; బెంగాలీ : ఖాజీ అబ్దుల్ వదూద్; మరాఠీ: ఎం. వి. రాజాధ్యక్ష; మళయాళం : సి. కున్హన్ రాజా; సంస్కృతం : వి. రాఘవన్; సింధీ : ఎల్. హెచ్. అజ్వానీ; హిందీ : ఎస్. హెచ్. వాత్స్యాయన్; భారతీయాంగ్లసాహిత్యం: కె.ఆర్.శ్రీనివాసఅయ్యంగార్. ఆ యా సాహిత్యాలను గూర్చి వీరు బాగా ఎరిగినవారు. ఒక్కొక్క సాహిత్యాన్ని గూర్చి దాని పుట్టుక మొదలు అనేక పరిణామాలను వివరిస్తూ నేటి కాలం వరకూ దాని పోకడలను చర్చించారు. కాకపోతే ఆధునిక యుగం వచ్చేసరికి తామెరిగిన అంశములను గూర్చి బాగా చెప్పి, తక్కిన వానిని కొంత విస్మరించడమో, అందరికీ ఆమోద యోగ్యంకాని అభిప్రాయాలను వ్యక్తం చేయడమో జరిగింది. సమకాలిక రీతులను గూర్చి, రచయితలను గూర్చి ఎవరు వ్రాసినా ఈ ఇబ్బంది ఉండేదే. కాకపోతే సమీక్షకునిబట్టి తర తమాలు ఉంటాయి. ఈ ఇబ్బందినిగూర్చి హిందీ సాహిత్యం విషయమై వ్రాసిన శ్రీ వాత్స్యాయన్ వున్న స్థితిని చక్కగా చెప్పాడు. ఏమైనా రాగద్వేషాలు లేకుండా ఒకవైఖరికి అంటి పెట్టుకోనివిధంగా సమీక్ష సాగినప్పుడు న్యాయమే జరుగుతుంది. ప్రమాదాల సంఖ్య తగ్గుతుంది. సమీక్షకులు ఈ సంపుటిలో ఆ ప్రయత్నం చేశారు. ప్రాచీన అధునాతన భారత సాహిత్య స్వరూపం ఇందులో దిక్ప్రదర్శకంగా వచ్చేసింది.

ఇట్టి గ్రంథమును అనువదింపజేయునప్పుడు తగిన అనువాదకుణ్ణి ఎన్నిక చేయవలసి ఉంటుంది. అతనికి భారతీయ భాషలలో ఎన్నింటితో పరిచయముంటే అంతమంచిది. సాహిత్య ధోరణులను గూర్చి ఎంత విపులంగా తెలిసివుంటే అంత మేలు. వాడుకలోవున్న పారిభాషిక ప్రయోగములు, ఇతర భాషలలో ఏ యే మార్పులతో వాటిని వాడుతున్నదీ ఎరిగి ఉండడం అవసరం. ప్రస్తుత అనువాదంలో ఎన్నో లోపాలు కన్పిస్తూ ఉన్నవి. తెలుగులో వాడుకలోవున్న ప్రయోగాలు ఇవ్వక తమకు తోచినవి వ్రాశారు. Middle class people అంటే మాధ్యమిక ప్రజలు అన్నారు. మధ్య తరగతి ప్రజలని వాడుకలోవుంది. National upheaval కు జాతీయ భావోల్బణము అని వ్రాశారు. Scientific literature అంటే గాఢ విషయాత్మక సారస్వతమట! intellectuals అంటే బుద్ధిమంతులట. pen portraits అంటే రేఖా చిత్రణమట. వ్యక్తులను గూర్చి వ్రాయడం. reportage అంటే లోక వృత్త కథనమట. ఇంత పెద్ద మాట దేనికి? పత్రికలకు వార్తలు వ్రాయడం అనవచ్చుగా! Sacred literature అని మూలంలోవుంటే పవిత్ర సాహిత్యమని వ్రాశారు. అంటే వేదాలు, ఉపనిషత్తులవంటి సాహిత్యం. గ్రంథకారవర్గము అనే ప్రయోగ మొకటి చేశారు.అనగా Class of writers అని!Land mark అంటే సీమాంతశిల అనీ, Suggestiveness కు వ్యంగ్య వైఖరి అనీ వ్రాశారు. మొదటి మాటకు ఆ అనువాదం అనవసరం. రెండవ దానికి ధ్వనిప్రాయమైన రచన అంటే విశదంగా ఉండేది. మరికొన్ని అనువాదాలు ఇట్లున్నవి : Stage—రంగశాల; Painting—ఆలేఖ్య శిల్పం; Past Heritage—గత పారంపర్యం; Birthday anniversary—జన్మోత్సవ వేళ; World Short Story Competition—ప్రపంచ కథల స్పర్థ; Phantasy—స్వాప్నిక భావ నాటిక; Sentimentalism—భావతన్మయతావాదం; New Testament—నూతన నిబంధన; Mannerism అలవాటు; Claissical revival—మహాగ్రంథోద్ధరణ. ఈ చివరి అనువాదానికి మరొక అర్థంకు వస్తుందే అని ఆలోచింపలేదు. Platonic lov అంటే మహా ప్రణయము అన్నారు. కాని ఆంధ్రక దానిని అమలినశృంగారమనీ, కామవాంఛ లేని ప్రేమ అన్నారన్న సంగతి మరచిపోయారు. ఆంగ్లం వాక్యాలకు మక్కికి మక్కి అనువాదానికి ఒక వ తునక. "మానవుణ్ణి, పకృతినీ, ఈశ్వరుణ్ణి క్ష ఫకీర్ మోహన్, రాధానాథ్, మధుసూదనులు ప్రధాన భావాంకురాలుగాపెట్టుకొన్నారు'.కొన్ని అనువాదం మూలానికి భిన్నంగా ఉంది. Ther crop of Satiric literature in Urdu అ

'ఉరుదూ విశిష్టత దాని సుసంపన్నమైన వ్యంగ్య హేళనాత్మకు సాహిత్యమువల్ల వచ్చింది'' అని వ్రాశారు. 1914 is the year of destiny in Gujarati literature అన్న వాక్యానికి ''1914 సంవత్సరములో గుజరాతీ సాహిత్యానికి అదృష్టం పట్టింది'' అని తెనిగించారు. గుజరాతీ సాహిత్య భవితవ్యం 1914 లో నిర్ధారితమైంది అని ఉండాలి. In the present context, this is of historical interest only అని మూలంలో వుండగా, ''ప్రస్తుత సందర్భంలో దీనికి ఐతిహాసికమైన వినోదమే కలదు'' అని ఆంధ్రీకరించారు. Literature is a sacred instrument అన్న దానికి ఈ పుస్తకంలో 'సాహిత్యము పవిత్ర స్థానము' అని పడింది! Hindi has been the language of the region which has borne the brunt of the history అంటే 'హిందీ ఐతిహాసిక ఘటనల ఘర్షణకు తట్టుకున్న ప్రాంతీయ భాషగా ఉండేది' అన్నారు. కనీసం ప్రాంతపు భాష అని కూనా వ్రాశారుకారు! ఉమ్రావ్ జాన్ అదా అనే జీవిత చరిత్ర ప్రసక్తి వచ్చినచోట అనువాదకుడు ఆ పుస్తకమును నవల అన్నారు. అది నవలకాదు. ఒక నర్తకి జీవిత చరిత్ర. అక్కడే poetically surnamed Ada అన్న దానిని వదిలివేశారు. మావ్‌జాన్ అనేది నర్తకిపేరు. 'ఆదా' అనేది ఉపనామము. హిందీ ఉర్దూ కవులు వారి అసలుపేరుతో పాటు ఒక ఉప నామాన్ని పెట్టుకోవడం అచారం. ఉదాహరణకు రామధారీ సింహ 'దిన్‌కర్' సూర్యకాంత త్రిపాఠీ 'నిరాలా', ప్రేమ్‌చంద్ 'మూక పీడిత పశువులకు వాక్కును ప్రసాదించినాడు' అని వ్రాశారు. అంటే నోరులేని పశువులవంటి పీడితులకు ప్రేమ్‌చంద్ వాణిగా రచన చేశాడని. ఉర్దూ కవుల పేర్ల ఉచ్చారణ చాలాచోట్ల తప్పులు పడ్డాయి. హజ్రత్ మోహానీ కాదు, హస్రత్ మోహానీ, ఇస్మాత్ కాదు, ఇస్మత్. హిందీలో ప్రగతివాదము, ప్రగతివాదము అని వాడుతారు. దానిలో వాటిని అలాగే వ్రాశారు. అంటే మన తెలుగులో కాల్పనిక కవిత్వము, అభ్యుదయ కవిత్వము అనుట. ఒకచోట స్వర్ణ విజయ నగరయుగము అనక విజయనగర సామ్రాజ్య స్వర్ణయుగమున్న వచన కవిత అంటే కథ కవిత అని బ్రాకెట్లో Blank verse కు బ్లాంక్ ఛందమని సర్వత్రా వ్రాసుకుపొయ్యారు. సజాతీయ భాషారాష్ట్ర నిర్మాణ మట. అదేమిటో! గుజరాతీ సాహిత్యమును గూర్చి వ్రాసిన వారి పేరు తెలుగులో యస్. సుఖ్‌లాల్ ఝవేరి అని పడింది. అట్లే గోఖక్ అని వుంది. ''ఉరుదూ యావత్ ఉద్రిక్త లోకముకోరే ఉల్లాసనమూ వర్ధనక్షమత్వమూ కల భాషకాదు'' అని తెనిగించారు. దీని భావ మేమిటో తెలుసుకోవాలంటే మూలం వెదకవలసిందే. వెదకగా తేలిన భావం ఇది: ఆనాడు దేశమంతటా ఒక విధమైన అలజడి వ్యాపించి వుంది. ఆ అలజడికి ఓజస్సు, తేజస్సు, ప్రోద్బలం అవసరమయ్యాయి. వాటిని ఉర్దూ సమకూర్చలేకపోయింది. తెలుగు సాహిత్య ప్రకరణం అనువాదం బాగున్నది. ఏమైనా ఈ మొత్తం పుస్తకం అనువాదం పాఠకులచే చదివించేట్లులేదు. కొన్నిచోట్ల అనవసరంలేని అర్థంకాని పదజాలం వాడబడివుంది. పుస్తకం తెల్ల కాగితంపై ముద్రింపబడివుంటే బాగుండేది. ఒక మాదిరిగా అచ్చు తప్పులున్నాయి.

—వాణీకుమార.

## గీతాలావణ్యము

(భగవద్గీతాంధ్రానువాదము)

(రచయిత: శ్రీ నిష్ఠల సీతారామశాస్త్రి, ఆంధ్రోపాధ్యాయుడు, సంస్థాన బహుశార్థ సాధక పాఠశాల, బొబ్బిలి. వెల రు. 2—50 ప్రతులకు రచయితకే వ్రాయవలెను.)

ఈ గ్రంథము ద్విపదలోనున్న గీతాసారము. శ్రీ వేంకటేశ్వరస్వామివారి కంకితము. ఆధ్యాత్మిక విద్యావిదుషీమణి శ్రీలక్ష్మీసుభద్రాదేవి (బొబ్బిలి మహారాజ్ఞి) వారు ఈ గ్రంథమునుసమాదరించి ముద్రణాభరమును వహించిరి. దీనికి సాహిత్య విద్యాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ, శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మ ఎం. ఎ., పి. ఒ. ఎల్ (సంస్కృతాధ్యాపకుడు, ఆంధ్ర విశ్వవిద్యాలయము)గారు పీఠిక వ్రాసిరి. శ్రీ డాక్టరు దివాకర్ల వేంకటావధాని (ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రభాషా శాఖాధ్యక్షులు) తొలి పలుకు నుడివిరి. శ్రీ డా. పి. వి. రాజమన్నారు,

# గ్రంథవిమర్శలు

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ, శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగార్లు ప్రశంసా వాక్యములు పలికిరి.

ఈ గ్రంథకర్త బహు వినయసంపన్నుడు, సంప్రదాయనిష్ఠుడు. తనకు భగవద్గీతపై గల భక్తిగౌరవముల నీ గ్రంథరూపముగ వెల్లడించిన వాడు. ప్రస్థానత్రయములో స్థానము గల భగవద్గీతకు ప్రపంచ విస్తారమైన ప్రాచుర్యమున్నది. దానికి అనేక వ్యాఖ్యానములు వివరణములు వెలసినవి. శ్రీ రామచంద్రానంద సరస్వతీస్వామివారు వ్రాసిన వివరణము ఈ గ్రంథకర్తగారు తరచు చదువుట వలన కలిగిన ఉత్సాహముతో భావప్రధానముగా నీ ద్విపదగ్రంథమును రచించిరి.

పండితులైనఈ గ్రంథకర్తగారు, సలక్షణమై, తేటతెల్లమైన చక్కని భాషనుపయోగించిరి. ద్విపదలు గ్రంథము నందన్ని భాగములలో ధారా శుద్ధిగా నిండుతనముగా నడచినవి.

విశ్వరూప సందర్శన యోగమునందు సంతరించిన దండకము భుజంగ ప్రయాతలు సముచితముగా న్నవి.

గురువుల ఆశీర్బలము, భక్త్యుత్సాహములు, సంప్రదాయ విజ్ఞానము, భాషా పాండిత్యము సమృద్ధిగా గలిగిన ఈ రచయిత, ఈ అనువాదమును ఉత్తమ స్థాయిలో నిర్వహించిరనుట అతిశయోక్తికాదు. పీఠికా కర్తలన్నట్లు గ్రంథకర్తగారి ఆత్మజ్ఞత, అహంకార నిరాసనము, కార్యదీక్ష, గ్రంథములో ప్రస్ఫుటముగా నున్నవి.

అనువాదమంతయు భావప్రధానముగా—మూలాతిక్రమణములేక సంప్రదాయసిద్ధిగా నున్నది.

భగవద్గీత శాస్త్రగ్రంథము. ఇట్టి దానికి వర్తమాన కాలమున జనబాహుళ్యమునకు అక్షరజ్ఞానమున్న ప్రతివారికి—అవగాహన కాగల—అతి తేలిక మాటలలో వివరణములు కావలసి యున్నవిగాని—మూల గ్రంథమువలెనే చందోనిగూఢములుగా, పదబంధములుగా రచింపబడిన వానివల్ల విస్తృత ప్రయోజన ముండదు. ప్రజాబాహుళ్యమునకు జరుగవలసిన మేలు జరుగదు. ఇది సాహిత్య గ్రంథముకాదు. పండితులు ఈ అనువాదమును చదువరు. పామరులకు తేలిక పదములతో వచనము కావలెను. మరి ఈ గ్రంథ మెవ్వరికొరకు?

పండితులై, సంప్రదాయనిష్ఠులై, ఆత్మజ్ఞానవేత్తలైన ఈ గ్రంథకర్తవంటివారు సామాన్య పామరజనులయం దాదర బుద్ధులై గీతాప్రచారము చేయు నుద్దేశముతో వచన వివరణములు ప్రచురింప వలసి ఉన్నది. ఇది దోషైక దృక్కుతో వ్రాసిన మాటకాదు. దేశమునందున్న ఆవశ్యకత నిరూపించుటకు. దానికి సమర్థులైనవారు కదా పూనుకొన వలసినది!

గ్రంథాంతమున తప్పొప్పుల పట్టిక పుష్టిగా నున్నది. ఇది గ్రంథమునకున్న లావణ్యమునకు ప్రతిబంధకముగా నున్నది.

పట్టికలో చేరని స్వల్పశాబ్దిక దోషములు మరికొన్ని యున్నవి. ద్వితీయ ముద్రణము నందవి సవరింపబడగలవని భావించవచ్చును.

జ్ఞానయోగమున సుగతశబ్దము (సుగతులై విజ్ఞానశుద్ధులౌతారు) 'మంచి నడవడిక గలవారు' అన్న అర్థముతో (అధోజ్ఞాపిక) ప్రయోగింపబడినది. ఈ సుగత శబ్దమునకు వేదాంత పారిభాషికముగా ప్రత్యేకమైన రూఢి అర్థమున్నది. అట్టి పరిస్థితిలో ఈ వేదాంతగ్రంథమున తద్విరుద్ధమైన అర్థముతో ప్రయోగించుట సమంజసముగా లేదు.

గీతాపరమేశ్వరుని అనుగ్రహముతో ఈ గ్రంథ కర్తగారు, ఇంకను అనేకమైన తత్త్వకావ్య వ్యాఖ్యా రూపములైన గ్రంథములు రచించి ఆంధ్ర ముముక్షు లోకము యొక్క కృతజ్ఞ గడించుకొందురు.

## స్తోత్ర గీత మాలా

దీనిని శ్రీ జి. వెంకటాచలశర్మ సంకలితం చేశారు. సంస్కృత గ్రంథము. భక్తులకు ఉచితము. ఇతరులు 50 పైసలుపెట్టి కొనుక్కోవలెను. ప్రతులు : మద్రాసు (20) నందలి గాంధీనగర్‌లోని ఆరోగ్యాశ్రమమునందు దొరుకును.

## సమరభారతి

కవితాసంకలనము. ఇందులో శ్రీయుతులు కాళోజి, అనుముల కృష్ణమూర్తి, భండారు సదాశివరావు, ముదిగొండ వీరభద్రయ్య ప్రభృతుల ఖండకావ్యములు సంకలితము చేయబడినవి. సమీకర్త శ్రీ వే. నరసింహారెడ్డి. వెల: "రూపాయికి తక్కువకాకుండా". ప్రతులకు శ్రీ చింతల నరసింహులు, బుక్‌సెల్లర్సు, హనుమకొండకు వ్రాసుకొనవలెను.

## కనువిప్పు (నాటిక)

రచయిత శ్రీ. కె. ఆర్. కె. మోహన్. శ్రీముఖ పబ్లికేషన్స్, మచిలీపట్నం వారి ప్రచురణ. వెల : రు. 1—50.

## ఉన్మాది

ఇది పద్యగ్రంథము. గ్రంథకర్త శ్రీ వి. వి. చలపతి. వెల : రు. 1—60 లు. శ్రీ విశాలాక్షి గ్రంథాలయము, వడ్లమూడి, గుంటూరుజిల్లావారు దీనిని ప్రచురించారు.

## సర్వవీరశ్రీకృష్ణరాయము

ఇది పద్యకావ్యము. కృష్ణరాయచరితము. శ్రీ అక్కిపెద్ద సత్యనారాయణ రచించగా, విజయవాడ యందలి 'శ్రీ అండ్ కో' వారు ప్రకటించిరి. ధర : మూడు రూపాయలు.

## ఉదయగిరి దుర్గము

పద్యకావ్యము. గ్రంథకర్త : శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరరావు; మూల్యము:రు. 1—25 లు. ప్రతులకు గాను గ్రంథకర్త, నెల్లూరు జిల్లాలోని క్రొత్తపాళెమునకు వ్రాసుకొనవలెను.

## మల్లెలు

ఇది కథల పుస్తకము. శ్రీ "కరుణ" ఆ కథలను మాల కట్టారు. ఇందులో శ్రీయుతులు రామకృష్ణ, భాస్కర్, రామచంద్రం, నళినీరంజన్, దివాకర్‌ల కథలు ఉన్నాయి. విజయవాడలోని దేశీబుక్‌డిస్ట్రిబ్యూటర్సువారు ప్రకటించారు. వెల: రు. 2—50 లు.

## దైవహతులు

నవల. వెల : రూపాయి. రచయిత : శ్రీ నరిశేపల్లి లక్ష్మీనారాయణ. ప్రాప్తిస్థానము : గ్రంథకర్త, రోషన్నవీధి, తిమ్మనచర్ల. (పోస్టు) గుంతకల్లు.

## విజయగీతావళి

చైనా దురాక్రమణపై ప్రముఖ భారతీయ కవులు వ్రాసిన గేయపద్య సంపుటి; భారత ప్రభుత్వం పబ్లికేషన్స్ డివిజన్‌వారు దీనిని ప్రకటించారు. వెల: రూపాయి.

## ఆంధ్రదేశ హాస్యకథా

ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీవారు ఈ గ్రంథాన్ని ప్రచురించారు. ఇది సంస్కృత గ్రంథం. తెలుగులో ఉన్న తెనాలిరామలింగనికథలు, పరమానందయ్యకథలు ఇందులో శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిచే సంస్కృతీకరించబడినవి. వెల : 75 పైసలు.

---

ted & Publish[illegible] or Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna
The Andh[illegible] [illegible]trika Press 6 & 7. Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.